నెహ్రూ బాల పుస్తకాలయం

# స్వామి-మిత్రులు

ఆర్. కె. నారాయణ్

అనువాదం

డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవి

చిత్రాలు

మనోభిరామ చక్రవర్తి




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయ సూచిక

## అధ్యాయం 1

# సోమవారం ఉదయం

### 1

అది సోమవారం ఉదయం. స్వామినాథన్‌కు కళ్ళు తెరవాలని లేదు. క్యాలండర్‌లోని సోమవారం అంటే బొత్తిగా నచ్చదు. శని, ఆదివారాలు ఆనందంగా, స్వేచ్ఛగా గడిపి, సోమవారం క్రమశిక్షణతో కూడిన రోజువారీ కార్యక్రమంలో మనసు దూర్చడం కష్టమే మరి! స్కూలు గుర్తురాగానే గుండెలో గుబులు పుట్టింది. బొత్తిగా ఆకర్షణ లేని ఆ పసుపుపచ్చ భవనం, నిప్పు కణికల్లాంటి ఎర్రటి కళ్ళ క్లాసు టీచరు వేదనాయగం, సన్నటి పేము బెత్తంతో హెడ్‌మాస్టరూ...

ఎనిమిది గంటలకల్లా, తండ్రి బట్టలు మార్చుకొనే గదిలో ఓ మూలగా ఉన్న రాతబల్ల ముందు కూర్చున్నాడు స్వామినాథన్. ఒక టేబుల్‌మీద అతడి కోటూ, టోపీ, సిరాబుడ్డీ, పలకా, పుస్తకాలూ వగైరా కుప్పగా పడి ఉన్నాయి. స్టూలుమీద కూర్చుని, కళ్ళు మూసుకొని ఆ రోజు తను చెయ్యవలసిన పనుల గురించి ఆలోచించసాగాడు. అవును! మొదట లాభనష్టాలను తేల్చే ఐదు లెక్కలు చెయ్యాలి. ఇంగ్లీషు పాఠంలోనుంచి ఒక పేజీ చూచి రాత రాయాలి. అందులో వచ్చిన కఠిన పదాలకు అర్థాలు శబ్దకోశం చూచి రాయాలి. ఇంక భూగోళం ఉండనే ఉంది...

ఈ పనులన్నీ చేసి స్కూలుకు బయలుదేరడానికి ఇంకా రెండు గంటల సమయం మాత్రమే ఉంది.

### 2

నిప్పుకళ్ళ వేదనాయగం, నిలువెత్తు కిటికీ వైపుకు వీపు పెట్టి క్లాసులో కూర్చుని ఉన్నాడు. కిటికీ కమ్మీలనుంచి కొద్దిపాటి డ్రిల్లు మైదానమూ, చిన్న పిల్లలు చదువుకొనే వరండాలోని ఒక మూలా కనిపిస్తున్నాయి. ఎడం వైపున ఉన్న పెద్ద పెద్ద కిటికీలగుండా, విశాలమైన మైదానాలూ, వాటిని ఆనుకొని రైల్వే కట్టా కనిపిస్తున్నాయి.

వరండాలో పసిపిల్లలు వంకరటింకరగా నడుస్తూ ఒకరిమీద ఒకరు పడ్తూ లేస్తూ ఉండడం, సరిగ్గా 12-30 గంllలకు రైలు కట్టమీదుగా పాకుతూ వెళ్ళి,

సరయు నది వంతెన ఎక్కి, దడదడా శబ్దంచేస్తూ మెయిలు బండి సాగిపోతుంటే, ఎడంవైపు కిటికీలోగుండా చూడడానికే స్వామినాథన్ క్లాసులో బుద్ధిగా కూర్చుంటాడు.

మొదటి గంట ప్రశాంతంగా గడిచిపోయింది. రెండో గంట లెక్కల క్లాసు. బయటికి వెళ్ళిన వేదనాయగం, కొద్ది నిముషాల తర్వాత లెక్కల మాస్టరుగా మళ్ళీ వచ్చాడు. బద్ధకంగా నీరసంగా ప్రవేశించాడు. అతడి కంఠస్వరం స్వామినాథన్‌కు చిరాకు కలిగించింది. మహా బోరుగా ఉంది. కునికిపాట్లు పడసాగాడు.

టీచరు స్వామినాథన్‌కేసి చూస్తూ లేవమన్నాడు. హోమ్ వర్క్ చూపించమన్నాడు. స్వామినాథన్ ఒక్క గంతులో టీచరు దగ్గరకెళ్ళాడు. లెక్కల పుస్తకం బల్లమీద పెట్టాడు. టీచరు లెక్కలు చూస్తున్నాడు. స్వామినాథన్ టీచరు ముఖాన్నే చూస్తున్నాడు. అతడి ముఖం దగ్గరగా చూస్తుంటే సాధువుగానే కనిపించింది. అతడి కళ్ళు ఒకదానికొకటి చాలా దగ్గరగా ఉన్నట్టు అనిపించింది. దగ్గరగా చూస్తే గడ్డం చాలా గుబురుగా కనిపించింది. వెనక బెంచీనుంచి చూస్తుంటే అతడి గడ్డం ఇంత గుబురుగా కనిపించదు. ''మొత్తంమీద చాలా అసహ్యంగా ఉన్నాడు'' అనుకున్నాడు స్వామినాథన్ అతడ్ని చూస్తూ.

ఆలోచనల్లో ఉన్న స్వామినాథన్ ఒక్కసారిగా తృళ్ళిపడ్డాడు. ఎడం మోచేతిపై కండంలో విపరీతమైన నొప్పిగా ఉంది. టీచరు ఒక చేత్తో కండ మెలిపెడుతూ, రెండో చేత్తో లెక్కలు కొట్టేస్తున్నాడు. ''వెరీబ్యాడ్'' అని రాసి, నోటుబుక్కు స్వామినాథన్ ముఖంమీదకు విసిరి, వెళ్ళి కూర్చోమని ఆజ్ఞాపించాడు.

ఇప్పుడు చరిత్ర క్లాసు. విద్యార్థులు టీచరు కొరకు ఉత్సుకతతో ఎదురు చూస్తున్నారు. చరిత్ర టీచరు పేరు, డి. పిళ్లై. మంచివాడుగా, హాస్యప్రియుడిగా పేరుపొందాడు. అతడు ఏనాడూ ఏ విద్యార్థినీ కొట్టలేదు, తిట్టలేదు. అతడి చరిత్ర బోధన విద్యావిధానం గీచిన గిరుల మధ్య సాగదు. వాస్కోడిగామా, క్లైవు, హేస్టింగ్సు మొదలైనవారి జీవిత విశేషాలు ఆసక్తికరంగా బోధిస్తాడు. ఆయన యుద్ధాలను వర్ణిస్తుంటే, విచ్చుకత్తుల నిస్వనాలూ, క్షతగాత్రుల ఆర్తనాదాలూ వినిపిస్తున్నట్టే ఉంటుంది. యుద్ధభూమి విద్యార్థుల కళ్ళముందు కనిపిస్తుంది. చడీ చేసేటప్పుడు లేకుండా, వరండాల్లో పచార్లు చేస్తూ, క్లాసులమీద ఓ కన్ను వేసి ఉంచే హెడ్‌మాస్టరుకు మాత్రం అతడంటే గిట్టదు.

ఉదయంపూట ఆఖరి పీరియడు మత గ్రంథ బోధన. పెద్దగా విసుగు కలిగించే క్లాసు కాదు. కొన్ని సమయాల్లో విద్యార్థుల్ని ఉత్తేజితుల్ని చేస్తుంది. ఎర్ర సముద్రం రెండుగా చీలి ఇజ్రాయేలీలకు దారి ఇవ్వడం, శ్యామ్సన్ వీరోచిత శారీరిక విన్యాసాలూ, ఏసు ప్రభువు పునరుత్థానం మొదలైన సంఘటనలు విద్యార్థుల్ని ఉత్తేజపరుస్తాయి. అయితే వచ్చిన చిక్కల్లా ఒక్కటే-అది, ఆ టీచరు మత పిచ్చివాడు కావడం. అతడి పేరు ఎబెనెజార్.

"ఛా! పిచ్చి వెధవలు" ఉన్నట్టుండి అతడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు- "ప్రాణంలేని మురికి చెక్కబొమ్మల్నీ, రాతి ప్రతిమల్నీ పూజిస్తారు. అవి మాట్లాడగలవా? లేదు. చూడగలవా? లేదు. అవి మిమ్మల్ని ఆశీర్వదించగలవా? లేదు, ఆశీర్వదించలేవు. అవి మిమ్మల్ని స్వర్గం పంపించగలవా? లేదు. పంపించలేవు. ఎందుకని? ఎందుకని చెయ్యలేవు? ఎందుకంటే, వాటికి జీవం లేదు. గజనీ మహమ్మదు మీరు పూజించే ఆ విగ్రహాలను పగలగొడ్తూవుంటే మీ దేవుడు ఏంచేశాడు? ఆ విగ్రహాలను గజనీ కాళ్లతో తొక్కినప్పుడూ, మరుగుదొడ్లకు మెట్లుగా ఉపయోగించినప్పుడూ మీ భగవంతుడు ఏం చెయ్యగలిగాడు? ఆ చెక్కబొమ్మల్లో, ఆ రాతి ప్రతిమల్లో నిజంగా జీవం ఉంటే గజనీ దండయాత్రలను ఎందుకు ఢీకొనలేక పోయాయి?"

ఠక్కున క్రైస్తవం వైపు తిరిగాడు. "మా ఏసు ప్రభువును చూడండి. ఆయన పీడితుల్ని ఆదుకుంటాడు. రోగాలు నయంచేస్తాడు. మనల్ని స్వర్గానికి తీసుకెళ్తాడు. ఆయనే నిజమైన భగవంతుడు. ప్రభువును నమ్మండి. మిమ్మల్ని స్వర్గం చేరుస్తాడు. మీలోనే స్వర్గ సామ్రాజ్యాన్ని చూపిస్తాడు." ఎబెనెజారుకు కళ్ళముందు ప్రభువు రూపం కనిపించింది. ఆనందపారవశ్యంలో కన్నీరు కారిపోతున్నది. అది అతడి బుగ్గల్ని తడుపుతున్నది. మరుక్షణంలో ముఖం కందగడ్డలా ఎర్రబడింది. దానికి కారణం అతడి ఆలోచనలు శ్రీకృష్ణుని వైపు మళ్ళడమే. కోపంతో ఊగిపోతూ "మీ కృష్ణునిలాగ మా ప్రభువు నాట్యకత్తెల చుట్టూ బలాదూరు తిరిగాడా? మా ఏసు ప్రభువు ఆ స్కౌండ్రల్ కృష్ణుడిలా వెన్న దొంగతనాలు చేశాడా? మీ కృష్ణుడిలా మా ఏసు ప్రభువు గారడీలు చేసి చుట్టూవారిని మోసంచేశాడా?" అన్నాడు.

ఒక్కక్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు. ఇవ్వాళ అతడు పట్టపగ్గాలు లేకుండా విజృంభించాడు. స్వామినాథన్ రక్తం కుతకుత లాడిపోయింది. చివ్వునలేచి అన్నాడు- "ఏ తప్పూ చెయ్యకపోతే శిలువ ఎందుకు వేశారు?" క్లాసు అయిపోయాక తన గదికి వస్తే శిలువ వేసిన కారణం చెబుతానని

అన్నాడు టీచరు. టీచరు అంత శాంతంగా సమాధానం ఇవ్వడంతో స్వామినాథన్‌కు ధైర్యం పెరిగింది. ''మీ క్రైస్తు దేవుడు అయితే మాంసం ఎలా తింటున్నాడు? చేపలు తింటున్నాడేం? ద్రాక్ష రసం తాగుతున్నాడేం?'' అన్నాడు. బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన స్వామినాథన్ దేవుణ్ని శాకాహారిగా ఊహించుకోవడం సహజమే. అది విని ఎబెనెజార్ లేచి స్వామినాథన్ దగ్గరకు వచ్చాడు. ఎడం చెవు పట్టుకొని గట్టిగా మెలిపెట్టాడు.

**3**

ఆ మర్నాడు స్వామినాథన్ స్కూలుకు చాలా త్వరగా వచ్చాడు. బెల్ కొట్టడానికి ఇంకా అర్ధగంట సమయం ఉంది. మామూలుగా ఇలాంటి ఖాళీ సమయంలో స్కూలు చుట్టూ పరుగులు తీస్తాడు. లేదా, చింతచెట్టు కింద గుంటలు తీస్తూ ఆడుకుంటాడు. కాని ఈ రోజు ఒంటరిగా కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయాడు. జేబులో బరువైన ఉత్తరం ఉంది. చేత్తో తడిమి చూసుకున్నాడు. తప్పు చేశానన్న భావం మనసును చుట్టేసింది.

క్రితం రాత్రి భోజనాల దగ్గిర ఎబెనెజార్ గురించి తండ్రికి చెప్పాల్సింది కాదు. తనొక పిచ్చివాడు!

గంట మోగింది. స్వామినాథన్ హెడ్‌మాస్టర్ గదికి వెళ్ళి ఉత్తరం అందించాడు. ఉత్తరం చదివిన హెడ్‌మాస్టరు ముఖం గంభీరంగా మారింది.

''సర్!

నా కుమారుడు స్వామినాథన్, మీ స్కూల్లో, ఫస్టుఫారంలో చదువుతున్నాడు. మత గ్రంథ బోధకుడు, మత పిచ్చితో రెచ్చిపోయి నిన్న వాడి మనసును గాయపరచాడు. అతడు తరచు హిందూమతం గురించి అవమానకరంగా మాట్లాడుతూ విద్యార్థుల్ని రెచ్చగొడ్తూ ఉంటాడని నేను వింటున్నాను. ఇందువల్ల పిల్లల మీద చెడు ప్రభావం పడే అవకాశం ఉంది. ఇలాంటి విషయాల్లో సహనం వహించవలసిన ఆవశ్యకత నాకు కనిపించడం లేదు.

ఆ సందర్భంగా నా కుమారుడు లేచి కొన్ని సందేహాలు వెలిబుచ్చడంతో రెచ్చిపోయిన ఆ టీచరు చాలా మొరటుగా వాణ్ని దండించాడని నాకు తెలిసింది. నిన్న సాయంత్రం వాడు ఇంటికి వచ్చేవరకు చెవులు ఎర్రగా కందిపోయి ఉన్నాయి.

దీనివల్ల, క్రైస్తవులు కానివారు మీ స్కూల్లో ఉండడం మీకు ఇష్టం లేదని అనుకోవాల్సి వస్తున్నది. మీ అభిప్రాయం అదే అయితే చెప్పండి. మా పిల్లల్ని మీ స్కూలు నుంచి తీసుకెళ్ళిపోతాం. వేరే స్కూల్లో చేర్చుకుంటాం. ఈ

మాల్గుడి పట్టణంలో మా అల్బర్ట్ మిషన్ స్కూలు ఒక్కటే ఉన్నదనుకోవద్దు. దయచేసి మీరు ఈ విషయంలో విచారణ జరిపిస్తారనీ, నా ఉత్తరానికి జవాబు ఇస్తారనీ ఆశిస్తున్నాను. మీరు ఈ విషయాన్ని పట్టించుకోక పోతే, మీ ప్రవర్తనను పై అధికారుల దృష్టికి తీసుకెళ్ళక తప్పదని చెప్పడానికి విచారిస్తున్నాను.

గౌరవాభివందనములతో,

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
డబ్ల్యు.టి. శ్రీనివాసన్."

స్వామినాథన్ హెడ్‌మాస్టరు గదిలోనుంచి బయటికి వచ్చేసరికి, స్కూలు మొత్తం అతడ్ని చుట్టేసింది. కుతూహలంతో అడిగిన ప్రశ్నలకు స్వామినాథన్ పొగరుగా, నిర్లక్ష్యంగా సమాధానం ఇచ్చాడు.

నలుగురిని మాత్రమే స్వామినాథన్ ఆత్మీయులుగా భావిస్తాడు. ఆ నలుగురంటేనే అతడికి క్లాసు మొత్తంలో ఇష్టం. వారిలో మొదటివాడు సోము. వాడు క్లాసుకు మానీటరు. ఎప్పుడూ ఉల్లాసంగా ఉంటాడు. తను చెయ్యదలుచుకున్న పనిని ఆత్మవిశ్వాసంతో, నిబ్బరంగా చేస్తాడు. వాడు అందరికీ, ఆ మాటకొస్తే టీచర్లకు కూడా ప్రియమైన మిత్రుడే. క్లాసులో అతడ్ని ఏ టీచరూ, ఎప్పుడూ, ఏ ప్రశ్నా అడగడు. అందువల్ల క్లాసులో చాలా తెలివైన కుర్రాడు అనడానికి వీల్లేదు. ఒక్క హెడ్‌మాస్టరు మాత్రమే అతడ్ని మందలించగలడనే అభిప్రాయం అందరిలో ఉంది. ఒక రకంగా, అతడ్ని, క్లాసుకు మేనమామ లాంటివాడు అని చెప్పవచ్చు.

రెండోవాడు మణి. విగ్రహం పుష్టి నైవేద్యం నష్టిగాడు. క్లాసులో అందరికంటే పొడవైనవాడు. క్లాసుకు పుస్తకాలతో రావడం అరుదు. హోమ్‌వర్కు అసలు చెయ్యడు. క్లాసులో వెనక బెంచీని పూర్తిగా ఆక్రమించుకొని ధైర్యంగా నిద్రపోతాడు. ఎప్పుడూ, ఏ టీచరూ అతడ్ని అదేమని అడగరు. ఒకసారి, క్రొత్తగా వచ్చిన ఒక టీచరు, అతడ్ని అదుపు చెయ్యబోయి, దాదాపు ప్రాణంమీదకు తెచ్చుకున్నాడు. తన దారిని అడ్డం వచ్చిన వాళ్ళను, చిన్నవాళ్ళా, పెద్దవాళ్ళా అని కూడా చూడడు. సాధారణంగా అందరూ అతడ్ని తప్పుకొని తిరుగుతారు. తలమీద టోపీ వంకరగా పెట్టుకొని, తమిళ నవల ఒకటి చంకలో ఇరుకించుకొని, తనకు తెలిసినప్పట్నుంచీ అదే క్లాసులో వుంటున్నాడని చెప్తాడు, చాలాకాలంగా ఆ స్కూల్లో పనిచేస్తున్న బంట్రోతు. వాడితో స్నేహం చెయ్యడం గర్వకారణంగా

భావిస్తాడు స్వామినాథన్. ''ఒరే మణీ!'' అని వీపుచరిచి స్వామి మాట్లాడుతూ ఉంటే మిగతా పిల్లలు ఆశ్చర్యంగా చూస్తారు. వాళ్ళకు మణితో మాట్లాడాలంటేనే భయం. ''ఇంత బలం నీకు ఎక్కడ్నుంచి వచ్చిందిరా?'' అని అడిగాడు స్వామినాథన్ ప్రశంసాపూర్వకంగా. ''మా ఇంట్లో రెండు దుడ్డుకర్రలు ఉన్నాయ్. ఎవడైనా నా జోలికి వస్తే ఎముకలు ఇరగ్గొడతాను'' అని సమాధానం ఇచ్చాడు మణి.

మూడోవాడు శంకర్. క్లాసులో అందరికంటే తెలివైన విద్యార్థి. ఎంత జటిలమైన లెక్కనైనా ఐదు నిముషాల్లో చెయ్యగలడు. ఎప్పుడూ 90 శాతం మార్కులు తెచ్చుకుంటాడు. వాడుకనక టీచర్లను ప్రశ్నలు వెయ్యడం ప్రారంభిస్తే, ఆ టీచర్ల పని అయిపోయినట్టే నంటారు కొందరు విద్యార్థులు. ''శంకర్‌గాడు శుద్ధ మొద్దు అవతారం. వాడికి ఏమీ తెలియదు. ముందుగానే, టీచర్లను కాకా పట్టి, అన్నీ తెలుసుకొని క్లాసుకు వస్తాడు'' అంటారు కొందరు. ''టీచర్ల ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ బట్టలు కూడా ఉతుకుతాడు. అందుకే వాడికి 90 శాతం మార్కులు వేస్తారు'' అంటారు మరికొందరు. శంకర్ క్లాసులో టీచర్లతో ఇంగ్లీషులో మాట్లాడతాడు. ప్రపంచంలోని ఎన్నో విషయాలు, నదులు, పర్వతాలు, దేశాలు మొదలైన వాటిగురించి తెలుసు. నిద్రలేపి అడిగినా చరిత్ర విశేషాలు తడుముకోకుండా చెప్పగలడు. వ్యాకరణం అయితే అతడికి కొట్టిన పిండి. అతడి ముఖం తెలివితేటలతో కళకళలాడుతూ ఉంటుంది. ముక్కు మాత్రం ఎప్పుడూ కారుతూనే ఉంటుంది. క్లాసుకు, నున్నగా దువ్వి జడ వేసుకొని, పువ్వులు పెట్టుకొని వస్తాడు. స్వామినాథన్ వాడిని వింతగా చూసేవాడు మొదట్లో. మణికి వాడంటే ఇష్టమేననీ, తమ జట్టులో చేర్చుకోవడానికి అభ్యంతరం లేదనీ, తెలిసి స్వామినాథన్ సంతోషించాడు. శంకర్ వీపుమీద బాది తన పద్ధతిలో తన ఇష్టాన్ని తెలియజేస్తూ ఉంటాడు. శంకర్ తల గీరుతూ ''ఈ కుర్రకుంకకు ఇన్ని తెలివితేటలు ఎలా వచ్చాయో? అందులో కొన్ని నాకు ఇవ్వకూడదూ?'' అంటూ ఉంటాడు మణి.

నాలుగో మిత్రుడు శామ్యూల్. వాడిని అందరూ బఠాణీగాడు అంటారు,, అతడి శరీరపు సైజును దృష్టిలో పెట్టుకొని. అతడిలో చెప్పుకోతగిన విశేషం ఏమీలేదు. అతి మామూలు కుర్రాడు. కండబలం లేదు. బుద్ధిబలం కూడా అంతంత మాత్రమే. లెక్కల్లో వాడికంటే స్వామినాథనే మెరుగు. వీడు కూడా స్వామిలాగే భయస్తుడు. బలహీనుడు. వాళ్ళిద్దర్నీ దగ్గర చేసింది ఒకేఒక గుణం- అది పెద్దగా నవ్వగలగడం. ఒక వస్తువులోని గుణదోషాలను ఇద్దరూ

సమానంగా చూడగలరు. ఇతరుల దృష్టిలో అతి సామాన్యమైన విషయం, వీళ్ళకు కడుపు ఉబ్బేంత నవ్వును తెప్పించగలదు.

ఎబెనెజార్ విషయంలో తన తండ్రి కల్పించుకొన్న కారణాలను వాళ్ళకు వివరించి చెప్పాడు. అందరూ ఒక రకంగా సమర్థించారనే చెప్పాలి. అందరికంటే ముందు సోము నవ్వుతూ, బాహాటంగా స్వామిని సమర్థించాడు. ముఖంలోకి గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకొని అన్నాడు శంకర్- ''ఎవరేమన్నా అనుకోనివ్వు. మంచి పని చేశావు మీ నాన్నను రంగంలోకి దింపి.'' పొగరుబోతు మణి ''ఏదో చేసావులే, పర్వాలేదు'' అన్నట్టుగా ఓరగా చూసి, వొంకరగా నవ్వాడు. ఈ వ్యవహారంలో పెద్దలు కలుగజేసుకోవడం మణికి ఇష్టం లేదు. అలా చెయ్యడంలో విజ్ఞత ఏమీ కనిపించలేదు. ఇలాంటి విషయాలు క్లాసు నాలుగు గోడలు దాటి బయటికి పోగూడదని అతడి అభిప్రాయం. తనే స్వామినాథన్ పరిస్థితిలో ఉంటే, సమయానికి పెద్ద వస్తువు ఏదీ చేతికి దొరక్కపోయినా, అందుబాటులో ఉన్న సిరాబుడ్డి టీచర్ ముఖంమీదకు విసిరి ఉండేవాడు. అంతటితో ఆ కథ అక్కడే ముగిసిపోయి ఉండేది. అయినా స్వామినాథన్ చేసినదాంట్లో పెద్దగా తప్పు పట్టాల్సింది కూడా ఏమీ లేదు. అసలు ఏమీ చెయ్యకుండా ఊరుకుంటే మాత్రం హాని జరిగి ఉండేది. మనసులోనే అనుకున్నాడు మణి. ''ఆ ఎబెనెజార్‌ను జాగ్రత్తగా ఉండమనండి'' అన్నాడు. ఆ టీచరు మెడలు విరిచి, వీపు బద్దలు కొట్టడానికి సిద్ధంగా ఉన్నాడు మణి.

శామ్యూల్ అదే బఠాణీగాడు మాత్రం పెద్ద ఇరకాటంలో పడ్డాడు. ఏదో గట్టిగానే వ్యాఖ్యానించాలని ఉంది. అతనూ క్రైస్తవుడే. ఎబెనెజార్ మాటల్లో తప్పు ఉన్నట్టు అనిపించడం లేదు. దైవశాసనాల్లో ఒకదాన్ని వివరించి చెప్పాడు. అంతేగా అనుకున్నాడు. మనసులో ఎబెనెజార్‌నే సమర్థించాలని ఉంది. కాని అలా చెయ్యగల ధైర్యం లేదు. ఏదో ఒకటి అనక తప్పదు. అందుకే, ఎబెనెజార్ రూపంమీదా, వేషంమీదా రెండు విసుర్లు విసిరి తెలివిగా తప్పించుకున్నాడు.

ఆ రోజు క్లాసులో చర్చనీయాంశం ఇదే. మతబోధన క్లాసు సమయం అయింది. ఈ నాటకానికి తెరబడే సంఘటన ఏదో జరగబోతున్నదనే నమ్మకంతో టీచరు రాకకోసం కుతూహలంగా ఎదురు చూస్తున్నారు విద్యార్థులు. కాని ఏమీ జరగలేదు. ఎబెనెజార్ ఉత్సాహంగా పాఠం చెప్పుకుపోతున్నాడు. ఆయన ఆ రోజు భగవద్గీతను వ్యాఖ్యానించడం ప్రారంభించాడు. సునిశితమైన ఈ గ్రంథాన్ని ఎలాగయినా

వ్యాఖ్యానించవచ్చును. ఆ రోజు హిందూ ఇజాన్ని చించి చెండాడడానికి భగవద్గీతను ఆయుధంగా చేపట్టాడు.

ఎప్పటిలాగే కంచు కంఠంతో ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు. ఆనాటి ఆయన భాషలో పాండిత్యం ఉట్టిపడుతోంది. హిందూ మతాన్ని అతి దారుణంగా విమర్శిస్తున్నాడు. ఆ మూర్ఖపు వాగుడులో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ పరాకాష్ఠకు చేరుకున్నాడు. టేబులేమీద పడివున్న బైబుల్‌ను పూర్తిగామర్చిపోయాడు.

ఎబెనెజార్ కంఠం ఎవరో నొక్కేసినట్టుగా ఒక్కసారిగా ఆగిపోయింది. అనుకోకుండా హెడ్‌మాస్టరు క్లాసులో అడుగుపెట్టాడు. ఎబెనెజార్ కుర్చీలోనుంచి చివ్వున లేచి నిల్చున్నాడు. హెడ్‌మాస్టరు ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. హెడ్‌మాస్టరు పాఠం కొనసాగించమని తాపీగా చెప్పాడు. అప్పటికే హెడ్‌మాస్టరు చూడకుండా బైబుల్ పేజీలలోకి వేలు దూర్చాడు. హెడ్‌మాస్టరు ముందు వీలైనంత ప్రశాంతంగా ఉన్నట్టు కనిపించడానికి ప్రయత్నించాడు. అంతవరకూ ముడిపడి వున్న కనుబొమలు విడిపోయాయి. వేలుపెట్టి దాచిన బైబుల్ పేజీలు తెరిచి పాఠం చదవసాగాడు. అది క్రీస్తు జన్మస్థలం గురించిన వర్ణన. అది ఒక అపూర్వ సంఘటన. పశువుల కుడితి తొట్టిలో ప్రభువు పవళించి ఉన్నాడు. తూర్పున వివేకవంతులు, అటల విశ్వాసంతో నక్షత్రాన్ని అనుసరిస్తున్నారు.

విద్యార్థులు అయోమయంలో ఉన్నారు. భగవద్గీతను విమర్శించినా, ప్రభువు జన్మస్థలాన్ని వర్ణించినా వాళ్ళకు అంతా ఒకటిగానే ఉంది.

హెడ్‌మాస్టరు కొంతసేపు మౌనంగా విని, చిన్న గొంతుతో మందలించాడు. పరీక్షలు దగ్గర పడుతున్నాయి. ఇంకా ప్రభువు జన్మస్థలంలోనే ఉండిపోయాడు. శిలువను చేరుకొనేదెప్పుడూ? మోక్షం ఎప్పుడూ? మళ్ళీ పాఠాలు మననం చేసుకొనేదెప్పుడూ? ఎన్నో సందేహాలను వెలిబుచ్చాడు హెడ్‌మాస్టరు. ఎబెనెజార్‌కు దిమ్మ తిరిగిపోయినట్టుగా అయింది. ఏం చెప్పాలో వెంటనే తోచక తికమకపడ్డాడు. వారంలో ఒక రోజు మననం చేసుకోవడానికి కేటాయించినట్టు చెప్పాడు. అతడి జవాబు హెడ్‌మాస్టరుకు సంతృప్తి కలిగించలేదు. ''మరీ అంత వెనక లేము. చివరి రాత్రి విందుకు దగ్గర్లోనే ఉన్నాం'' ఎలాగో అనగలిగాడు ఎబెనెజార్.

స్వామినాథన్‌కు, ఆ సాయంత్రం హెడ్‌మాస్టర్ గదికి రావలసిందిగా పిలుపు అందింది. అది వినగానే స్వామినాథన్‌కు ఇంటికి పరిగెత్తాలనిపించింది. ఆ మాటే మణితో అన్నాడు. మణి వెంటనే స్వామిని

రెండు చేతులతో ఎత్తుకుని హెడ్‌మాస్టారు గది ముందుదించి, లోపలకు తోశాడు. హెడ్‌మాస్టర్ ముందు నిల్చున్న స్వామికి గొంతు ఎండిపోయింది.

ఎబెనెజార్ స్టూలుమీద కూర్చుని గొర్రెలా చూస్తున్నాడు.

''ఏమైంది స్వామినాథన్?'' హెడ్‌మాస్టరు అడిగాడు.

''ఎ...ఎ...ఏం లేదు సార్.''

''ఏమీ లేకపోతే మరి ఈ ఉత్తరం ఏమిటి?''

''అ...అదా సార్!'' స్వామినాథన్ నోటినుంచి ఆ పై మాటలు పెగల్లేదు.

ఎబెనెజార్ వస్తున్న నవ్వును ఆపుకుంటున్నాడు.

స్వామినాథన్‌కు అక్కడ్నుంచి పారిపోవాలని ఉంది. భగవంతుడి గురించి ఇకముందు వాడెన్ని వాగినా పట్టించుకోకూడదనుకొన్నాడు.

''నేను ఇక్కడ ఉండేది ఎందుకురా?''

స్వామినాథన్‌కు జవాబు దొరకలేదు.

అయినా అదేం ప్రశ్న? ఎందుకున్నాడు? కుర్రాళ్ళ తల్లితండ్రులు పంపించే ఉత్తరాలు అందుకోవడానికి. ఎబెనెజార్‌ను నిలువుగా చీల్చడానికి. ప్రతి సోమవారం పేము బెత్తంతో అరడజను వాతలు అంటించడానికి. లేకపోతే అదేం ప్రశ్న? చచ్చు ప్రశ్న!

''నాకు తెలియదు సార్'' అన్నాడు.

''నీ మంచి చెడులు చూసుకోవడానికే నేనిక్కడ ఉన్నాను'' అన్నాడు హెడ్‌మాస్టరు.

ఆ ప్రశ్నకు అంత తేలిగ్గా జవాబు వచ్చినందుకు స్వామినాథన్ మనసు తేలికపడింది.

''అందువల్ల, నీకు ఎలాంటి సహాయం కావాల్సి వచ్చినా ముందుగా నా దగ్గరకు రావాలి. అంతేకాని మీ నాన్న దగ్గరకు కాదు'' అన్నాడు హెడ్‌మాస్టరు.

స్వామినాథన్ ఎబెనెజార్‌ను ఓరకంటితో చూశాడు. అతడు కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు.

''ఇంత చిన్న విషయానికి మీ నాన్న దగ్గర కెళ్ళడం తెలివైన పని కాదు. నిన్ను చూస్తుంటే నాకు జాలి వేస్తున్నది. అన్నీ నేను చూసుకుంటాను. ఈ ఉత్తరం మీ నాన్నకు ఇవ్వు.''

స్వామినాథన్ హెడ్‌మాస్టరు చేతిలో ఉత్తరం గుంజుకొని, బ్రతుకుజీవుడా అన్నట్టు బయటికి పరుగు తీశాడు.

# అధ్యాయం 2

## రాజం—మణి

### 1

సరయు నది మాల్గుడికి గర్వకారణమైనది. పట్టణంలోని చివరి వీధినుంచి పది నిముషాల నడక. ఆ వీధిలో ఎక్కువగా తెలుకలవాళ్ళు నివసిస్తున్నారు. పట్టణ ప్రజలు సాయంకాలాలు ఆ నది ఒడ్డున, ఇసుకతిన్నెల మీద గడుపుతారు. ఆ నగరానికి ఎవరైనా పెద్దవారు వస్తే, పురపాలక సంఘ అధ్యక్షుడు వారిని టౌన్‌హాలు డాబామీదకు తీసుకెళ్తాడు. వెన్నెలరాత్రుళ్ళల్లో ఉత్తరతీరం వెంబడి జలతారు పరిచినట్టుగా కనిపించే సరయు నదిని గర్వంగా వారికి చూపిస్తాడు.

ఆ సాయంత్రం ఎప్పటిలాగే జనం నది ఒడ్డున కిటకిటలాడుతున్నారు. జనానికి దూరంగా నది మెట్టుమీద కూర్చుని నీళ్ళల్లో కాళ్ళు ఆడిస్తున్నారు స్వామినాథన్, మణి. నదిమీదగా వంగిన రావిచెట్టు కొమ్మలు, గాలికి ఊగుతుండగా, నీళ్ళలో ఎండిపోయిన ఆకులు రాలుతున్నాయి. పక్షులు కిల కిలారావాలు చేస్తున్నాయి. దూరంగా నల్లప్ప మామిడి తోపును ఆనుకొని ప్రవహిస్తున్న కాలువను పశువుల మంద ఒకటి దాటుతున్నది. అప్పుడే ఎడ్ల బండి ఒకటి సాగిపోయింది. బండివాడు కూనిరాగం తీస్తున్నాడు. సూర్యాస్తమయం అయి పదిహేను నిముషాలు అయింది. పడమటి దిక్కు ఆకాశం ఇంకా ఎర్రగానే ఉంది.

"ఇక్కడ నీళ్ళు చాలా లోతు" అన్నాడు మణి.

"అవును, ఎందుకో మరి!" స్వామినాథన్ అన్నాడు.

"రాజంగాడ్ని ఇక్కడకు తీసుకొచ్చి చాపలా చుట్టి నీళ్ళలో పారేస్తాను."

రాజం ఆ స్కూల్లో కొత్తగా చేరాడు. రెండో టరమ్ మొదలైన రోజు చేరాడు. తిన్నగా వెళ్ళి వెనక బెంచీమీద మణి పక్కన కూర్చున్నాడు. ఆ సీటు బాగుందనుకొన్నాడో లేదో మణి వాడిపక్కటెముకలమీద ఒక్క పోటు పొడిచాడు. రాజం కూడా ఒకటి వడ్డించాడు. రాజం క్లాసువాళ్ళను మొదటి చూపులోనే ఆకర్షించాడు. అంతవరకు అతడిలా స్కూలుకు టిప్‌టాప్‌గా ముస్తాబై వచ్చిన వాళ్ళెవరూ లేదు. మేజోళ్ళు, బూట్లు, కుచ్చుటోపీ, టై, చక్కటి కోటు, నిక్కరు ధరించాడు. పైగా కార్లో వచ్చిదిగాడు. మద్రాసులో ఇంగ్లీషువారి

పిల్లలు చదివే స్కూల్లో చదివాడని విన్నారు. కొద్దిరోజుల్లోనే స్కూల్లో మంచి పేరు సంపాదించాడు. అచ్చం ఇంగ్లీషువాడిలా ఇంగ్లీషు మాట్లాడతాడు. చాలామందికి అర్థం కూడా కాదు. అర్థం అయినా చాలామంది అతడితో ఇంగ్లీషులో మాట్లాడడానికి భయపడుతున్నారు. తెలివైనవాడని పేరు తెచ్చుకొన్న శంకర్ మాత్రం ధైర్యంగా, అక్కడక్కడ నట్టినా, ఇంగ్లీషులో రాజంతో మాట్లాడ గలుగుతున్నాడు.

రాజం మణికి పక్కలో బల్లెంలా తయారయ్యాడు. మణి పట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నాడు.అంతవరకు ఎవరూ మణిపట్ల అలా ప్రవర్తించే సాహసం చెయ్యలేదు. రాజం వైఖరి మణి సహించలేకుండా ఉన్నాడు. మణి ఒక దెబ్బవేస్తే రాజం కూడా ఒకటి వేస్తాడు. మణి గిచ్చితే రాజం మళ్ళీ గిచ్చుతాడు. మణి వెక్కిరిస్తే రాజం వెక్కిరిస్తాడు. మణి తంతే, రాజం మళ్ళీ తంతాడు. మణి క్లాసులో మకుటం లేని మహారాజు అయితే రాజం కూడా అందుకేమీ తీసిపోలేదు. పైగా క్లాసులో మంచి మార్కులు తెచ్చుకొని రెండో స్థానాన్ని ఆక్రమించుకొన్నాడు. రాజం స్కూల్లోనే ఒక కొత్త శక్తిగా గుర్తింపు పొందగలడనేది రూఢీ అయింది. మణి తన జీవితంలోకి ఒక ప్రత్యర్థి ప్రవేశించినట్టు భావించసాగాడు.

రాజంను చుట్టచుట్టి నదిలో పారెయ్యాలనే ఆలోచన వెనక ఇంత కథ ఉంది. స్వామినాథన్‌కు భయంవేసింది. ''రాజం నాన్న పోలీసు సూపరింటెండెంట్ అనేది మరచిపోయావా?'' అన్నాడు స్వామినాథన్. మణి కొద్ది నిముషాలు ఆలోచనలో పడ్డాడు.''ఏం అయితే? నాకేం భయమా? చూస్తుండు, ఏదో ఒకరాత్రి నా దుడ్డుకర్రతో వాడి భుజాలు విరగ్గొడతాను.''

''అదే నేనైతే పోలీసువాళ్ళ జోలికి వెళ్ళను. వాళ్ళు చాలా భయంకరమైన వాళ్ళు.''

''నువ్వు నేనైతేనా? బలే! ఇంకా నయం నేను నీలా పాలపళ్ళ పిరికిపందను కాను.''

స్వామినాథన్ పెదవులు కొరుక్కున్నాడు.

''అర్థం అయింది'' అని ఒక్క క్షణం ఆగి మణి అన్నాడు.

''చూస్తున్నా ఈ మధ్య నువ్వు వాడితో తిరుగుతున్నావ్. నీ ఎముకలు జాగ్రత్త. ఇంతకంటే చెప్పేది ఏమీ లేదు. ఇది నా హెచ్చరిక.''

స్వామినాథన్‌కు ఉక్రోషం ముంచుకొచ్చింది. తను మణిని తప్ప మరొకడ్ని అభిమానించగలనని వీడు ఎలా అనుకుంటున్నాడు? వీడు ఎంతో కాలంగా తన మిత్రుడు, మార్గదర్శకుడు. అసలు ఈ ఆలోచన

వీడికెందుకొొచ్చినట్టు? తనకు గుర్తున్నంత వరకు రాజంకు తను మూడు గజాల దూరంలోనే వుంటూవచ్చాడే? వాడంటే తనకు అసహ్యం. వాడు వట్టి నీచుడు. మరి తనను వాడితో ఎప్పుడు చూశాడు ఈ మణిగాడు? ఆ! గుర్తొచ్చింది. ఆ సోమవారం ఉదయం, డ్రాయింగ్ పీరియడ్‌లో తను వాడికేసి చూడకపోయినా, తన దగ్గరకు వచ్చాడు. ఆ గాడిదగాడికి పెన్సిల్ చెక్కుకోవడానికి షార్పనర్ కావాల్సి వచ్చింది. తను ఇవ్వలేదే. అంత అవసరం అయితే బజారుకెళ్ళి కొనుక్కో పో అనేశాడు. అసలు వాడికి మణిగాడితో పోలికేమిటి?

స్వామినాథన్ మణికి అంతా చెప్పాడు. ఇది విని మణి సంతృప్తి చెందాడు. ఆ సాయంకాలం మొదటిసారిగా నవ్వాడు. హాయిగా నవ్వాడు. స్వామినాథన్‌ను రెండు చేతులతో కుదిపి కుదిపి వదిలిపెట్టాడు. చెవులు మెలిపెట్టాడు. స్వామినాథన్ బాధతో అరిచాడు.

''ఆ, అవున్రా! నేను అడిగింది తెచ్చావా?''

''క్షమించురా మణి! తేవడానికి ఎంతో ప్రయత్నించాను, కాని వీలుపడలేదు. మా అమ్మ వంటిల్లు వదిలి బయటికి రాలేదు? (మణి అడిగింది నిమ్మకాయ ఊరగాయ ముక్క).

''నువ్వో పిరికిపందవు. ఈ నది ఒడ్డున, ఈ చల్లని సాయంకాలం పూట, అది-అబ్బ నోరూరుతుంది...''

## 2

రాజం, మణిల మధ్య సంధానకర్తగా వ్యవహరించవలసి వచ్చింది స్వామినాథన్‌కు. వాళ్ళిద్దరూ చివరి బెంచీమీద పసుపుపచ్చ రంగు గోడకు వీపులు ఆనించి కూర్చుని వున్నారు. వాళ్ళిద్దరి మధ్య స్వామినాథన్ కూర్చున్నాడు. వారి ముందున్న బల్లమీద పుస్తకాలు ఉన్నాయి. కాని వారి ఆలోచనలు ఎక్కడో వున్నాయి. ''నువ్వు మగాడివేనా?'' మణి చీటీమీద రాసి స్వామినాథన్‌కు అందించాడు. స్వామినాథన్ అయిష్టంగానే ఆ చీటీని రాజంకు అందించాడు. రాజం దాన్ని చదివి నలిపి పారేశాడు. మణి మరో చీటీమీద మొదటి ప్రశ్నతోపాటు ''నువ్వు సమాధానం ఇవ్వకపోతే కుక్కకు పుట్టినవాడితో సమానమే'' అని చేర్చి, దాన్ని స్వామినాథన్‌కు ఇచ్చాడు. రాజం చదివి ''దొంగ వెధవా! నన్ను విసిగించకు'' అంటూ చీటీని నలిపి అవతల పారేశాడు.

అంతటితో ఆ తతంగం ముగిసింది.

''స్వామినాథన్, నిల్చో!'' టీచర్ గట్టిగా అన్నాడు. స్వామినాథన్ బుద్ధిగా టీచర్ చెప్పినట్టే చేశాడు.

''లిస్బన్ దేనికి ప్రసిద్ధి?''

స్వామినాథన్ గాబరాపడ్డాడు. ''స్పెయిన్ రాజధాని'' అన్నాడు ధైర్యం తెచ్చుకొని.

టీచర్ మీసాలు కొరుక్కుని మళ్ళీ ప్రశ్నించాడు.

''భారతదేశపు వాతావరణం గురించి నీకు తెలిసింది చెప్పు.''

''ఎండాకాలంలో వేడి, చలికాలంలో చలి...''

''బెంచీ ఎక్కు, నిలబడు.'' దాదాపు అరిచాడు టీచర్. స్వామినాథన్ బెంచీమీద నిలబడ్డాడు. బెత్తం దెబ్బలు తగలనందుకు సంతోషించాడు.

టీచర్ పాఠం కొనసాగించాడు. ''ఆఫ్రికా అటవీ భూమి. అక్కడున్న నైలు నది చాలా ప్రసిద్ధి చెందినది, తెలిసిందా? ఏం చెప్పాను?'' ముందు బెంచీమీద వున్న విద్యార్థిని అడిగాడు. (ఆఫ్రికాలో నైలు నది చాలా ప్రసిద్ధమైనదని ఆ కుర్రవాడు జవాబు చెప్పాడు. టీచర్‌కు ఆ సమాధానం సంతృప్తి కలిగించింది.) నైలు అంటే ఏమిటి? (ఆఫ్రికాలో ఒక నది. అడక్కుండానే ఒక కుర్రవాడు చెప్పి టీచరు మందలింపుకు గురి అయ్యాడు.) ''నిశ్శబ్దం, నిశ్శబ్దం.'' ఏమిటి క్లాసులో ఇంత గొడవగా వుంది. వీళ్ళు ఇలాగే చేస్తుంటే పరీక్షలేం రాస్తారు? పెద్ద సున్నా...చూడాలి ఇదేదో...

స్వామినాథన్ మనసు పాఠంమీద లేదు. బెంచీమీద నిల్చున్నాడు. క్లాసులో అందరికంటే ఎత్తుగా వున్నట్టు అనిపించింది. చాలామంది తలకాయలు కనిపిస్తున్నాయి. వాటిని, టోపీలను బట్టి విభజిస్తున్నాడు. నాలుగు ఎర్ర టోపీలు, ఇరవై ఐదు గాంధీ టోపీలు, పది కుచ్చు టోపీలు... ఇంకా...

పని పూర్తి అయాక, అంతకు ముందే అనుకున్న ప్రదేశంలో స్వామినాథన్, మణి, రాజం కలుసుకున్నారు మనసుల్లో వున్న భావాల్ని కక్కడానికి. స్వామినాథన్ ఇద్దరి మధ్యా రాజీ కుదిర్చే ప్రయత్నంలో వున్నాడు. ఇద్దరు బద్ధ విరోధులు కలవాలంటే, కలిపేవాడు ఒకడు ఉండాలి. మణి, స్వామినాథన్ ముఖంలోకి చూస్తూ ''నువ్వూ ఒక మగాడివేనా?''అన్నాడు. స్వామినాథన్ రాజంకేసి తిరిగి''నువ్వూ ఒక మగవాడివేనా?'' అన్నాడు.''ఏ కుక్కకు వచ్చిందా సందేహం?'' రెచ్చిపోయి అరిచాడు రాజం. స్వామినాథన్ పిచ్చి కోపంతో మణిని చూస్తూ ''ఏ గజ్జి కుక్కకు ఆ సందేహం వచ్చింది?'' అని అరిచాడు.

''నువ్వా ఒక మగవాడివేనని నిరూపించుకొనే సత్తా వుందా నీకు?''
అన్నాడు మణి.

''ఎలా?''

''ఎలా?'' స్వామినాథన్ రాజం ప్రశ్నను వల్లించాడు.

''నది ఒడ్డున వున్న నల్లప్ప తోటలో నన్ను కలుసుకో.''

స్వామినాథన్ ఉత్సాహంగా అదే వాక్యాన్ని అప్పచెప్పినట్టు అన్నాడు.

''ఎందుకు?'' రాజం అడిగాడు.

''నువ్వు నా తల పగలగొట్టగలవో లేదో తేల్చుకోవాలి.''

''ముక్కలు ముక్కలుగానా?''

స్వామినాథన్ సహాయం ఎవరికీ అవసరం కాలేదు. వారి మాటల్ని మళ్ళీ ఉచ్చరించే వ్యవధి స్వామినాథన్‌కు దొరకలేదు. ఇద్దరూ చెరోవైపు నుంచి అరిచారు.

''రేపు నువ్వు నది ఒడ్డుకు వస్తున్నావన్న మాట'' అడిగాడు స్వామినాథన్.

''వస్తాను.''

రాజంగాడు అంగరక్షకులను వెంటబెట్టుకొని వస్తాడేమోనని సందేహం వచ్చింది మణికి. అలాంటిదేమీ వుండదని సమాధానం వచ్చింది. మణికి మరో అనుమానం వచ్చింది.''నీకేమైనా జరిగితే మీ నాన్నకు చెప్పవుకదూ?'' అలా చెప్పుకోవడం తనకే అవమానకరం అన్నాడు రాజం.

## 3

నల్లప్ప తోట అల్లంత దూరంలో కనిపిస్తున్నది. ఆరు దాటడం వల్ల నది దాటేవాళ్ళు కూడా ఎక్కువ మంది లేరు. మామూలుగా జనం కూర్చునే స్థలం చాలా దూరంలో వుంది. స్వామినాథన్, మణి ఇసుకలో కూర్చున్నారు. మౌనంగా ఉన్నారు. మణి చంకలో దుడ్డుకర్రతో నేలచూపులు చూస్తున్నాడు. ఆలోచిస్తున్నాడు. ఇంకొద్ది సేపట్లో రాజంగాడి తల బద్దలు కొట్టి నదిలో పారెయ్యబోతున్నాడు. కాని శవం తర్వాత దొరికితే? తనే ఆ పని చేసినట్టు ఎలా తెలుస్తుంది? ఒకవేళ రాజం దయ్యం అయితే? రాత్రిళ్ళు తను ఒంటరిగా పడు కుంటాడు. వాడు దయ్యంగా వచ్చి తన జుట్టు పట్టుకుంటే? బాబోయ్! ఎందుకైనా మంచిది వాడిని చంపకపోవడం. కీళ్ళు విరగ్గొట్టి వదిలేస్తే సరి. వాడి తల బద్దలు కొడ్తే? ఎవరికి తెలుస్తుంది? ఒకవేళ- స్వామినాథన్ కేసి ఓరగా చూశాడు. వాడు అమాయకంగా కళ్ళు మిటకరించి చూస్తున్నాడు. వీడు పోలీసులకు చెప్తేనే తెలుస్తుంది.

బూట్ల చప్పుడు విని గిర్రున తిరిగి చూశారు. రాజం వస్తున్నాడు. ఖాకీ బట్టల్లో వున్నాడు. చంకలో తుపాకి ఉంది. దాన్ని వాడి పుట్టిరోజు బహుమానంగా ఎవరో ఇచ్చారు. నిటారుగా నిల్చుని ''నేను రెడీ!'' అన్నాడు.

''నువ్వు ఆలస్యంగా వచ్చావు.''

''అవును!''

''మనం ప్రారంభిద్దాం.''

రాజం భుజంమీద ఎయిర్‌గన్ పెట్టుకొని గాలిలోకి కాల్చాడు. మణి బిత్తరపోయాడు. అతడి చేతిలో దుడ్డు కిందకు వాలింది. వాడు కొయ్యబారి నిల్చుండిపోయాడు. ''విన్నావుగా తుపాకీ మోత? ఇంకా నీకు నాతో తగాదా పడాలని వుంటే చెప్పు, రెండో గుండు నీ శరీరంలోకి...''

''ఇది అన్యాయం. నాకు తుపాకీ లేదు, నీకుంది. ఇద్దరం వట్టి చేతుల్తో కలబడదాం.''

''మరి నువ్వు దుడ్డుకర్ర ఎందుకు తెచ్చావ్. నిన్న దాన్ని గురించి నువ్వు చెప్పలేదుగా?''

మణి తల వంచుకున్నాడు.

''అసలు నేను నిన్నేం చేశానని నామీద నీకంత కోపం?'' రాజం అడిగాడు.

''ఒకరిదగ్గర నన్ను నువ్వు దొంగవెధవ అన్నావు.''

''అబద్ధం!''

కొద్ది నిముషాలు ఎవరూ మాట్లాడ లేదు.

''అదే నీ కోపానికి కారణం అయితే మర్చిపో. నీతో స్నేహం చెయ్యడానికి నాకు అభ్యంతరం లేదు.''

''నాకూ లేదు'' అన్నాడు మణి.

స్వామినాథన్ ఆశ్చర్యంతో నోరు తెరిచేశాడు. మణి దగ్గర కోతలు కోశాడు. కాని రాజం అంటే అతడికి చాలా ఇష్టం. రాజంతో స్నేహంకోసం ఎదురు చూస్తున్నాడు. కష్టాలు గట్టెక్కాయి. అంతా సంతోషంగా ముగిసింది. సంతోషంతో గంతులేశాడు. రాజం గన్ దించాడు. మణి దుడ్డుకర్రను పడేశాడు. స్నేహానికి గుర్తుగా రాజం జేబులో నుంచి బిస్కెట్లు తీశాడు.

నది సన్నగా సవ్వడి చేస్తోంది. రావిచెట్టు ఆకులు గలగల శబ్దం చేస్తున్నాయి. సంధ్య గుడ్డివెలుగులో ముగ్గురు మిత్రులూ బిస్కెట్లు తింటున్నారు. కొత్త స్నేహంలోని ఆనందాన్ని అనుభవిస్తున్నారు. స్వామినాథన్ మనసు తేలికపడింది.

## అధ్యాయం 3

# స్వామి–బామ్మ

### 1

వీధి వసారాకూ, వంట ఇంటికీ మధ్య వున్న స్థలంలో స్వామి బామ్మ జీవనయాత్ర సాగిస్తోంది. గాలీ వెలుతురూ తక్కువ. ఆమె సామగ్రి అంతా అక్కడే. అయిదు జంపఖానాలతో తయారుచేసిన పెద్ద పరుపు, మూడు పక్క దుప్పట్లు, ఐదు దిండ్లు, జనపనారతో చేసిన ఒక చదరపు పెట్టె, ఒక చిన్న కొయ్యపెట్టె, ఆ పెట్టెలో కొన్ని రాగి కాసులు, ఏలకులు, లవంగాలు, పోకచెక్కలు-ఇవి బామ్మ సామగ్రి.

రాత్రి అన్నం తిని బామ్మ ఒళ్ళో తల పెట్టుకొని పడుకున్న స్వామినాథన్‌కు, యాలకుల, లవంగాల ఘుమ ఘుమల్లో తను సురక్షితంగా వున్నట్టు అనిపించింది.

''బామ్మా! రాజం ఎంత గొప్పవాడో నీకు తెలియదు'' అని ప్రారంభించి, వారిద్దరి మధ్యా నడిచిన సంఘటనలను పూసగుచ్చినట్టు చెప్పాడు.

''వాడికి నిజంగా పోలీసు డ్రెస్ వుంది బామ్మా!''

''అలాగా? వాడికి పోలీసు డ్రెస్ ఎందుకురా?''

''వాళ్ళ నాన్న పోలీసు సూపరింటెండెంట్. ఇక్కడున్న పోలీసు వాళ్లందరిమీద పెద్ద ఆఫీసరు'' అని చెప్పాడు. బామ్మకు నిజమే అనిపించింది. ఆమెకు భర్త గుర్తొచ్చాడు. ఆయన-స్వామినాథన్ తాతగారు సబ్ మేజిస్ట్రేట్‌గా పనిచేశాడు ఆ రోజుల్లో. ఆఫీసులో ఆయన పోలీసువాళ్లను ఎలా గడగడలాడించేవాడో, ఆయన పేరు చెబితే గజదొంగలు సహితం ఎలా గజ గజలాడిపోయేవారో, మననం చేసుకుంటూ చెప్పసాగింది. స్వామినాథన్ విసుగ్గా వింటున్నాడు. ఎప్పుడు ఆపుతుందా అని ఎదురు చూస్తున్నాడు అసహనంగా. కాని ఆమె ఆపడం లేదు. ఎక్కడెక్కడి విషయాలో, ఒకదానికొకటి పొంతన లేకుండా, తలా తోక లేకుండా చెప్పుకుపోతూనే ఉంది.

''ఇక చాల్లే బామ్మా!'' అనేశాడు. ''రాజం గురించి నన్ను చెప్పనివ్వు. వాడికి ఎన్ని మార్కులొస్తాయో నీకు తెలుసా?''

''అన్ని మార్కులూ వాడికే వస్తాయి కదూ?''

''నీకు తెలియదు ఊరుకో. వాడికి 70 శాతం మార్కులు వస్తాయి.''

''బావుంది. మరి నువ్వుకూడా కష్టపడి చదివి బాగా మార్కులు తెచ్చుకోరా నాయనా! మీ తాతయ్య పరీక్షల్లో రాసే సమాధానాలు, పరీక్షాధికార్లనే తికమక పెట్టేవంట తెలుసా? మిగతావాళ్ళు ఏడు గంటలు రాసే సమాధానాలు ఒక్క గంటలో రాసి పారేసేవారు. ఆయనకు ఒకొక్కసారి



రెండువందల మార్కులు కూడా ఇచ్చేవారు. ఎఫ్.ఏ. పాసయినప్పుడు పెద్ద బంగారు పతకం కూడా ఇచ్చారు. చాలా రోజులు దాన్ని నేను లాకెట్‌గా మెళ్ళో వేసుకున్నాను. ఎప్పుడు తీశానంటే...ఆ మీ మేనత్త పుట్టినప్పుడు ... కాదు ... కాదు ... మీ నాన్న పుట్టినప్పుడు. అదే వాడి బారసాలకు... ఆహా కాదు, ఇప్పుడు గుర్తొచ్చింది... దాన్ని మీ అత్తయ్యకిచ్చాను. అది దాన్ని చెడగొట్టి గాజులు చేయించుకుంది. అది వట్టి పిచ్చిది. పిచ్చి గాజులు చేయించింది. మన కుటుంబంలో దానంత పిచ్చివాళ్ళు ఎవరూ లేరు...''

''అబ్బబ్బ, బామ్మా! నువ్వెప్పుడూ ఇంతే. పాత కథలన్నీ చెప్పి ఊదరకొడ్తావ్. రాజంగాడి గురించి వింటావా లేదా?''

''ఆ, చెప్పరా బుజ్జీ!''

''బామ్మా! రాజం చిన్న పిల్లవాడిగా వున్నప్పుడే ఒక పెద్దపులిని చంపాడు తెలుసా?''

''అట్టాగంటురా! అబ్బో చాలా ధైర్యస్తుడే!''

''నన్ను ఉబ్బెయ్యడానికి అంటున్నావు. నువ్వు నిజంగా నమ్మడం లేదుకదూ?''

స్వామినాథన్ ఉద్వేగంగా కథ మొదలుపెట్టాడు. ''రాజం వాళ్ళ నాన్న ఒక అడవిలో బస చేశాడు. తనతో కొడుకును కూడా తీసుకెళ్ళాడు. హఠాత్తుగా ఒకసారి రెండు పెద్దపులులు వాళ్ళమీద దాడిచేశాయి. ఒకటి వెనకనుంచి అకస్మాత్తుగా వాళ్ళ నాన్నమీదకు దూకింది. ఒకటి రాజం వెనక పడింది. రాజం పారిపోయి ఒక పొద చాటున దాక్కున్నాడు. తుపాకితో దాన్ని కాల్చి చంపేశాడు. బామ్మా! నిద్రపోతున్నావా?'' ఆగి అడిగాడు.

''లేదురా, వింటున్నాను.''

''అయితే చెప్పు ఎన్ని పులులు ఎంతమంది మీదకు దూకాయి?''

''రాజం మీదకు రెండు కాబోలు వచ్చిపడ్డాయి.''

బామ్మ జవాబుకు స్వామినాథన్‌కు బోలెడంత కోపం వచ్చింది. ''నేను గొంతు చించుకొని ముఖ్యమైన విషయాలు చెప్తుంటే, నువ్వేమో నిద్రపోతావా? ఏవేవో చెబుతావా? ఇక నేను నీకేమీ చెప్పను పో! అసలు నీకు రాజం అంటే ఇష్టంలేదు. అందుకే వినడం లేదు. ఆమాత్రం నేను తెలుసుకోగలను.''

''లేదు, రాజం చాలా మంచి కుర్రాడు'' రాజం ఎవరో తెలియకపోయినా చెప్పింది. ఆ మాట విని స్వామినాథన్ సంతోషించాడు. కాని మరుక్షణమే మరో కొత్త సందేహం పుట్టుకొచ్చింది.

''బామ్మా! పెద్దపులి గురించి చెప్పిన విషయం అబద్ధం అనుకుంటున్నావు కదూ?''

''లేదు. నేను అందులోని ప్రతి మాటా నమ్ముతున్నాను'' అన్నది బామ్మ అనునయంగా.

స్వామినాథన్‌కు సంతోషం కలిగింది. అయినా ఒక హెచ్చరిక చేశాడు. ''వాడ్ని అబద్ధాలకోరు అని ఎవరైనా అంటే కాల్చిపారేస్తాడు తెలుసా?''

''వాడు మంచిపనే చేస్తాడు. సరే! ఇక, సత్యవాక్కు పరిపాలన కోసం సింహాసనాన్నీ, భార్యాబిడ్డల్నీ పోగొట్టుకొని, మళ్ళీ చివరికి అందర్నీ, అన్నీ దక్కించుకొన్న సత్య హరిశ్చంద్రుడి కథ చెబుతాను విను'' అంటూ కథ మొదలుపెట్టింది. కథ సగంలో వుండగా స్వామినాథన్ ఆమె గొంతుకు లయబద్ధంగా గురకను జోడించాడు. ఆమె కూడా నిద్రలోకి జారిపోయింది.

**2**

శనివారం మధ్యాహ్నం. శని, ఆదివారాలు ఇంట్లో కూర్చుని అమ్మతో, బామ్మతో కబుర్లు చెప్పడం, లెక్కలు చేస్తూ కూర్చోవడం స్వామినాథన్‌కు బొత్తిగా గిట్టదు. మధ్యాహ్న సమయాల్లో ఊళ్లో బలాదూర్ తిరక్కుండా ఇంట్లో కూర్చుని చదువుకోవలసిందిగా తండ్రి ఆజ్ఞ. కాని, తండ్రి మాట తరచుగా పాటించడం జరగదు.

ఆ రోజు తన గదిలో కూర్చుని, ఇంగ్లీషు పుస్తకంలోని పద్యం అర్థం చేసుకోవడానికి నానా తిప్పలు పడుతున్నాడు. అతడికి అసహనంగా వుంది. తండ్రి అద్దం ముందు నిలబడి తలపాగా సరిచేసుకుంటున్నాడు. సిల్కు కోటు తొడుక్కున్నాడు. ఇక కళ్లద్దాలు పెట్టుకోవాలి. స్వామినాథన్ ఆతృతగా ఇదంతా గమనిస్తున్నాడు. కళ్ళజోడు పెట్టుకున్నాడు. ఇక చేతికి గడియారం పెట్టుకోవాలి.

స్వామినాథన్‌కు ఆనందంగా వుంది. ఇక ఆ ఒక్క పని అయిపోతే కోర్టుకు వెళ్ళిపోతాడు. తల్లి ఒక చేత్తో మంచినీళ్ళ చెంబూ, రెండో చేత్తో తాంబూలం తీసుకొచ్చింది. మంచినీళ్ళు అందుకొని తాగేశాడు. ఆమె అందించిన తమలపాకు చిలకల్ని నోట్లో కుక్కుకొని నమలసాగాడు. గొర్రెపిల్ల గురించిన పద్యం స్వామినాథన్ పెద్దగా చదవసాగాడు. అతడి తండ్రి వెండి పొడుంకాయ తీసుకున్నాడు. మురిగ్గా వున్న చేతి రుమాలు చూసి విసుక్కున్నాడు. గొడుగు మోచేతికి తగిలించుకొన్నాడు. బయలుదేరడానికి చివరి సూచన. స్వామినాథన్ పుస్తకం మూసి లేచి నిల్చున్నాడు. తండ్రి దాదాపు బయటికి వెళ్ళాడు. స్వామినాథన్ కాలుతో బల్లకింద నేలను తన్నాడు. తల్లి వెళ్తున్న

తండ్రిని ఆపింది. ''ఇదిగో, నాక్కొంచం చిల్లర డబ్బులు కావాలి. దర్జీ వస్తాడు, నాలుగు రోజుల్నుంచీ తిరుగుతున్నాడు'' అన్నది.

''రేపు రమ్మని చెప్పు.''

ఆమె వదల్లేదు. తండ్రి బీరువా దగ్గరకు తిరిగి వచ్చాడు. తాళంచెవుల కోసం వెదకసాగాడు. బీరువా తెరచి పర్సు తీశాడు. ఆమెకు చిల్లర ఇచ్చి ''ఈ నెలంతా ఎలా నెట్టుకురావాలో అర్థం కావటం లేదు'' అన్నాడు పర్సులోకి చూసుకుంటూ. బీరువాకు తాళంవేసి మరోసారి అద్దంలో చూసుకుంటూ తలపాగా సవరించుకొన్నాడు. గట్టిగా నశ్యం పీల్చి, ఢమాలుతో ముక్కు తుడుచుకుంటూ బయటికి నడిచాడు. స్వామినాథన్ గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాడు.

''గడియ వేసుకో'' వీధి గుమ్మంలోనుంచి తండ్రి కంఠం వినిపించింది. స్వామినాథన్‌కు గడియ వేసిన చప్పుడు వినిపించింది. కిటికీ దగ్గర కూర్చుని తండ్రి వెళ్ళడాన్ని గమనించాడు.

తల్లి వంటింట్లో, మధ్యాహ్నపు కాఫీ ఫలహారాల గురించి వంటమనిషికి ఆదేశాలు ఇస్తున్నది. బామ్మ మంచం మీద కూర్చుని ఉంది. స్వామినాథన్ కనిపించగానే ''ఇలా రారా బుజ్జీ!'' అన్నది.

''ఊహూ, నాకు టైం లేదు.''

''మా బాబువు కదూ! నీకు మూడుపైసలు ఇస్తాను, ఇలారా!''

స్వామినాథన్ అదేమీ పట్టించుకోకుండా పరుగు తీశాడు.

''ఎక్కడికిరా?'' తల్లి కేకపెట్టింది.

''నేను వెళ్ళాలి'' గంభీరంగా ముఖం పెట్టి అన్నాడు.

''ఎండలో బలాదూరు తిరగడానికా?''

''కాదులే!'' ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు.

''వళ్ళు తెలియకుండా తిరిగి జ్వరం తెచ్చుకుంటావా ఏమిట్రా?''

''ఎండలో తిరగనులే.''

''మీ నాన్న శెలవు రోజుల్లో ఇంట్లో కూర్చుని చదువుకోమని చెప్పలేదూ?''

''చెప్పారు. కాని మా డ్రాయింగు మాష్టారు ఓసారి వచ్చి కలవమని చెప్పారు. వెళ్ళకపోతే పరీక్ష పోతుంది. అప్పుడు నీకు సంతోషంగా వుంటుందా?'' విసురుగా అని ఉసిగా బయటికి వెళ్ళిపోయాడు.



## 3

స్వామినాథన్ తోపు వీధిలో పరిగెత్తి కుడివైపుకు తిరిగి అబూ సందులో ప్రవేశించాడు. చిన్నగా వున్న ఒక పూరి ఇంటిముందు ఆగాడు. ఈలవేశాడు. ఓ క్షణం ఆగి మళ్ళీ ఈలవేశాడు. తలుపుకొద్దిగా తెరుచుకుంది. మణి తల బయటికి పెట్టి, ''చవట వెధవా! మా అత్తయ్య వుంది. లోపలకు రాకు. వెళ్ళి దూరంగా నిల్చో. వస్తాను'' అన్నాడు.

స్వామినాథన్ దూరంగా ఉన్న ఒక చెట్టుకింద నిలబడ్డాడు. ఎండ నెత్తి మాడ్చేస్తున్నది. వీధి నిర్మానుష్యంగా ఉంది. పెంటకుప్ప దగ్గర ఓ గాడిద నిలబడి తన నీడకేసి దీక్షగా చూస్తోంది. ఆవు ఒకటి అరిటాకు నములుతున్నది. మణి ఇంట్లో నుంచి తొంగి చూశాడు.

రాజం తండ్రి లేలి ఎక్స్‌టెన్షన్‌లో ఉంటాడు. (దానికి ఆ పేరు, మాల్గుడి సర్కిల్‌లో సూపరెంటెండెంటు ఇంజనీరుగా పనిచేసిన ఫ్రెడ్రిక్ లేలి పేరుమీద వచ్చింది) ఆ ప్రదేశంలో దాదాపు ఏభయ్ ఇళ్ళు వున్నాయి. అన్నీ పెద్ద పెద్ద ఇళ్ళే. అక్కడ వుండేవాళ్ళందరూ దాదాపు ప్రభుత్వ ఉద్యోగులే. తిరుచునాపల్లి వెళ్ళే ట్రంకురోడ్డు, ఈ భవనాలకు అతి చేరువలోనే ఉంది.

స్వామినాథన్, మణి, బెరుకు బెరుకుగా, రాజం ఇంటికి బయలుదేరారు. రాజం ఇంటిముందు తచ్చాడుతున్న వాళ్ళను, యూనిఫారంలో వున్న పోలీసు జవాను గద్దించాడు. ''ఇక్కడ మీకేం పని?'' అని కసిరికొట్టాడు. స్వామినాథన్‌కు అక్కడినుంచి పారిపోవాలనిపించింది. పోలీసువాడికి జవాబివ్వమని మణిని బతిమాలాడు. మణి పొగరుగా పెద్ద గొంతుతో ''రాజం ఇంట్లో వుంటే పిలువు. మమ్మల్ని వాడే రమ్మన్నాడు'' అన్నాడు. పోలీసు ఒక్కసారిగా తగ్గిపోవడం వాళ్ళకు ఆశ్చర్యం కలిగించింది. అతడు ఇద్దర్నీ మర్యాదగా రాజం గది దగ్గరకు తీసుకెళ్ళాడు.

మణికీ, స్వామినాథన్‌కూ, ఆ గది చాలా పెద్దగా వున్నట్టు అనిపించింది. అక్కడ కుర్చీలు వేసివున్నాయి. పెద్ద టేబుల్ కూడా వుంది. రాజం పుస్తకాలు ఆ టేబుల్‌మీద చక్కగా సర్ది వున్నాయి. టేబుల్ మీద వున్న గడియారం వాళ్ళిద్దర్నీ అమితంగా ఆశ్చర్యపరచింది. ఇంత చిన్నవాడికి టేబుల్‌మీద గడియారం కూడా ఉంది అనుకొన్నారు. రాజం నాన్న చాలా గొప్పవాడు అనే భావం కలిగింది.

రాజం వచ్చాడు. తన స్నేహితులు తనకోసం ఎదురు చూస్తున్నారని తెలుసు. అలా వాళ్ళు తనకోసం ఎదురు చూడడం గొప్పగా అనిపించింది. వాళ్ళ నాన్నకోసం వచ్చినవాళ్ళు కూడా ఎంతోసేపు ఆయనకోసం ఎదురుచూస్తూ కూర్చోవడం రాజంకు తెలుసు. అందుకే వెంటనే రాకుండా కొద్ది నిముషాలు పక్క గదిలో గోళ్ళు కొరుక్కుంటూ నిల్చున్నాడు. కాని ఎంతోసేపు అలా చెయ్యలేక పోయాడు. ఒక్క పరుగులో స్నేహితుల దగ్గరకు వచ్చి పడ్డాడు.

''కూర్చోండిరా, కూర్చోండి'' వాళ్ళు నిలబడే వుండడం చూసి ఉద్విగ్నంగా అన్నాడు.

కొద్ది నిముషాల్లోనే వాళ్ళు కబుర్లలో మునిగిపోయారు. టీచర్ల గురించీ, స్కూల్లో చదివే తోటి పిల్లల గురించీ, ఆటల గురించీ, బొమ్మల గురించీ- ఒకటేమిటి ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు.

రాజం స్నేహితులను బీరువా దగ్గరకు తీసుకెళ్ళి, దాన్ని తెరిచాడు. అందులోని వస్తువులు చూసి ఇద్దరూ ఆశ్చర్యంతో తలమునకలై పోయారు. చిన్న చిన్న రైళ్ళూ, మోటార్లూ, బస్సులూ, కీ ఇస్తే ఆడే బొమ్మలూ, బొమ్మలు చూపించే మంత్ర దీపం, బొమ్మల పుస్తకాలూ ఇంకా ఎన్నో చిత్రమైన వస్తువులు ఉన్నాయి. ఒక మూలగా గోడకు ఆనించి పెట్టి వున్న ఎయిర్‌గన్ మణిని అమితంగా ఆకర్షించింది. ఇష్టమైన వస్తువుల్ని చేతుల్లోకి తీసుకొని చూట్టానికి రాజం అనుమతి ఇచ్చాడు. స్వామినాథన్ కీ ఇచ్చే బొమ్మను గది అంతా తిప్పుతూ ఆనందిస్తున్నాడు. మణి విల్లంబు తీసుకొని గోడమీద బాణాలు వెయ్యసాగాడు. అది ఆపి గన్ తీసుకున్నాడు. దాంతో గదిలోని వస్తువులను చిందర వందరగా చేశాడు.

''ఒరేయ్, మీకు ఆకలి వెయ్యడం లేదా?'' అడిగాడు రాజం.

''లేదు'' అన్నారు మొహమాట పడిపోతూ.

పోలీసును కేకవేశాడు. అతడు వచ్చి వినయంగా నిల్చున్నాడు.

''వంటమనిషితో మా ముగ్గురికీ ఫలహారం, కాఫీ పట్టుకురమ్మని చెప్పు''పురమాయించాడు.

పోలీసుతో రాజం అంత గట్టిగా మాట్లాడడం వాళ్ళిద్దరకీ బోలెడంత ఆశ్చర్యం కలిగించింది. గర్వంగా కూడా అనిపించింది.

పెద్ద పళ్ళెం నిండా తినుబండారాలు తెచ్చి టేబుల్‌మీద వుంచాడు వంటమనిషి. రాజంకు, స్నేహితుల ముందు తన అధికార దర్పం ప్రదర్శించాలని అనిపించింది.

''టేబుల్ మీదనుంచి తియ్'' దాదాపు అరిచాడు రాజం.

వంటమనిషి గబుక్కున పళ్ళెం తీసి కుర్చీమీద పెట్టాడు.

''ఒర్రేగాడిదా! అక్కడా పెట్టేది? తియ్'' మళ్ళీ అరిచాడు.

''ఇంకెక్కడ పెట్టమంటారు రాజా బాబూ!''

''రాస్కెల్, స్కౌండ్రల్, నాకు ఎదురు చెప్తావా?''

వంటమనిషి ముఖం నల్లబడింది. గొణుక్కున్నాడు.

''టేబుల్‌మీదే పెట్టు'' రాజం గద్దించాడు.

''మీరిట్టా తిడితే అమ్మగారికి చెప్తాను'' అన్నాడు వంటమనిషి.

''చెప్పుకో నాకేం భయమా?''

కప్పు మురిగ్గా వున్నాదని మళ్ళీ తిట్టాడు రాజం.

''మీకు ఆకలేస్తే వంటింట్లోకి వచ్చి తినండి'' అని వంటమనిషి విసురుగా తెచ్చినవన్నీ తిరిగి పట్టుకెళ్ళిపోయాడు.

ఆ పదార్థాలు చూస్తుంటే వాళ్ళిద్దరికీ నోరు ఊరింది. రాజం ప్రవర్తన వాళ్లకు నచ్చలేదు. రాజంకు పెద్ద చిక్కులో పడ్డట్టు అయింది. స్నేహితుల ముందు తన నౌకరు తనను అలా కించపర్చినందుకు దిమ్మెరపోయి కొద్ది నిముషాలు కూర్చుండిపోయాడు మౌనంగా.''స్కౌండ్రల్, వాడు వట్టి బఫూన్!'' అన్నాడు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో కొద్ది నిముషాల తర్వాత తేరుకుని. ''ఉండండి''అంటూ ఇంట్లోకి వెళ్ళాడు.

చేత్తో ఫలహారాల పళ్ళెం పట్టుకొని తిరిగి వచ్చాడు. అతని అపజయం పట్ల స్నేహితులకు ఆశ్చర్యం కలిగింది. మొత్తంమీద రాజం వంటమనిషిని లొంగదీసుకోలేక పోయాడు. రాజం వాడ్ని తుపాకితో ఎందుకు కాల్చి చంపలేదో అంతుపట్టలేదు ఎంత ఆలోచించినా స్వామినాథన్‌కు. తనకు వాడ్ని అప్పగించివుంటే వాడి అంతు తేల్చి వుండేవాడు అని అనుకున్నాడు మణి. వాళ్ళ ఆలోచనల్ని పసికట్టినట్టుగా ''లోపలికెళ్ళి వాడ్ని ఒక్క తన్ను తన్నాను. దిమ్మతిరిగి స్పృహతప్పి వంటింట్లో పడివున్నాడు. అందుకనే నేను స్వయంగా తీసుకొచ్చాను'' అన్నాడు రాజం.

## అధ్యాయం 4

# 'తోక అంటే...?'

### 1

ఆ రోజు జాగ్రఫీ టీచరు రాలేదు. ఫస్టుఫారం 'ఎ' సెక్షన్ విద్యార్థులకు మధ్యాహ్నం మూడు నుంచి మూడు నలభై అయిదు వరకు విరామ సమయం.

ఎందువల్లనో ఆ రోజు స్వామినాథన్ మిత్రులెవరూ రాలేదు. పసిపిల్లలు చదువుకొనే వరండాలోకి వెళ్ళాడు. ఆ చిన్నపిల్లలు నాలుగు కాళ్ళమీద నడవకపోయినా స్వామినాథన్‌కు విడ్డూరంగా కన్పించారు. బంకమట్టి పిసుకుతూ బొమ్మలు చెయ్యడానికి ప్రయత్నిస్తున్న వాళ్లను చూస్తూంటే చిరాకు వేసింది. స్కూల్లో ఈ పనులు అర్థంపర్థం లేనివిగా అనిపించాయి. బొమ్మలు చేసుకోవాలంటే ఇంటివెనక దొడ్లో కూర్చుని చేసుకోవచ్చుగా? ఇలాంటి పనులు చెయ్యడానికి స్కూలుదాకా రావాలా? జాగ్రఫీ, లెక్కలూ, బైబులూ, ఇంగ్లీషు ఎన్ని విషయాలు లేవు స్కూల్లో నేర్చుకోవటానికి?

ఒక గదిలో పిల్లలందరూ తమిళ అక్షర మాలలోని మొదటి రెండు అక్షరాలను బిగ్గరగా కంఠస్తం చేస్తున్నారు. స్వామినాథన్ చెవులు మూసుకున్నాడు. ఆ టీచరు ఎలా భరిస్తున్నాడా అని ఆశ్చర్యపోయాడు. అక్కడ్నుంచి కదిలి మరో గదిలోకి వెళ్ళాడు. అక్కడ పిల్లలు అస్తవ్యస్తంగా వున్న బట్టల్లో కన్పించారు. బెంచీలమీద కూర్చుని కాళ్ళు ఊపుతూ గోల గోలగా అరుస్తున్నారు. స్వామినాథన్‌కు పిచ్చెక్కినట్టే అయింది. కనుబొమలు ముడిచి, మూతి తిప్పుతూ తన అయిష్టతను టీచర్‌కు తెలియజెయ్యడానికి ప్రయత్నించాడు. కాని దురదృష్టవశాత్తు ఆ టీచర్ వీపు అతడి వైపుకు ఉన్నది.

పెద్ద క్లాసులు ఉన్న చోటుకు వచ్చాడు. మెట్ల ముందు ఆగిపోయాడు. ఆ గదుల్లో సెకెండ్, థర్డ్ ఫారాలు నడుస్తున్నాయి. అవి తను భవిష్యత్తులో చేరబోయే తరగతులు. తను ఎంతో ఆసక్తిగా ఎదురుచూస్తున్న తరగతులు. వెళ్ళి చూడాలనిపించింది. రెండు మెట్లు ఎక్కి ఆగిపోయాడు. హెడ్‌మాస్టరు అక్కడ వుండవచ్చును. ఆ తరగతుల్లో ఆయనే ఎక్కువగా పాఠాలు చెప్తూవుంటాడు. టీచర్లు కూడా పెద్దవాళ్ళే. ఇక పిల్లల సంగతి చెప్పనక్కర్లేదు. ఎద్దు మొద్దు

అవతారాలు. దూరంగా 'క్రీక్ క్రీక్' అంటూ శాండిల్స్ శబ్దం వినిపించింది. హెడ్‌మాస్టరు అటుగా వస్తున్నాడని అర్థం చేసుకున్నాడు. అక్కడ తను దొరికిపోతే ఇంకేమైనా వుందా? ఆయన ప్రశ్నలకు తను సరైన సమాధానాలు చెప్పలేడు. స్కూల్లో లేరనుకున్న తన జట్టువాళ్ళు ఎదురవడం స్వామినాథన్‌కు చాలా ఆనందం కలిగించింది. రాజం, మణి తప్ప మిగతా అందరూ వున్నారు. చింతచెట్టు కింద ఏదో ఆడుకుంటున్నారు. స్వామినాథన్ ఉషారుగా కేరింతలు కొడ్తూ వాళ్ళలో కలిసిపోయాడు. కాని వాళ్ళు మాత్రం అతనితో కలవడం లేదు. అతడికేసి ఒకసారి చూసినవ్వి, మళ్ళీ తమ ఆటల్లో మునిగిపోయారు. తనకు చాలా దగ్గరగా వుండే సోము కూడా ముభావంగా వుండడం స్వామినాథన్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎక్కడో ఏదో పొరపాటు జరిగి వుండాలి. స్వామినాథన్ చనువుతో ''ఒరే నేను కూడా ఆడతాన్రా!'' అని అరిచాడు. ఎవరూ బదులు పలకలేదు. కొద్ది నిముషాలు మౌనంగా వుండి, తను కూడా ఆడతానని గట్టిగా అరిచి చెప్పాడు.

''ఎక్కువ మందిని తీసుకోవడానికి వీల్లేదని చెప్పడానికి జాలివేస్తుందిరా'' శంకర్ ముభావంగా చెప్పాడు.

''కొందరు తోకల్లా చాలా ఉపయోగపడతారు'' అన్నాడు బఠాణీగాడు. పిల్లలంతా గొల్లున నవ్వారు.

''నువ్వు తోక అన్నావుకదూ? తోక సంగతి ఎందుకు వచ్చింది ఇక్కడ?'' అడిగాడు శంకర్.

''నా ఇష్టం! అంటాను, నీకెందుకూ? నీ గురించి అనలేదుగా?'' అన్నాడు బఠాణీ.

''అలా అయితే సంతోషమే. ఆ మాట ఇక్కడ వున్నవాళ్ళకెవరికైనా వర్తిస్తుందా?''

''కావచ్చు.''

''తోక అంటే?''

''గాడిదకు గానీ, కుక్కకుగానీ అతుక్కుని వేలాడుతూ పొడుగ్గా వుండేది.''

ఆ వ్యాఖ్యలు తనను గురించేనని అర్థం అయినా అలా అనడంలోని అంతరార్థం ఏమిటో స్వామినాథన్‌కు అర్థం కాలేదు. చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఏడుపు వచ్చింది.

గంట మోగింది. అందరూ క్లాసుకు పరుగెత్తారు. స్వామినాథన్ జేవురించిన ముఖంతో తన సీట్లో కూర్చున్నాడు.

అది ఇంగ్లీషు పీరియడ్. వేదనాయగం పాఠం చెప్పడానికి వచ్చాడు. ఆయన, ముందు తరాల కొరకు చెట్టు నాటిన ముసలివాడికి, రాజుగారు పది రూపాయలు ఇవ్వడం గురించిన కథ చదువుతున్నాడు. స్వామినాథన్ బుర్రలోకి ఒక అక్షరం ముక్క కూడా ఎక్కడం లేదు. మెదడు మొద్దుబారినట్టుంది. ఏదో బాధ. ఏదైనా ప్రశ్న వేసివుంటే, తప్పు చెప్పి ఆ రోజంతా బెంచీమీద నిలబడాల్సి వచ్చివుండేది. కాని అతని అదృష్టం బాగుంది.

పీరియడ్ అయిపోయింది. స్వామినాథన్ ఒంటరిగా ఇంటికేసి నడుస్తున్నాడు. మెల్లగా నడుస్తున్నాడు. మనసులో ఏదో బాధగా వుంది. కొన్ని గజాల ముందుసోము నడుస్తున్నాడు. ''సోము! సోము! ఆగరా!'' అని అరిచాడు. సోము ఆగాడు.

కొద్ది నిముషాలు మౌనంగా వుండిపోయారు.

''అసలు మీ అందరికీ ఏమొచ్చిందిరా?'' ఉక్రోషంగా అడిగాడు.

''ప్రత్యేకంగా ఏమీ లేదు. కాని నీకొక విషయం చెప్పనా? ఈమధ్య నీకొక కొత్త పేరు తగులుకొంది. 'తోక' అని. నువ్వు రాజంగాడి తోకవట. మేము ఇప్పుడు నీ దృష్టికి ఆనడంలేదట. అందరూ పోలీసు సూపరింటెండెంటు కొడుకులే వుంటారా ఏం?'' అనేసి వెళ్ళిపోయాడు.

స్వామినాథన్‌కు ఇది జీవితంలో మొదటి షాక్. ఆ దెబ్బకు వాడి మనసు మొద్దుబారి పోయింది. ఆ దెబ్బ తట్టుకొని ఆలోచించసాగాడు. ఇది నిజమా, కలా? సోమేనా అంతమాట అన్నది? మెతక మనిషి అయిన సోము, శాంతమూర్తి సోము, క్లాసుకు పెద్ద దిక్కుగా వుండే సోము అంత మాట అన్నాడా? రాజం అంటే ఇష్టపడడం, అతనితో తిరగడం తప్పా? వాడంటే వీళ్ళకెందుకో అంత కోపం?

ఇంటికి వెళ్ళి కోటూ, టోపీ, పుస్తకాలు బల్లమీద గిరాటు వేశాడు. తనకోసం పెట్టివున్న చల్లటి కాఫీ గటగట తాగేశాడు. తిన్నెమీద కూర్చుని, తలలో చిక్కు ప్రశ్నలు తిరుగుతూ వుంటే, వినాయక మొదలి వీధిలో ప్రవహిస్తున్న మురుగు కాలవను తదేకంగా చూస్తున్నాడు. నల్లటి నీరు ప్రవహిస్తోంది. చెత్తకాగితాలూ, ఆకులూ, పుల్లలూ కొట్టుకుపోతున్నాయి ఆ నీటి ప్రవాహంలో. ఒక చిన్న రేకుముక్క తేలింది. స్వామినాథన్‌కు చెయ్యిచాచి దాన్ని అందుకోవాలనిపించింది. కాని ఆ పని చెయ్యలేదు. మనసు మనసులో లేదు. మెరుస్తున్న ఆ టిన్ను ముక్క అలా అలా తేలుతూ పోతున్నది. ప్రహరీ గోడ చివరకు చేరుకుంది. ఆ డబ్బా రేకును ఒక ఇటుక అడ్డుకోవడం స్వామినాథన్‌కు నచ్చలేదు. ఇటుక కూడా కొట్టుకుపోవాలి. లేదా దేనికీ అడ్డం

రాకుండా తప్పుకోవాలి అని అనుకున్నాడు. రేకు ముక్క దానికదే తప్పించుకొని రివ్వున ముందుకు దూసుకుపోయింది. స్వామినాథన్ పరిగెత్తుకెళ్ళి ఒక కాగితం తెచ్చుకున్నాడు. పడవ చేశాడు. ఒక చిన్న చీమ దారితో చకతిరగడం చూశాడు. జాగ్రత్తగా దాన్ని పట్టుకొని పడవలో పెట్టి నీటి ప్రవాహంలోకి వదిలాడు. అది వేగంగా వెళ్తుంటే చూస్తుండిపోయాడు. చీమ ప్రయాణం చేస్తున్న పడవ, చెత్తా చెదారం పేరుకుపోయి ప్రమాదకరంగా వున్న చోట ఇరుక్కుపోవడం చూశాడు. ఊపిరి బిగబట్టి చూశాడు. కొద్ది క్షణాల్లోనే పడవ చాకచక్యంగా కుడివైపుగా మలుపు తిరిగి ప్రమాదాన్ని తప్పించుకోగలిగింది. అలా సాగిపోతూనే వుంది. ప్రవాహం వేగంగా సుళ్ళు తిరుగుతున్న భయంకర ప్రదేశాన్ని చేరుకుంది. తన పడవకు చివరి క్షణాలు దాపురించాయని తేల్చుకున్నాడు. అది ఆ సుడిగుండంలో చిక్కుకొని అట్టడుగుకు చేరిపోవడం ఖాయం అనుకున్నాడు. పడవ ఊగిసలాడుతూ. కిందికీ పైకీ తిరుగుతూ, పిచ్చిగా గింగిరాలు కొడ్తూంది.

అయితే విధివశాత్తూ పక్కింటి వంటింట్లో నుంచి కొత్తగా వచ్చి చేరిన నీరు దాన్ని ముందుకు తోసింది. ప్రమాదం తప్పింది. కాని ప్రవాహ వేగం హెచ్చడంతో పడవ దాదాపు తలకిందులై మునిగిపోయే స్థితికి చేరుకుంది. ప్రవాహ వేగం కొంచెం తగ్గింది. పడవ మెల్లగా ముందుకు కదలసాగింది. ఇంతలో చెట్టునుంచి ఓ ఎండుటాకు దానిమీద పడింది. పడవను తలకిందులు చేసింది. స్వామినాథన్ ఒక్క ఉదుటున లేచి పరుగు తీశాడు. కనీసం చీమనైనా రక్షించాలనుకున్నాడు. దానికోసం వెదికాడు. నీరంతా కలియజూచాడు. కాని ఎక్కడా చీమ జాడ లేదు. పడవ, దానితోపాటు అందులో ప్రయాణం చేస్తున్న చీమా కూడా అంతు చిక్కకుండా పోయాయి. వంగి చేతుల్లోకి మట్టి తీసుకొని, చీమ ఆత్మ శాంతికోసం ప్రార్థించి, ఆ మట్టిని మురికినీటిలో చల్లాడు.

2

స్వామినాథన్‌కు కొద్దిరోజుల్లోనే సోము వాళ్ళ జట్టుకు దూరంగా ఉండడం అలవాటయింది.

అయినా అతడికి పాత స్నేహితులతో మాట్లాడాలనే కోరిక బలీయంగానే ఉంది. మత బోధ మాస్టారు పెదాలు విరిచి ముక్కు గోక్కున్నప్పుడల్లా, బఠాణీగాడి కాలు తొక్కి పగలబడి నవ్వాలని పించేది. కాని బలవంతంగా ఆ కోర్కెను అణచుకొనేవాడు. గతంలో కొన్ని వందలసార్లు ఆ పనిచేసి ఆనందించాడు. ఎర్ర టోపీగాడు క్లాసులో కూర్చుని ఊరికే కునికిపాట్లు పడుతూ వుంటాడు. మధ్య మధ్య తృళ్ళిపడి తల పైకెత్తుతాడు. కొద్ది క్షణాలకే

మళ్ళీ నిద్రమత్తులో తల కిందకు వాలుతుంది. అది చూసిన స్వామికి బఠాణీ చెవులో ''చూడు, చూడు ఆ ఎర్ర టోపీగాడ్ని చూడు. ఇప్పుడో కాసేపటికో పడిపోతాడుచూడు'' అని చెప్పాలని అనిపించింది. కాని చెప్పలేక పోయాడు. బాధగా పెదవులు కొరుక్కున్నాడు. సోము తనకేసి చూస్తూ వుండడాన్ని గమనించాడు స్వామినాథన్. వాడి కళ్ళల్లో స్నేహభావం కనిపించిది. ''సోముగాడికి మళ్ళీ తనతో జట్టుకట్టాలని వున్నట్టుంది'' అనిఅనుకున్నాడు. స్వామి స్నేహపూర్వకంగా చూసి పలకరించే ప్రయత్నంలో వుండగానే. సోము ముఖం తిప్పేసుకున్నాడు. ఆ సమయంలో అతడి ముఖంలోని హావభావాలు స్వామి ఊహించినదానికి విరుద్ధంగా వున్నాయి.

స్వామినాథన్ స్కూలు ఆవరణలో నడుస్తున్నాడు. వెనకనుంచి రెండు మూడు కంఠాలు వినిపించిచివ్వున తిరిగి చూశాడు. సోము, శంకర్, బఠాణీగాడు కనిపించారు. ఆగి వాళ్ళతో కలవాలా, వాళ్ళు వెళ్ళిపోయేంతవరకూ అక్కడే ఆగిపోవాలా లేక మరో వైపుకు వెళ్ళిపోవాలా? ఏదీ తేల్చుకోలేక పోయాడు. ముందుకు నడుస్తూనే వున్నాడు. వెనకనుంచి మూడు జతల కళ్ళు తనను గమనిస్తున్నట్టు అనిపించి ఇబ్బంది పడిపోతున్నాడు. వాళ్ళు వెనకనుంచి తనను వెక్కిరిస్తూ వుండివుంటారని అనిపిస్తోంది. తన నడకను, తను పుస్తకాలు మోసే పద్ధతిని వెక్కిరిస్తున్నారేమో? మెడమీద దురద పుట్టింది. గోక్కుంటే వాళ్ళు ఎగతాళిగా నవ్వుకుంటారనే భయంతో ఆ బాధను భరించాడు.

కుడివైపుకు తిరిగి స్కూలు వరండాలోకి వెళ్ళాలని అనిపించింది. అలా చేస్తే తనను పిరికివాడికింద జమకట్టి గేలిచేస్తారు. అక్కడనుంచి పారిపోవాలని ఉంది. కాని ఆ పని చెయ్యలేడు. తిరిగి రెండో వైపుకు వెళితే వాళ్ళ ముఖాల్ని ఎదురుగా చూడాల్సి వస్తుంది. అందువల్ల ముందుకు పోవడమే మంచిది. అసలు వాళ్ళు వెనక వస్తున్నట్టు పట్టించుకోకూడదు. పది రోజుల క్రితం వాళ్ళు తనతో ఎలా వుండేవాళ్ళు? ఇవ్వాళ? ఎంత మారిపోయారు? ఆలోచిస్తుంటే ఆశ్చర్యం కలుగుతోంది స్వామినాథన్‌కు.

కాని ఈ బాధ భరించరానిదిగానే వుంది. నడుస్తుంటే కాళ్ళు తడబడుతున్నాయి. స్కూలు వరండా వైపు తిరిగే అవకాశం కూడా దాటిపోయింది. ఏదో చెయ్యాలి. వీళ్ళనుంచి తప్పించుకోవాలి. అకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టింది. ఠక్కున ఆగాడు. దేనికోసమో వెతుకుతున్నట్టుగా అటూ ఇటూ చూశాడు. ''అరెరే! నా నోటుబుక్కు ఏమయింది? ఎక్కడ వదిలేశాను?'' వాళ్ళకు వినబడేలా పెద్దగా అని పరుగు తీశాడు.

## అధ్యాయం 5

# 'తంత్రి' గది

### 1

అది శనివారం మధ్యాహ్నం. రాజం వస్తానన్నాడు. స్వామినాథన్ చాలా ఉత్సాహంగా ఉన్నాడు. వాణ్ణి ఎక్కడ కూర్చోబెట్టాలి. తన గదిలోనే కూర్చోబెడితే? నాన్న బట్టలు మార్చుకోవటానికి తరచూ వస్తూ వుంటాడు. అయినా ఇప్పుడు నాన్న కోర్టులో వుంటాడు. ఆ ఆలోచన అతడికి ఊరట కలిగించింది. టేబుల్ శుభ్రం చేసాడు. పుస్తకాలు సర్దాడు. సర్దిన టేబుల్ చూస్తే నాన్న సంతోషిస్తాడు. స్వామి బామ్మ దగ్గరకు వెళ్ళి "బామ్మా! నీకు రాజం గురించి చెప్పాను కదూ?" ఉద్వేగంగాఅడిగాడు.

"ఆ, వాడు బాగా లావుగా వుంటాడు. కాని పరీక్షలు మాత్రం తప్పుతూ ఉంటాడు."

"అబ్బ! బామ్మా! వాడుమణిగాడు."

"ఆ, గుర్తొచ్చింది. వాడిని 'గింజ' అని అంటారనుకుంటాను. చిన్నగా పొట్టిగా..."

"బామ్మా! వాడు వేరు. వాణ్ణి బఠాణీ అంటాము. నేను చెప్తున్నది రాజం గురించి. వాడు పులిని చంపాడు. వాడి నాన్న పెద్ద పోలీసు ఆఫీసరు. చాలా గొప్పవాళ్ళు." బామ్మ వెంటనే అర్థం చేసుకోలేక పోయినందుకు బాధపడ్తూ చెప్పాడు.

"ఓ! ఆ కుర్రాడా? మనింటికి వస్తున్నాడా? చాలా సంతోషం."

"షూ, నేను నీకొకటి చెప్పాలి."

"వాడిని నాకు చూపిస్తావా? చూడాలని వుంది."

"చూద్దాంలే!" పొడి పొడిగా అన్నాడు స్వామి.

"బామ్మా! నీకో సంగతి చెప్పాలి. వాడితో ఉన్నప్పుడు నన్ను పిలవకూడదు. నువ్వు అక్కడకు రాకూడదు."

"ఏం? ఎందుకని?"

"ఎందుకంటే...ఎందుకంటే...నువ్వు చాలా ముసల్దానివి" గబుక్కున అనేశాడు.

బామ్మ హాయిగా నవ్వింది.

స్నేహితుడికి ఏదైనా మంచి ఫలహారం పెట్టాలి. ఏం పెట్టాలి? తల్లి దగ్గరకు వెళ్ళాడు. ఆమె కత్తిపీట ముందు కూర్చుని అరిటాకులు కోస్తున్నది. స్వామి తల్లి ఎదురుగా కూర్చున్నాడు. ఒక ఆకును చేతిలో తీసుకొని ముక్కలు ముక్కలుగా చింపుతూ ముఖం ఇబ్బందిగా పెట్టాడు.

''ఆకంతా ముక్కలు చేసి ఇంటినిండా వెయ్యకు. తుడవలేక చావాలి'' అంది తల్లి.

''అమ్మా! మధ్యాహ్నం ఏం ఫలహారం చేస్తున్నావ్?''

''ఆలోచించటానికి టైం వుందిగా.''

''ఏదైనా మంచి ఫలహారం చేస్తే బావుంటుంది. రుచిగా, తియ్యగా వుండాలి. రాజం ఇవ్వాళ మధ్యాహ్నం మనింటికి వస్తాడు. నాకు రోజూ ఇచ్చినట్టు చల్లటి కాఫీ మాత్రం ఇవ్వకు. వాడు వేడి కాఫీ తాగుతాడు.'' రాజం ఇంట్లో వంటమనిషి అన్నీ తెచ్చి ఎలా సమకూరుస్తాడో గుర్తుకొచ్చి అన్నాడు, -''అమ్మా, కాఫీ టిఫెన్లు నేను వచ్చి పట్టుకెళ్ళను. నా గదికి పంపిస్తావా?'' ఆగి వంటమనిషికేసి తిరిగాడు. ''చూడూ! ఆ మురికి ధోవతితో రాకు. తెల్లటి చొక్కా, శుభ్రమైన ధోవతిలో రావాలి, విన్నావా?'' అని కొంచెం సేపు ఆగాడు. ''అమ్మా! ఒకటి, రెండు గంటలు నాన్నగారి గది నాకిప్పించవూ?'' అని తల్లిని ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు. ''నేను పనిలో ఉన్నాను. నువ్వే అడుగు''అన్నది తల్లి.

''నువ్వు అడిగితే కాదనరమ్మా!'' అన్నాడు. కాని తనే తండ్రి దగ్గరకు వెళ్ళి,''నాన్నగారూ! మిమ్మల్ని నేను ఒకటి అడగాలనుకుంటున్నాను'' అన్నాడు. తండ్రి పేపర్లో నుంచి తలెత్తి చూశాడు.

''నాన్నగారూ! నాకు మీ గది కావాలి.''

''ఎందుకు?''

''నా స్నేహితుడు వస్తున్నాడు, అందుకని.''

''నీకు నీ గది ఉందిగా?''

''ఆ గదిలో రాజంను కూర్చోబెట్టడం నాకిష్టం లేదు.''

''ఏం? ఆ రాజం అంత గొప్పవాడా?''

''వాడు పోలీసు సూపరింటెండెంట్‌గారి అబ్బాయి. వాడు...వాడు మామూలు కుర్రాడు కాదు.''

''అలాగా! అయితే నా గది వాడుకో. కాని నా టేబుల్‌మీది వస్తువులు కదిలించి పాడు చెయ్యవద్దు.''

''ఆ, నేను జాగ్రత్తగా వుంటాను. నాన్నా మీరు చాలా మంచివారు.''
''సరేలే! వెళ్ళి చదువుకో.''

## 2

స్వామినాథన్ కోరుకున్నట్టే రాజంకు అతిథి మర్యాదలు జరిగాయి. తండ్రి తన గది తెరిచి వెళ్ళాడు. తల్లి గోధుమ, చక్కెరతో ఏదో చాలా రుచిగల ఫలహారం చేసింది. కాఫీ కూడా చాలా బాగుంది. బామ్మ కూడా ఇచ్చిన మాట నిలబెట్టుకొన్నది. రాజం ముందు నోరు మెదపలేదు. కాకపోతే ఒక విషయంలోనే బాధగా వుంది. అది, వంటమనిషి బట్టలు మార్చుకోక పోవడం.

స్వామినాథన్ రాజంను తన తండ్రి రివాల్వింగ్ ఛైర్లో కూర్చోబెట్టాడు. మూడు గంటలు కబుర్లు చెప్పుకున్నారు. మణి-ఎబెనెజార్, రైళ్ళు, పులివేట, పోలీసులు, దయ్యాలు-ఇంకా ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నారు.

''నీ గది ఏదీ?'' అడిగాడురాజం.

స్వామినాథన్ గతుక్కుమని ''ఇదే, ఏం?'' అన్నాడు.

రాజంకు వాడి మాటలు అర్థం కాలేదు. నువ్వు ఇలాంటి పుస్తకాలు చదువుతావా?''న్యాయశాస్త్ర గ్రంథాలను చూపిస్తూ అడిగాడు. స్వామినాథన్ ఇబ్బందిగా ముఖం పెట్టాడు. రాజం రెండో ప్రశ్న స్వామినాథన్ మరీ ఇబ్బంది పెట్టింది. ''నీ పుస్తకాలు ఏవి?'' అన్నాడు చిరునవ్వుతో.

''నిజానికి ఈ టేబుల్ మా నాన్నగారిది. నేను లేనప్పుడు నాన్నగారు క్లయింట్స్‌తో ఇక్కడే మాట్లాడతారు.''

''అది సరే! నువ్వు నీ పుస్తకాలను ఎక్కడ పెట్టుకుంటావు?''

స్వామినాథన్ మాటను దాటవేస్తూ, ''నువ్వు మా బామ్మను చూశావా రాజం?'' అన్నాడు.

''లేదు. నాకు చూపిస్తావా? ఆమెను చూడటం నాకు చాలా ఇష్టం''అన్నాడురాజం.

''ఒక్క నిముషం'' అంటూ స్వామి బయటికి వచ్చాడు. బామ్మ నిద్రపోతూ వుంటే బాగుణ్ణు. నిద్రపోయే బామ్మను చూపడంవల్ల తనకు వచ్చే ఇబ్బంది ఏమీ ఉండదు. అవును! బామ్మ నిద్రపోతూనే వుంటుంది.

ఆమె మంచంమీద హాయిగా కూర్చుని వుంది. అతడికి నిస్పృహ కలిగింది. ఆలోచిస్తూ ఆమెకేసి చూస్తూ నిల్చున్నాడు.

''ఏమైందిరా! ఏమైనా కావాలా?'' అడిగింది బామ్మ.

''ఏమీ అక్కర్లేదు. కాని నువ్వు నిద్రపోవడం లేదా? నిన్ను చూడటానికి రాజంను తీసుకువచ్చాను.''

''అలాగా! దగ్గరికి రా నాయనా రాజం! నాకు. నీ మొహం సరిగ్గా కనబడడం లేదు. పెద్ద ముండను. గుడ్డిదాన్ని.

స్వామినాథన్‌కు చర్రున కోపం వచ్చింది. ''ఈ ముసల్ది ఇవన్నీ రాజం ముందు వాగడం ఎందుకు?'' లోలోపల బామ్మను తిట్టుకున్నాడు.

రాజం ఆమె మంచంమీద కూర్చున్నాడు. బామ్మ అతడి తల నిమురుతూ,''కురచగా చక్కగా వుంది జుట్టు అని పొగిడింది. రాజం తల్లి పేరు అడిగింది. ఎంతమంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళని వాకబు చేసింది. ఆవిడకున్న నగల గురించి కూడా అడిగింది. నల్ల ట్రంకునిండా నగలున్నాయనీ, ఆకుపచ్చ పెట్టెనిండా బంగారు, వెండి పాత్రలు ఉన్నాయనీ చెప్పాడు రాజం. మద్రాసు గురించి చెప్పాడు. అక్కడున్న లైట్ హౌస్, సముద్రం, బస్సులు, సినిమాలు మొదలైనవాటి గురించి ఎన్నో కబుర్లు చెప్పాడు. రాజం చెప్పే ప్రతి విషయం బామ్మకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

## 3

స్వామినాథన్ క్లాసులో అడుగు పెట్టగానే, బెంచీల్లో గుసగుసలు మొదలయ్యాయి. అవి తనగురించి కాదులే అనుకొన్నాడు. అయితే అవి ఆగలేదు. చుట్టూ కలియజూచాడు. వాడి కళ్ళు నల్లబోర్డుమీద పడ్డాయి. పెద్ద పెద్ద అక్షరాల్లో ''తోక'' అని రాసివుంది. స్వామినాథన్ బోర్డు దగ్గరకెళ్ళి చేతుల్తో ఆ అక్షరాలు చెరిపేశాడు. తిరిగి క్లాసుకేసి చూశాడు. శంకర్ తల వంచుకొని నోటుబుక్కులో ఏదో చూస్తున్నాడు. బఠాణీగాడు సంచి విప్పుకోవడంలో మునిగి ఉన్నాడు. ఒక్కమాట మాట్లాడకుండా బఠాణీ దగ్గరకు వెళ్ళి చెంప ఛెళ్ళుమనిపించాడు. బఠాణీకి కళ్ళల్లో నీరు తిరిగింది. తనకేమీ తెలియదని ఒట్టు వేసుకొన్నాడు. స్వామి తల తిప్పి శంకర్‌ను చూశాడు. వాడేదో పని చేసుకుంటున్నాడు. తిన్నగా వాడిదగ్గరకెళ్ళి చెంపమీద గట్టిగా ఒకటి ఇచ్చాడు.

గొడవ ప్రారంభం అయింది. శంకర్, స్వామినాథన్, బఠాణీ, ఒకళ్ళమీద ఒకళ్ళు పడి దొర్లుతున్నారు. బట్టలు చింపుకుంటున్నారు. రక్కుకుంటున్నారు. తన్నుకుంటున్నారు. తిట్టుకుంటున్నారు. గంట మోగింది. రాజం, సోము, మణి వచ్చారు. టీచర్ వచ్చి నిస్సహాయంగా చూస్తూ నిలబడ్డాడు. నీరు కారిపోవడం తప్ప ఆయన చెయ్యగలిగేదేమీ లేదు. ఆయన ఒక వృద్ధ తమిళ పండితుడు. స్కూల్లోకల్లా అర్భకుడు ఆయనే.

సోము, మణి, వాళ్ళను విడదీశారు. టీచర్ వేదిక ఎక్కి కుర్చీలో కూర్చున్నాడు. సోము లేచి నిలబడి ''సార్! మమ్మల్ని బయటికి పోనివ్వండి. క్లాసులో గొడవ జరగడం మాకు ఇష్టం లేదు'' అన్నాడు. టీచర్ ఏదో చెప్పబోయేలోగానే మణి స్వామినీ, బఠాణీనీ బయటికి నెట్టుకుంటూ తీసుకెళ్ళాడు. వారి వెనకే శంకర్, సోము కూడా వెళ్ళారు.

స్కూలు పక్క ఖాళీ స్థలంలోకి అందరూ చేరారు. నిశ్శబ్దతలో ఉద్రిక్తత అలుముకుని ఉంది. మొదటగా మణి అన్నాడు- ''ఏమైందిరా మీకు? వెధవల్లారా!'' ముగ్గురూ ఒక్కసారిగా మాట్లాడసాగారు. స్వామినాథన్ గొంతు అందరికంటే గట్టిగా వినిపిస్తోంది.

''వాడు, ఆ బఠాణీగాడు తోక, పెద్ద తోక, పెద్ద తోక అని బోర్డుమీద రాశాడు. బెక్కుతూ అన్నాడు స్వామి.

''లేదు , నేను రాయలేదు. నువ్వు...'' అరిచాడు బఠాణీ.

''వాళ్ళిద్దరూ రాశారు'' శంకర్‌ను చూస్తూ అరిచాడు స్వామినాథన్.

''రాస్కెల్, నేను రాయడం నువ్వు చూశావట్రా?'' శంకర్ కోపంతో ఊగిపోయాడు.

మణి అందరి నోళ్ళూ మూశాడు.

''అసలు ఇంతకీ తోక ఏమిటీ?'' అన్నాడు. ఇంతవరకు మణికి ఈ గొడవేమీ తెలియదు.

''వాళ్ళు నన్ను రాజంగాడి తోక అంటూ వెక్కిరిస్తున్నారు'' పెద్దగా ఏడుస్తూ చెప్పాడు స్వామినాథన్.

మణి ముఖం బిగిసిపోయింది కోపంతో.

''రాజం సంగతి ఇక్కడ ప్రస్తావించే ధైర్యం ఎవరికుందిరా?''

''ఓ! ధైర్యమా!'' సోము అరిచాడు.

శంకర్, బఠాణీ గజ గజ వణుకుతున్నారు.

''మీలో ఎవరైనా వాడి సంగతి ఎత్తారంటే...''

''ఆ, ఎత్తితే? ఎత్తితే ఏం చేస్తావేం?'' వెక్కిరింపుగా అన్నాడు సోము.

''ఏమంటున్నావురా? సోముగా మళ్ళీ అను.''

''ఇదుగో మణీ! విను! చాలా రోజుల్నుంచి చెప్పాలను కుంటున్నాను. నిన్ను నువ్వు చాలా గొప్పవాడి ననుకుంటున్నావు. నీ గురించీ, నీ శక్తి గురించీ చాలా ఎక్కువగా ఊహించుకుంటున్నావు'' అరిచాడు సోము.

మణి చెయ్యెత్తి సోము మెడమీద కొట్టాడు. సోము ఆ చేతిమీద పెడేలుమని కొట్టి తొలగించాడు. మణి సోముని లాగి తన్నబోయాడు. ఆ దెబ్బ

తగిలివుంటే సోము గింగిరాలు పడిపోయి వుండేవాడు. కాని సోము పక్కకు తప్పుకొని, మణికి దిమ్మ తిరిగిపోయేలా దెబ్బ కొట్టాడు.

చూస్తున్న ముగ్గురు కుర్రవాళ్ళూ వాళ్ళ కళ్ళను వాళ్ళే నమ్మలేక పోయారు. సోమూ, మణీ కొట్టుకోవడమా? వాళ్ళ బుర్రలు పనిచెయ్యడం మానేశాయి. వాళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చంపుకోక మానరు అనిపించింది. ఒకర్నొకరు కసిగా చూసుకొని స్కూలుకేసి పరుగు లంకించుకున్నారు. హెడ్‌మాస్టర్ దగ్గర గోల గోలగా చెప్పసాగారు. మొత్తంమీద ఆయన వాళ్ళనుంచి అసలు విషయం తెలుసుకోగలిగారు. ''స్కూలు పక్క స్థలంలో రెండు హత్యలు జరగబోతున్నాయి'' అని చెప్పారు. వాళ్ళ ఆతృత చూసి హెడ్‌మాస్టర్‌కు నవ్వు వచ్చింది. కానినవ్వలేదు. బంట్రోతును తీసుకొని ఆ స్థలానికి వెళ్ళాడు. ముగ్గురు కుర్రాళ్ళూ ఆయనను అనుసరించారు. అక్కడ సోమూ, మణీ మైదానంలో దొర్లుతున్నారు. పెనవేసుకొని తన్నుకుంటున్నారు. బంట్రోతు, హెడ్‌మాస్టరు వాళ్ళిద్దర్నీ చాలా తేలికగా విడదీశారు. స్వామినాథన్ ఆశ్చర్యానికి అంతులేదు. ఇంతవరకు వాళ్ళిద్దరికంటే బలవంతులు ప్రపంచంలో ఎవరూ ఉండరని భావిస్తూ వచ్చాడు.

## అధ్యాయం 6

# ఆదుకొనేవాడే స్నేహితుడు

### 1

మూడు వారాల తర్వాత ఒక రోజు మధ్యాహ్నం స్వామినాథన్ మణి ఇంటి ముందు నిల్చుని చిన్నగా ఈల వేశాడు. మణి బయటికి వచ్చాడు. ఇద్దరూ రాజం ఇంటికి బయలుదేరారు. తాము చూడబోయే అద్భుతం గురించి అనేక ఊహాగానాలు చేస్తూ నడుస్తున్నారు. (రాజం, వాళ్ళు కనుక ఆ మధ్యాహ్నం వస్తే ఏదో అద్భుతం చూపిస్తానన్నాడు.) దాన్ని గురించే కుతూహలంగా మాట్లాడుకుంటూనడుస్తున్నారు.

''రాజం తమాషాకు అన్నాడనుకుంటాను. మనల్ని ఇంటికి రప్పించడానికి అలా చెప్పి వుంటాడు'' అన్నాడు స్వామి. మణి వాణ్ని దాదాపు రోడ్డుపక్క మురుగు కాలవలోకి నెట్టినంత పని చేశాడు.

''బహుశా కోతిని తెచ్చాడేమో!'' మళ్ళీ అన్నాడు స్వామి. మణి ఈసారి స్వామి అభిప్రాయాన్ని అంగీకరించాడు. ఇంకా ఎన్నెన్నో ఊహించుకుంటూ, చర్చించుకుంటూ నడుస్తున్నారు.

ఉన్నట్టుండి వారి ఆలోచనలు శత్రువర్గం వైపుకు మళ్ళాయి. ''నేనేం చేస్తానో తెలుసా?'' అని ఒక క్షణం ఆగి మళ్ళీ అందుకున్నాడు మణి. ''సోముగాడి నడుం విరగ్గొట్టబోతున్నాను. వాడు ఎక్కడ వుంటున్నాడో నాకు తెలుసు. మార్కెట్ దగ్గర కబీర్ స్ట్రీట్‌లో ఉంటాడు. వాడు రాత్రిళ్ళు మార్కెట్‌లో వున్న ఒక షాపుకు తమలపాకులకోసం తరచు వస్తూంటాడు. మొట్టమొదట రాయి విసిరి వీధి దీపం పగలగొడ్తాను. ఆ వీధి ఎంత చీకటిగా వుంటుందో నీకు తెలియదు...నేను నా దుడ్డుకర్రతో పక్కగా నిల్చుంటాను. ఎముకలు విరిగి, మట్టిలో దొర్లుతూ విల విలలాడి పోతాడు.'' ఆ ఆలోచనకు స్వామినాథన్ వణికిపోయాడు. ''అంతటితో ఆగుతాననుకోకు. ఆ బఠాణీగాడ్ని కాలికింద వేసి తొక్కేస్తాను. నేలకు కరుచుకుపోవాలి. ఇక శంకర్‌గాడు, వాడు సరయు వడ్డున వున్న రావిచెట్టు కొమ్మకు వేలాడతాడు.'' అన్నాడు మణి.

వారి సంభాషణ ఆగిపోయింది. రాజం ఇంటి ముందుకొచ్చి నిల్చున్నారు. గేటుకు తాళం వేసివుంది. వాళ్ళు గోడ ఎక్కి లోపలకు దూకారు. అది చూసి ఒక నౌకరు పరిగెత్తుకొచ్చాడు. ''ఏయ్, ఎందుకు గోడ దూకారు?''

''ఏం? గోడ నీ అబ్బ సొత్తా?'' మణి పక్కున నవ్వాడు.

''మీ ఎముకలు విరుగుతాయని.''

''విరిగితే నీకేం? నీ ఎముకలైతే విరగవుగా?'' స్వామినాథన్ నౌకరును ఎగతాళి చేశాడు.

''ఒక మాట చెప్పు. కొంపదీసి నువ్వు సూపరింటెండెంటు కొడుకువుకాని కాదుకదా?''

''కాదు, కాదు'' నౌకరు గాభరా పడిపోయాడు.

''అయితే సరే! మేం వచ్చింది సూపరింటెండెంటుగారి అబ్బాయిని చూడడానికి.'' మణి మాట వింటూనే నౌకరు ఖంగు తిన్నాడు.

రాజం గది తలుపు కొట్టారు. గడి తీసిన శబ్దం అయింది. ఇద్దరూ స్తంభం చాటుకెళ్ళి నక్కారు. రాజం తలుపు తెరిచి తొంగి చూసి మళ్ళీ తలుపు వేసుకున్నాడు.

వాళ్ళు మళ్ళీ తలుపు దగ్గరకు వచ్చారు. ఈసారి ఏం చెయ్యాలో తోచలేదు. స్వామినాథన్ కీ హోల్ దగ్గర నోరుపెట్టి పిల్లిలా అరిచాడు. మణి వాడ్ని వెనక్కు లాగి, తన నోరు పెట్టి కుక్కలా మొరిగాడు. తలుపు తీస్తున్న చప్పుడు అయింది. మణి స్వామినాథన్‌తో ''నువ్వేమో గుడ్డి పిల్లి పిల్లవూ, నేనేమో గుడ్డి కుక్క పిల్లను'' అని గుసగుసగా చెప్పాడు.

మణి వెంటనే నేలమీద కాళ్ళూ చేతులూ ఆనించి కళ్ళు మూసుకొని కుక్కపిల్లా, తలుపు తలతో నెట్టి గదిలోకి ప్రవేశించాడు. స్వామి వాడి వెనకనే పిల్లిలా పాకుతూ, 'మ్యావ్' అంటూ, కళ్ళు మూసుకొనే గదిలోకి ప్రవేశించాడు. రాజం కూడా మధ్య మధ్య వాళ్ళకు బదులు ఇస్తున్నట్టు, కుక్కపిల్లలా మొరుగుతూ, పిల్లిలా 'మ్యావ్'మంటూ ఆటను రక్తి కట్టించాడు. మణి కుక్కపిల్లలా కళ్ళు మూసుకొని దొరికిన కాలు రాజంది అని భావించి కొరుకుతున్నట్టుగా నటించాడు. కళ్ళు తెరిచి చూశాడు. తను కొరుకుతున్న కాలు సోముదని గుర్తించాడు. స్వామినాథన్ పిల్లి తనకు అందిన కాలును పిల్లిలా రక్కాడు. కళ్ళు తెరిచాడు. అది శంకర్ కాలని గుర్తించాడు.

మణి కొయ్యబారిపోయాడు కొద్ది క్షణాలు. చివ్వున లేచి నిల్చున్నాడు. సిగ్గుతో కోపంతో అతడి ముఖం తమతమ లాడిపోయింది. మూలగా కూర్చుని వున్న బఠాణీగాడి మీద చూపులు నిలిచాయి. వాడి కళ్ళల్లో చిలిపితనం కనిపించింది. మణికి వాడి గొంతు పట్టుకొని పైకి లేపాలనిపించింది. తల తిప్పి రాజంకేసి చూశాడు. రాజం అతడ్నే పరిశీలనగా చూస్తున్నాడు. పెదవులమీద తెచ్చిపెట్టుకొన్న నవ్వు.

స్వామినాథన్‌కు చీకట్లోకి పారిపోవాలని వుంది. టేబుల్‌కింద ఎవరికీ కనిపించకుండా ఒదిగిపోవాలని వుంది.

''రాజం! ఏమిటిది? అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి?'' మణి దాదాపు అరిచినట్టేఅడిగాడు.

''ఎందుకంతగా రెచ్చిపోతావ్?''

''ఇదంతా నువ్వే చేశావు. ఎందుకిలా...?'' మణి నలువైపులా కలియజూశాడు.

''నేనేం చేసానూ? నేను మిమ్మల్ని పిల్లిలా, కుక్కలా పాకుతూ అరవమని చెప్పలేదే!''

సోము అతడి మిత్రులు నవ్వారు. మణి కసిగా చూశాడు. ''నేను వెళ్ళిపోతున్నాను. ఇంకొక్క క్షణం వుండను,'' అన్నాడు మణి.

''నీ ఇష్టం. ఇకపై నన్నెప్పుడూ చూడదల్చుకోకపోతే, నాతో మాట్లాడాలనుకోకపోతే వెళ్ళిపో,'' అన్నాడు రాజం.

మణి ఇబ్బందిగా చూశాడు. రాజం మణిని పక్కకు తీసుకెళ్ళి సముదాయించాడు. చేష్టలుడిగి నిలబడివున్న స్వామినాథన్ దగ్గరకు వచ్చాడు రాజం. ''పిల్లిలా బాగా నటించావు. మీలాగ అచ్చం పిల్లిలా, కుక్కలా అరిచేవాళ్ళను నేను నా జన్మలో ఇంతవరకు చూడలేదు. నిజం చెప్పాలంటే కొద్ది నిముషాలు మిమ్మల్ని చూస్తూ నిజమైన పిల్లి పిల్లనూ, కుక్క పిల్లనూ చూస్తున్నా ననుకొన్నాను తెలుసా? పోటీలలో మీ ప్రదర్శన పెడితే తప్పక బహుమతులు గెలుచుకుంటారు. మీకు అభ్యంతరం లేకపోతే మా నాన్నగారికి చూపించాలని వుంది. ఆయన చూస్తే చాలా సంతోషిస్తారు తెలుసా?'' రాజం వాళ్ళను ప్రశంసలతో ఉబ్బించాడు.

వాళ్ళు శాంతించారు. మణికైతే గర్వంగా కూడా ఉంది. తర్వాత అందరూ ఫలహారాలు తిన్నారు. సంతృప్తి చెందారు. కాని గదిలో వున్న ముగ్గురు శత్రువుల్ని చూస్తుంటే మాత్రం ఇబ్బందిగానే ఉంది.

రాజం వీళ్ళ ఆలోచనల్ని గుర్తించాడు. స్నేహం గొప్పతనాన్ని గురించి ఉపదేశించసాగాడు. స్నేహం గురించి ఎన్నో విషయాలు చెప్పాడు. ముసలివాడూ-ఏడుగురి కొడుకులూ-వాళ్ళకు కట్టెల మోపు ఇచ్చి విరవమనడం-పూర్తి కథ చెప్పాడు. ఐకమత్యంగా వుంటే ఎంత సుఖంగా బతకవచ్చో చెప్పాడు.

''అవసరానికి ఆదుకొనేవాడే అసలైన స్నేహితుడు'' అన్న సూక్తిని వివరించి చెప్పాడు. మనసులో కసి పెంచుకోవడం మంచిది కాదని పుస్తకాల్లో

ఉందని చెప్పాడు. ''కసి పెంచుకొనేవాడ్ని చచ్చిపోయాక చిన్న గదిలో, ఎర్రగా కాలిన ఇనుప దిమ్మమీద నిలబెడతారనీ, చిన్న కాయలంత పెద్ద పెద్ద తేనెటీగలు చుట్టూ ముసురి కుడతాయనీ, ఒకవేళ దిమ్మమీదనుంచి కిందకు దూకితే అక్కడ పెద్ద పెద్ద తేళ్ళూ కాళ్ళ జెర్రులూ పాకుతుంటాయనీ'' చెప్పాడు. అవన్నీ వేదాల్లో రాసిపెట్టి ఉన్నాయని చెప్పాడు.

అందరూ భయంతో బిగిసిపోయారు.

రాజం చెప్పడం ఆపలేదు. ''వాడు అలా ఒక నెల నిల్చోవాలి. నీళ్ళూ, అన్నం, నిద్ర లేకుండా వుండాలి. నెల తర్వాత వాణ్ణి మరో చోటుకు తరలిస్తారు. సన్నగా వున్న బ్రిడ్జిమీదకు చేరుస్తారు. అక్కడ ఒక్క కాలు మాత్రమే పెట్టే స్థలం వుంటుంది. కింద సల సల కాగే నూనె నది వుంటుంది. ఒక కాలు నెప్పిపుడితే అది తీసి రెండో కాలు పెట్టకోవాలి. అలా ఎన్నో ఏళ్ళు వంటికాలుమీద నిలబడాలి.''

అందరూ శ్రద్ధగా విన్నారు.

రాజం అందర్నీ చేతులు కలపమని కోరాడు. ఎవరికి ఎవరిమీదా కసి లేదని చెప్పమన్నాడు. అలా చేస్తే తలా ఒక బహుమతి ఇస్తానన్నాడు. చెయ్యి కలపడానికి శంకర్ ముందుకు వస్తే అతడికి బౌండు నోటుబుక్కు ఇస్తాననీ, స్వామినాథన్‌కు కీ ఇచ్చే మిషను ఇస్తానన్నాడు. సోముకు బెల్టు, మణికి చిన్న కత్తి, బఠాణీకి చక్కని చిన్న పెన్ను ఇస్తానన్నాడు. బీరువా తెరిచాడు. బహుమతులు తీసి వాళ్ళ ముందు పెట్టాడు. అందరూ మొహమాట పడ్తూ గోళ్ళు కొరుక్కుంటూ కూర్చున్నారు. సయోధ్య చేసే ప్రయత్నంలో రాజం అలసిపోయాడు.

బఠాణీ ముందు లేచాడు. ''ముందు నన్ను పెన్ను చూడనివ్వు'' అన్నాడు. రాజం పెన్ను తీసి ఇచ్చాడు. పెన్ను చేతిలోకి తీలుకొని తిప్పి తిప్పి చూసి, రాజంకు తిరిగి ఇచ్చేశాడు. ''నీకు నచ్చలేదా?'' అడిగాడు రాజం. ''నాకు ఆ పెట్టె కావాలి'' అన్నాడు. ఆ చిన్న పెట్టెమీద చిన్న చిన్న నగిషీలు రంగు రంగుల్లో చెక్కి వున్నాయి. అంతేకాదు దాని మూతమీద తాజ్‌మహల్ బొమ్మ చెక్కి వుంది. ''అదా? అది నేను ఇవ్వను. నాకు కావాలి'' అన్నాడు రాజం. అలాంటి పెట్టెలు మరో రెండు పెద్ద ట్రంకు పెట్టెలో వున్నాయి. అందువల్ల వెంటనే మనసు మార్చుకుని ''నాకు అక్కర్లేదులే. తీసుకో'' అన్నాడు.

కొద్ది నిముషాల తర్వాత మణి కత్తిని అరచేతిలో పదునుపెడ్తున్నాడు. సోము నడుంకు బెల్టు బిగించుకుంటున్నాడు. శంకర్ బైండు నోట్‌బుక్ పేజీలు తిరగేస్తున్నాడు. స్వామినాథన్ ఆశగా మిషన్ని గుండెలకు హత్తుకున్నాడు.

## అధ్యాయం 7

# నవాగమం

### 1

గత రెండు రోజులుగా స్వామినాథన్ తల్లి మంచం దిగలేదు. ఆమె వంటింట్లో లేకపోవడం, ఇంట్లో తిరగకపోవడం స్వామినాథన్‌కు బొత్తిగా బాగా లేదు. స్వామినాథన్‌ను ఆమె గదిలోకి తీసుకెళ్ళారు. తల్లి చాలా నీరసంగా మంచంమీద పడుకొని ఉంది. స్వామినాథన్‌ను దగ్గరకు పిలిచింది. ``ఏరా నాన్నా! చిక్కిపోయావు. సరిగా తినడం లేదా?`` అని అడిగింది. కాని స్వామినాథన్ మాటా పలుకూ లేకుండా కళ్ళు మిటకరించి చూశాడు. అమ్మ కొత్తగా కనిపించింది. ఆమె అడుగుతున్న దానికి సమాధానం ఇవ్వకుండా, ఆమె చేతినుంచి విడిపించుకొని బయటికి పరుగు తీశాడు.

``నీకు తమ్ముడు పుట్టబోతున్నాడురా!`` బామ్మ చెప్పింది. స్వామినాథన్ పెద్దగా ఉత్సాహం చూపించలేదు.

ఆ రాత్రి బామ్మ పక్కమీద పడుకోవడానికి అనుమతి లభించింది. ఇల్లంతా లైట్లు వెలుగుతున్నాయి. కళ్ళు తెరిచి చూసినప్పుడల్లా ఇంట్లో చాలామంది హడావిడిగా తిరగడం కనిపించింది. పొద్దుపోయాక ఉన్నట్టుండి స్వామినాథన్‌కు మెలుకువ వచ్చింది. హాల్లో లేడీ డాక్టర్ కనిపించింది. ఇల్లంతా తనదేనన్నట్టుగా ప్రవర్తిస్తోంది డాక్టరు, అని అనుకున్నాడు స్వామినాథన్. ఆమె, తల్లి ఉన్న గదిలోకి వెళ్ళింది. కొద్ది నిముషాల తర్వాత బయటికి వచ్చి తండ్రికి ఏదో పని పురమాయించింది. తండ్రి వెంటనే వెళ్ళి ఒక చిన్న సీసాతో తిరిగి వచ్చాడు. ఆ డాక్టర్ అందరికీ ఏవేవో పనులు చెప్తూనే వుంది. గదిలోనుంచి సన్నగా మూలుగు, కలగాపులగంగా కొన్ని గొంతులూ వినిపిస్తున్నాయి. వేడినీళ్ళూ, గుస గుసలూ, మందులూ, డాక్టరూ, కొత్తగా ప్రవేశించబోయే ప్రాణికోసం జరుగుతున్న హడావిడీ, స్వామినాథన్‌ను భయపెట్టాయి. అటూ ఇటూ తిరిగేవాళ్ళను బామ్మ ఏవేవో ప్రశ్నలు వేస్తున్నది. కాని ఒక్కరూ ఆగి ఆమెకు సమాధానం చెప్పడం లేదు.

ఐదు జంపఖానాలతో వేసిన బామ్మ పక్క మెత్తగా వుంది. దిండ్లు బాగున్నాయి. పక్కన బామ్మ ఉంది. ఇంకేం కావాలి? స్వామి గాఢ నిద్రలోకి జారిపోయాడు.

# 2

తమిళ పండితుడు గడ్డం చేసుకోలేదు. బంగారు ఫ్రేము కళ్ళజోడు ముక్కుమీద కిందకు జారి ఉంది. తమిళ వ్యాకరణ రహస్యాలు చెబుతున్నాడు. టీచర్ పాఠంలో మునిగిపోయి చెప్తున్నాడు. కాని వినేవాళ్ళు లేరు. క్లాసులో గోలగా వుంది. పిల్లలు గ్రూపులుగా ఏర్పడి కబుర్లు చెప్పుకుంటున్నారు. పండిట్ బల్లమీద చేత్తో కొడుతూ నిశ్శబ్దంగా వుండాలని ఆదేశిస్తున్నాడు. కాని ఎవరూ



వినిపించుకోవడం లేదు. టీచర్ క్రమశిక్షణలో పెట్టే ప్రయత్నం మానేసి పాఠం చెప్పుకుపోతున్నాడు. ఆయన కంఠం ఆ రణగొణ ధ్వనుల్లో సరిగా వినిపించడంలేదు.

శంకర్, మరికొందరు ముందు బెంచీమీద కూర్చుని శ్రద్ధగా పాఠం వింటున్నారు.

స్వామినాథన్, బఠాణీ వెనక బెంచీమీద కూర్చున్నారు.

''బఠాణీ! నాకు కొత్తగా తమ్ముడు పుట్టాడురా!'' అన్నాడు స్వామినాథన్.

''నీకెలా అనిపించాడు?''

''నాకు చాలా ఇష్టం వాడంటే! తమాషాగా ఉన్నాడులే. కళ్ళు మూసుకొనే వుంటాడు. గుప్పెళ్ళు మూసి వుంచుతాడు. నోట్లో గుప్పెళ్ళు పెట్టుకుంటాడు. సొంగ మోచేతివరకు కారుతుంది.''

బఠాణి బిగ్గరగా నవ్వాడు.

''వాడి చేతులు ముద్దుగా వుంటాయి తెలుసా! బుజ్జి బుజ్జి చేతులు, మెత్తగా ఉంటాయి. వాడి ముఖం ఎంత ఎర్రగా వుంటుందనుకున్నావ్? పండు మిరపకాయంత ఎరుపు.''

కొద్ది నిముషాలు ఇద్దరూ పాఠం విన్నారు.

''స్వామీ! ఈ పిల్లలు చాలా తొందరగా పెరిగిపోతార్రా! నేను ఒక బేబీని చూశాను. పుట్టినప్పుడు అచ్చం మీ తమ్ముడిలాగే వుంది. కాని కొన్ని నెలల తర్వాత చూస్తే ఎంత మారిపోయి కనిపించిందనుకున్నావ్?'' అన్నాడు బఠాణీ.

## అధ్యాయం 8

# పరీక్షలకు ముందు

### 1

ఏప్రిల్ నెల పరీక్షలకు రెండు వారాలు మాత్రమే ఉన్నాయి. స్వామినాథన్‌కు తండ్రి మారిపోయాడని అనిపించింది. తండ్రి వాలకం భరించలేకుండా ఉన్నాడు. అకస్మాత్తుగా తనను సతాయించాలనే బుద్ధి తండ్రికి పుట్టినట్టు తోచింది. బామ్మతో కబుర్లు చెప్పుకోనివ్వడు. ``ఒరే అబ్బాయ్! పరీక్షలు దగ్గర పడుతున్నాయని మరిచిపోకు. బామ్మ ఎక్కడికీ వెళ్ళదు. పరీక్షలు మళ్ళీ మళ్ళీ రావు. వెళ్ళి చదువుకో`` అంటాడు. తల్లి దగ్గర కూర్చుంటే ``ఇక్కడేం చేస్తున్నావ్? నీ గదిలోకి వెళ్ళి చదువుకో`` అంటాడు. తాలూకా ఆఫీసు గడియారం తొమ్మిది కొడ్తే చాలు తండ్రి కేకలు వేస్తాడు. ``స్వామీ! ఏం చేస్తున్నావ్ ఇంకా? ఇక పడుకో త్వరగా లేచి చదువుకో.`` స్వామినాథన్‌కు ఇదంతా భరించరానిదిగా ఉంది. ఒక రోజు తండ్రికి ఎదురు తిరిగాడు.

``నా పరీక్షల గురించి మీరెందుకంత కంగారు పడుతున్నారు?``

``ఒకవేళ నువ్వు తప్పితే?``

``నేను తప్పను.``

``బాగా చదివి, బాగా పరీక్షలు రాస్తే తప్పవు. నువ్వు ఫెయిల్ అయావనుకో నీ క్లాసువాళ్లంతా పై క్లాసుకు వెళ్ళిపోతారు. నువ్వు వెనకబడి పోతావు. పరీక్షలయ్యాక నీ ఇష్టం వచ్చినట్టు తిరుగు, ఆడుకో. నాకేం అభ్యంతరం లేదు.``

స్వామినాథన్‌కు తండ్రి మాటల్లో నిజం కనిపించింది. ఒకవేళ బఠాణీ, మణీ, రాజం, శంకర్ అందరూ తనను ఫస్ట్‌ఫారంలో వదిలేసి సెకండ్ ఫారానికి వెళ్ళిపోతే?

``నీ జూనియర్సంతా నీకు క్లాసుమేట్సు అవుతారు,`` తండ్రి మళ్ళీ అన్నాడు.

స్వామినాథన్ లెక్కలు చేసుకుంటూ అర్థగంట కూర్చున్నాడు.

### 2

స్కూల్లో అందరూ పరీక్షల ధ్యాసలో పడిపోయారు. చాలా వారాలుగా శంకర్ ముఖంమీద నవ్వు కనిపించలేదు. సోము ముభావంగా వుంటున్నాడు.

చాలా దీక్షగా చదువుతున్నాడు. బరాణీ మాత్రం జోక్స్ విసురుతూనే వున్నాడు కాని ఇంతకు ముందులా వుండడం లేదు. రాజం సరిగ్గా గంటకొట్టగానే క్లాసుకు వస్తాడు. పాఠాలు శ్రద్ధగా వింటాడు. స్కూలు అయిపోగానే అందరికంటే ముందు వెళ్ళిపోతాడు. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడడం లేదు. మణికి పరీక్షల చింత పట్టుకుంది. అనుమానం వచ్చినప్పుడల్లా శంకర్‌ను అడిగి తెలుసుకుంటున్నాడు. స్కూల్లో పనిచేసే గుమాస్తాకు అన్ని విషయాలూ తెలుసుననీ, పరీక్షలో రాబోయే ప్రశ్నలు కూడా తెలుసుననీ, సాధారణంగా అందరూ అనుకుంటారు.

ఒక రోజు మణి గుమస్తా ఇంటికి వెళ్ళాడు. చక్కగా కట్టిన వంకాయల మూట తీసుకెళ్ళి గుమస్తా కాళ్ళదగ్గర పెట్టాడు. గుమస్తా తాజా వంకాయలు చూసి సంతోషించాడు. మణిని లోపలకు తీసుకెళ్ళి స్టూలుమీద కూర్చోబెట్టాడు.

గుమస్తా చాలా ఆప్యాయత చూపించాడు. ఇప్పుడు ఏమడిగినా కాదనడనే నమ్మకం కలిగింది మణికి. గుమస్తా బక్కచిక్కిన పెంపుడు పిల్లిని నిమురుతూ ఏదో గొణుగుతున్నాడు. అతను ఏమంటున్నాడో మణి బుర్రకు ఎక్కడం లేదు. పరీక్షా ప్రశ్న పత్రాల గురించి అడగడానికి అవకాశం దొరకడం లేదు. గుమస్తా పిల్లి కళ్ళమీద వాలిన ఈగల్ని తోలాడు. ``నువ్వు ఇలాంటి ఈగల్ని కళ్ళదగ్గరకు రానివ్వకు. కళ్ళ జబ్బులన్నీ వీటివల్లే వస్తుంటాయి. ఒకవేళ నీకు కళ్ళ కలక వస్తే, ఏం చేస్తావంటే ఒక ఉల్లిపాయ తీసుకో...``

``సర్! పరీక్షలింకా ఒక వారం రోజులే ఉన్నాయి.``

``అవునవును! ఉల్లిపాయ, బాగా నీరున్న ఉల్లిపాయ చిన్నది కాదు, పెద్ద సైజు ఉల్లిపాయ...``

మణి ముఖం విచారంగా పెట్టి ``సర్! పరీక్షలు గురించి నాకు చాలా దిగులుగా వుంది సార్!``

``మంచిదే. బాగా చదువు, తప్పక పాసవుతావు.``

``చూడండి సార్! నాకు చాలా దిగులుగా వుంది. రాత్రిళ్ళు నిద్రపట్టడం లేదు...మీరు పరీక్షలకు సంబంధించిన ముఖ్య విషయాలు ఏమైనా చెబితే...చదవాల్సింది బోలెడంత వుంది. అనవసరమైనవన్నీ నాకు చదవాలని లేదు.`` మణి ఏం చెప్పాలనుకుంటున్నాడో గుమస్తా గ్రహించాడు. కాని ఏమీ తెలియనట్టే ``పోర్షన్స్ పూర్తిగా చదువు.`` అన్నాడు. ముసుగులో గుద్దులాట ఇక లాభం లేదనుకున్నాడు మణి. ``సార్! పరీక్షలో ఏ ఏ ప్రశ్నలు వస్తాయో చెప్పండి?``

గుమస్తా ప్రశ్న పత్రాల గురించి తనకేమీ తెలియదనేశాడు. ``మీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తాయి సార్!`` మణి అతడ్ని ఉబ్బించాడు. గుమస్తా ముఖ్యమైన అంశాలు చెప్పాడు. కాని న్యాయానికి అతనికి ఫస్ట్‌ఫారంలో ఏ ఏ పుస్తకాలు ఉన్నాయో కూడా తెలియదు. నువ్వు జాగ్రఫీ జాగ్రత్తగా చదువు. మ్యాప్ డ్రాయింగ్ ప్రాక్టీసు చెయ్యి. కనీసం ఐదు లెక్కలైనా చెయ్యి రోజూ. అలా చేస్తే అరటిపండు తిన్నంత తేలిగ్గా లెక్కలు చెయ్యగలవు పరీక్షలో.

``మరి ఇంగ్లీషు?``

``దాన్ని గురించి దిగులు పడకు. పాఠాలన్నీ చదివే వుంటావుగా?``

``అవును చదివాను సార్!``

``అది చాలు. అయినా ముఖ్యమైన పాఠాలు మరోసారి చూసుకో.``

గుమస్తా సమాధానాలు మణికి సంతృప్తిని కలిగించాయి. వంకాయలకు ఖర్చుపెట్టిన నాలుగణాలు వ్యర్థం కాలేదనుకున్నాడు. మణి పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది.

## 3

మణికి తను పెద్ద ఘనకార్యం ఏదో సాధించినట్టుగా ఉంది. గర్వంగా ఉంది. తోటి విద్యార్థులను చూస్తుంటే జాలిగా ఉంది. స్వామికి మాత్రం తనకు తెలిసిన విషయాలు చెప్పాలనుకున్నాడు. అయితే అసలు రహస్యం-అంటే తను ఎలా ఈ సమాచారం సేకరించిందీ చెప్పకూడదనుకొన్నాడు.

స్వామి, మణి, స్కూలునుంచి బయటికి వచ్చారు. వినాయక మొదలి వీధి మలుపులో ఆగారు. అక్కడ్నుంచి వారి దారులు వేరు. ``ఏం గురూ? పరీక్షలో ఏ ఏ ప్రశ్నలు వస్తాయంటావ్?`` మణి గంభీరంగా ప్రశ్నించాడు.

``క్లాసు పుస్తకాల్లోవే వస్తాయి,`` వ్యంగ్యంగా అన్నాడు స్వామి.

మణి స్వామినాథన్ మాటల్లోని ఎగతాళిని పట్టించుకోలేదు. ``రాత్రి ఏడు గంటలనుంచి పది గంటలదాకా ఏం చేశాననుకున్నావ్?``

``ఏం చేసివుంటావు? వేరుశనగ పప్పులు నమిలి ఉంటావు.``

``ఇడియట్. ఇండియా మ్యాపులు రెండు, ఆఫ్రికా మ్యాపు ఒకటి, యూరోప్ మ్యాపు ఒకటి గీచాను.``

``అంటే అట్లాసులో వున్న మ్యాపులన్నీ గీసావన్న మాట.``

``కావచ్చు.`` స్వామి ధోరణి, మణికి నచ్చలేదు.

``చాలా అవసరం అని తెలిసే చేసాను. రెండు మూడు ప్రశ్నలు వాటిగురించే వస్తాయి. ఇంకెవరికీ చెప్పకు. నేను ఇబ్బందిలో పడిపోతాను.`` స్వామినాథన్ మణి చెప్పిన విషయాన్ని తేలిగ్గా కొట్టెయ్యలేకపోయాడు.

4

ఇంటికి వచ్చిన స్వామినాథన్‌కు తల్లి కనిపించక పోవడంతో నీరు కారిపోయాడు. ఎన్నో విషయాలు, ఆ రోజు స్కూల్లో జరిగినవి చెప్పాలనే ఉత్సాహంతో ఇంటికి వచ్చాడు. బామ్మకూడ తన మాటలు వినే మూడ్‌లో కనిపించలేదు. అయినా చెప్పసాగాడు. ``బామ్మా!ఇవ్వాళ ఏం జరిగిందో తెలుసా? ఫస్టు క్లాసు కుర్రాడు చిన్న చాకుతో పక్కవాడ్ని పొడిచాడు చేతిమీద.``

``ఏం? ఎందుకు?`` బామ్మ పెద్దగా కుతూహలం చూపలేదు.

``వాళ్ళిద్దరూ శత్రువులు.`` ఎంతో పెద్ద విషయంగా భావించి చెబితే బామ్మ పట్టించుకోక పోవడం, స్వామికి నిరాశ కలిగించింది.

``బామ్మా! బామ్మా! ఇంకా ఏం జరిగిందంటే? మా హెడ్‌మాస్టరు కాలి బొటనవేలుకు గడప కొట్టుకుంది. బోలెడంత రక్తం కారింది. ఈ రోజంతా కుంటుకుంటూనే నడిచాడు. థర్డ్‌ఫారం క్లాసు తీసుకోలేక శెలవు ఇచ్చేశాడు. వాళ్ళకు బలే చాన్సు దొరికిందిలే.``

``అలాగా?`` బద్ధకంగా అన్నది బామ్మ.

బామ్మ నిద్రమత్తుగా వుడడం చూస్తుంటే స్వామినాథన్‌కు చిర్రెత్తుకొచ్చింది. అక్కడ్నుంచి కదిలి తమ్ముడి ఉయ్యాల దగ్గరకెళ్ళాడు. మొదట తమ్ముడంటే ఆసక్తి వుండేదికాదు. కాని రాను రాను చాలా ఇష్టంగా ఉంటున్నాడు. ఇప్పుడు వాడికి ఆరు నెలలు. అందంగా తయారయ్యాడు. ఎవరైనా కనిపిస్తే కేరింతలు కొడ్తాడు. గుప్పెళ్ళు నోట్లో పెట్టుకుంటాడు. సొంగ మోచేతివరకు కారుతుంది. గాలిలోకి కాళ్ళూ చేతులూ విసురుతాడు. బోసి నవ్వులు నవ్వుతూ ఎర్రటి చిగుళ్ళను బయటపెడ్తాడు. స్వామినాథన్‌కు వాడు చేసే ప్రతి పనీ ఎంతో ఇష్టం. వాడిచేత చేతులు పట్టుకొని నడక నేర్పిస్తాడు. ``స్వామినాథన్`` అని పలికించడానికి ప్రయత్నిస్తాడు. వాడు బోసి నవ్వులు విసురుతాడు.

స్వామినాథన్ ఉయ్యాలలోకి వంగి చూశాడు. బాబు నిద్రపోతున్నాడు. స్వామినాథన్ నీరు కారిపోయాడు. స్వామినాథన్ గట్టిగా దగ్గాడు. కాని బాబు లేవలేదు. స్వామినాథన్ చిన్నగా అక్కడ్నుంచి కదిలాడు. ఆ సమయంలో వాడు నిద్ర లేవక పోవడమే మంచిదనిపించింది. లేస్తే వాడు చేసే అల్లరి భరించడం

కష్టం అనిపించింది. సాయంకాలంపూట ఇంట్లో కూర్చోవడమంత చిరాకు మరొకటి వుండదు. సరయు నది ఒడ్డున, మణితో ఆడే ఆటలు గుర్తుకొచ్చాయి. పరీక్షలు అయ్యేంతవరకు బయటకు వెళ్ళకూడదని తండ్రి శాసించాడు. తండ్రికి తన మనసులో మాట చెప్పాలని వుంది. తీరా సమయం వచ్చేసరికి చెప్పలేక పోతున్నాడు. ఒక్క వారమేగా! ఈ వారం ఎలాగో గడిపేస్తే , ఆ తర్వాత ఇష్టంవచ్చినట్టు తిరగొచ్చు. ఒక్క వారం అనే భావం స్వామినాథన్‌కు కొత్త ఉత్సాహాన్ని ఇచ్చింది.

టేబుల్ ముందు కూర్చున్నాడు. అట్లాసు తీశాడు. యూరప్ మ్యాప్ తెరిచాడు. అది చూస్తుంటే స్వామినాథన్‌కు చాలా ఆశ్చర్యం కలిగింది.

ఆ దేశ పటంలో వున్న వంకరటింకర గీతల్ని, ఆ గీతల మధ్య వున్న ప్రదేశాలనూ చూస్తూ స్వామినాథన్ బోలెడంత ఆశ్చర్యంలో పడిపోయాడు. ఇంత వంకరటింకరగా, ఇరుకిరుగ్గా వున్న దేశంలో మనుషులు ఎలా వుంటున్నారో? వాళ్ళు ఎంత సైజులో వుంటారో? మరో అనుమానం వచ్చింది. అసలు ఈ మ్యాపులు గీచినవాళ్ళు ఆ దేశాల ఆకారాలను ఎట్లా చూడగలిగారో?యూరప్ ఒంటె తలలా వుంటుందని ఎలా కనిపెట్టారో? బహుశా ఎత్తైన ప్రదేశాలలో నిల్చుని కిందకు చూస్తూ, కింద కనిపించినదాన్ని కాపీ చేసి వుంటారు. తను కూడా ఇండియాను మ్యాపులో కనిపిస్తున్నట్టు చూడగలిగితేఎంతబాగుంటుంది? టౌను హాలు పైనుంచి చూస్తే? కానిఅతడు ఆ భవనం దగ్గరకు ఎప్పుడూ వెళ్ళలేదు. అక్కడకు వెళ్ళడం ఇష్టం వుండదు. అక్కడొక హింసించే గది వుందనీ, పఠానులు పిల్లల్ని మాయమాటల్తో ఆ గదిలోకి తీసుకెళ్ళి హింసిస్తారనీ శైలర్ చెప్పాడు.

ఆ ఆలోచనలనుంచి బయటపడి యూరోప్ పటాన్ని కాపీ చేశాడు. రెండింటినీ పక్క పక్కగా పెట్టి తన తెలివికి మురిసిపోయాడు. ఆ గీతలో ఏదో జంతువు ఆకారం అస్పష్టంగా కనిపిస్తోంది. కొంత భాగం ఎద్దు తలలా వుంటే, కొంత భాగం ఒంటె తలలా వుంది.

ఏడు దాటింది. తండ్రి ఇంటికి వచ్చాడు. కొడుకు శ్రద్ధగా పుస్తకాల ముందు కూర్చుని వుండడాన్ని చూసి ఆనందించాడు. ``బాగుందిరా అబ్బాయ్!`` కొడుకు గీసిన మ్యాపు చూస్తూ అన్నాడు తండ్రి. స్వామినాథన్‌కు తండ్రి ప్రశంసలో, తను పడిన కష్టానికి ఫలితం దొరికినట్టు అనిపించింది. పేజీలు తిప్పాడు. ఆఫ్రికా పటం తెరిచాడు.



## 5

ఇంకా పరీక్షలు రెండు రోజులున్నాయి. స్వామినాథన్ తనకు కావాల్సిన వస్తువుల లిస్టు తయారు చేశాడు.

| | |
|---|---|
| గీతలు లేని తెల్ల కాగితాలు | 20 షీట్లు |
| పాళీలు | 6 |
| సిరా | 2 బుడ్లు |
| క్లిప్పు | – |
| పిన్నులు | – |

మరోసారి లిస్టు చదువుకున్నాడు. సంతృప్తి కలగలేదు.

తన అవసరాలు ఇంత తక్కువే అనిపించింది. కనీసం రెండు మూడు పేజీల లిస్టు వుంటుందనుకున్నాడు. తనకు అవసరమయిన వస్తువులు కేవలం ఇవేనా? తనకు గీతల్లేని పేపర్లే ఎందుకు కావాలి? తను రాసే లైనులు తిన్నగా వుండవు. కుడిచేతి వైపుకు వంగిపోయి వుంటాయి. పరీక్షలో గీతలు దాటి వంకరగా లైన్లు వస్తే బాగుండదు. ఎందుకైనా మంచిది గీతలున్న పేపర్లు కూడా దగ్గర వుంచుకొనడం. పాళీలు ఎన్ని కావాలి? పరీక్ష రాయడానికి ఒకటి చాలదా? మరి ఎన్ని? రెండు? ఐదు? మరి సిరా బుడ్లు? ఒకటి చాలు. పిన్నులు, క్లిప్పులు ఎన్నెన్ని రాయాలి? అసలు ఏ లెక్కన అమ్ముతారో? పది పిన్నులు, ఐదు క్లిప్పులు ఇవ్వమంటే అమ్మేవాడు ఏమంటాడో? అందుకే వాటి సంఖ్య రాయకూడదు. కొత్తగా లిస్టు రాశాడు మళ్ళీ.

| | |
|---|---|
| గీతలు లేని తెల్ల కాగితాలు | 20 షీట్లు |
| గీతలున్న తెల్ల కాగితాలు | 10 షీట్లు |
| నల్ల సిరా | 1 బుడ్డి |
| క్లిప్స్ | ~~3~~-~~6~~-12 |
| పిన్స్ | ~~6~~-12 |

ఈ లిస్టు కూడా స్వామికి సంతృప్తి కలిగించలేదు. చివరకు ఒక కార్డుబోర్డు ప్యాడ్‌ను జోడించాడు. జేబు ఖర్చుకు ఒక రూపాయి వేశాడు. తండ్రి తన పనిలో మునిగిపోయి వున్నాడు. కొడుకు గదిలోకి రావడం, ఎదురుగా నిలబడడం గమనించలేదు. ఆ సమయంలో తండ్రిని మాట్లాడించడం మంచిది కాదనుకొన్నాడు. భోజనం తర్వాత కలిస్తే ఫలితం బాగుంటుంది అనుకున్నాడు. గిర్రున వెనక్కు తిరిగి బయటికి వచ్చాడు. తండ్రికి ఎవరో గదిలోకి వచ్చి వెళ్ళినట్టు తోచి తల పైకెత్తి ''ఎవరు?'' అని గట్టిగా అరిచాడు. తండ్రి కంఠం కర్కశంగా వుంది. ''ఎవరంటే పలకరేం?'' స్వామినాథన్‌కు సమాధానం ఇవ్వాలో అక్కడినుంచి చిన్నగా జారుకోవాలో తెలియలేదు. తండ్రి లేచి బయటికి వచ్చాడు.

''నువ్వా?''

''అవును.''

''ఇడియట్! ఎవరు? ఎవరు? అంటూ అరిచినా జవాబు ఇవ్వవేం? ఈ కొంపలో క్షణం ప్రశాంతంగా ఉండడానికి వీల్లేదు. పని చేసుకుంటూంటే ప్రతి ఐదు నిముషాలకు ఎవరో ఒకరు తొంగిచూడడం, పిచ్చి ప్రశ్నలు వెయ్యడం! ఛా! ఛా! ఛీ! వెళ్ళి అమ్మకు చెప్పు! ఇవ్వాళంతా నాగదిలోకి రావద్దని. పాలవాళ్ళు వచ్చారనీ, కూరగాయలవాళ్ళు వచ్చారనీ, వార్తలు మోసుకు

రావద్దని చెప్పు. తనే ఏం చెప్పుకుంటుందో చెప్పుకోమను. మీ అమ్మ అనుకుంటుందీ... ఏమిటా పేపరు నీ చేతిలో?''

''ఏంలేదు నాన్నా!'' స్వామినాథన్ గబుక్కున కాగితం జేబులో కుక్కుకున్నాడు.''ఏమిటది?'' జేబులోనుంచి కాగితం లాక్కుంటూ అడిగాడు తండ్రి. ఒక క్షణంలో చదివి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ''ఏమిటిది?'' అడిగాడు.

స్వామినాథన్ గొంతు సవరించుకోవడానికి రెండుసార్లు దగ్గాల్సి వచ్చింది.''పరీక్ష లిస్టు!'' ఎలాగో అనేశాడు.

''పరీక్ష లిస్టేమిటి?''

''ఎల్లుండి పరీక్షలు మొదలు అవుతాయని నీకు తెలుసుగా?''

''అయినా గాడిదలా ఇల్లంతా తిరుగుతున్నావా? అందుకా ఈ లిస్టు? రూపాయలూ, అణాలూ, కాసులు ఆకాశంనుంచి కురుస్తాయను కుంటున్నావా?'' స్వామినాథన్ అలా అనుకోలేదు కాని అలాంటిదే ఏదో అనుకున్నాడు. డ్రాయర్ లాగి ''నీకు కావాల్సినవి నా దగ్గరనుంచి తీసుకో. క్లిప్స్ నీకు అక్కర్లేదు. ప్యాడ్, ప్యాడెందుకు? మీ పరీక్ష గదుల్లో డెస్కులు లేవా? మా రోజుల్లో పలకలుంటే సరిపోయేది. కాని నీకు ఇంకు కావాలి, పెన్ కావాలి. పేపరు పెట్టుకోవడానికి ప్యాడ్ కావాలి...'' డ్రాయర్‌లో నుంచి ఎర్ర పెన్సిల్ తీసి 'ప్యాడ్' అన్న చోట అడ్డంగా గీచాడు. దాదాపు లిస్టు అంతా కొట్టేసి కాగితం స్వామినాథన్‌కు అందించాడు. స్వామినాథన్ ముఖం చిన్నపోయింది. జేబులో డబ్బులు వేసుకొని ఎగురుకుంటూ మార్కెట్‌కు వెళ్ళాలనుకున్నాడు.

బయటికి వెళ్తున్న స్వామినాథన్‌ను తండ్రి వెనక్కు పిల్చాడు. ''వెధవ ఏడుపూ వాడూను! ఆ చిన్నాణ్ణి ఆ హాల్లోనుంచి తీసుకెళ్ళు. భరించలేకుండా వున్నాను. మీ అమ్మ ఏం చేస్తోంది? చెముడొచ్చిందా? పిల్లవాడు అలా గుక్కపట్టి ఏడుస్తుంటే తీసుకోదేం?''

## అధ్యాయం 9

# స్కూలుకు శెలవులిచ్చిన రోజు

### 1

ఆరిపోయిన పెదవులతో, ఎండిపోయిన గొంతుతో వేళ్ళమీద సిరా మరకలతో, వాడిపోయిన ముఖంతో, పై క్లాసుకు వెళ్ళబోతున్నాననే ఆనందంతో, స్వామినాథన్ పరీక్ష హాలునుండి బయటికి వచ్చాడు. అది పరీక్షల చివరి రోజు.

వరండాలో నిల్చున్నాడు. వెనక్కు తిరిగి పరీక్ష జరుగుతున్న హాలుకేసి చూశాడు. కొంచెం కలవరపడ్డాడు. తనలాగే అందరూ ఇరవై నిముషాల ముందే పేపర్లు ఇచ్చేసి బయటికి వస్తే ఆ కలవరపాటు వుండేది కాదు. ఎడం భుజం గోడకు ఆనించి శంకర్ దీర్ఘాలోచనలో వున్నాడు. థర్డ్‌ఫారం పిల్లల మధ్య కూర్చునివున్న రాజం తలెత్తకుండా యంత్రంలా రాసుకుంటూ పోతున్నాడు. బఠాణి బెంచీలో వెనక్కు వాలి రాసిన సమాధానాలను మరోసారి చూసుకుంటున్నాడు. సూపర్‌వైజరొకడు కుర్చీలో కునికిపాట్లు పడుతున్నాడు. మరొకడు ఆ హాల్లో అటూ ఇటూ తిరుగుతున్నాడు. కలాల గరగరలూ, కాగితాల గలగలలూ, గొంతు సకిలింపులూ నిశ్శబ్దాన్ని చీలుస్తూ వినిపిస్తున్నాయి.

తను అంత త్వరగా బయటికి వచ్చేసి ఉండకూడదనుకున్నాడు స్వామినాథన్. కాని అక్కడే కూర్చుని చేసేది మాత్రం ఏముంది? అది తమిళం పేపరు. ఐదు గంటల వరకు టైం వుంది. కాని చివరి ప్రశ్న సమాధానంలోని చివరి వాక్యం రాసేసరికి, సరిగ్గా నాలుగన్నర అయింది. ఇచ్చిన ఆరు ప్రశ్నల్లో మొదటి ప్రశ్నకు రాసిన సమాధానం అతనికి పూర్తి సంతృప్తిని ఇచ్చింది. రెండో జవాబు సరైందో కాదో తెలియలేదు. మూడో జవాబు సంతృప్తికరంగానే ఉంది. నాలుగో జవాబు పూర్తిగా తప్పు అని అతడికే తెలుసు. ఆరవ జవాబు అన్నింటికంటే చాలా బాగా వుంది అనుకున్నాడు. అది రాయడానికి ఒక నిముషం మాత్రమే పట్టింది. నాలుగున్నరకు ఇంకా రెండు నిముషాలుంటుందనగా, ఒక నిముషం సమాధానం ఆలోచించడానికి, ఒక నిముషం రాయడానికి సరిపోయింది. నాలుగున్నరకల్లా పేపరు పూర్తి చేశాడు. ఆరో ప్రశ్న 'పులి-బ్రాహ్మణుడు' అన్న కథలోని 'నీతి' ఏమిటి అనేది. (ఒక

బ్రాహ్మణుడు ఒక చెరువు ఒడ్డున నడుస్తున్నాడు. అవతలి ఒడ్డున వున్న ఒక ముసలి పులి బ్రాహ్మణుడికి బంగారు కంకణం ఇస్తానని ఆశ చూపింది. మొదట అతడు నమ్మలేదు. కాని తర్వాత దాని మాయ మాటలు నమ్మి అతడు చెరువు దాటి అవతలి ఒడ్డుకు వెళ్ళాడు. కడియంకోసం చెయ్యి చాపాడో లేదో పులి నోట్లో వున్నాడు.) స్వామినాథన్‌కు ఈ కథలో ఒక నీతి వుందని ఎప్పుడూ అనిపించలేదు. పరీక్ష పేపర్లో ప్రశ్న ఇచ్చారు కనక ఏదో నీతి వుండే వుంటుంది అనుకున్నాడు. అతనికి రెండు ఆలోచనలు తట్టాయి. ఒకటి-పులిదగ్గర బంగారు కడియం తీసుకోకూడదు. రెండు, బంగారంకోసం ఆశపడితే ప్రాణం పోతుంది. ఆలోచిస్తే రెండో ఆలోచనే సరి అయిందిగా అనిపించింది. అదే రాసేశాడు. తలెత్తి గోడ గడియారంకేసి చూశాడు. నాలుగున్నర అయింది. ఇంకా అర్ధ గంట వుంది. అక్కడ కూర్చుని ఏం చెయ్యాలి? అందరికంటే ముందుగా లేచి రావాలంటే జంకుగా వుంది. మిగతావాళ్ళు కూడా తనలాగ త్వరగా రాస్తే ఎంత బాగుంటుంది? అనుకున్నాడు.

ఇంకా అర్ధగంట సమయం గడపడం ఎలా? పేపరు టైం మూడు కాకుండా రెండున్నర గంటలే వుంటే బాగుండేది. వరండాలోకి చూశాడు. వెళ్ళిపోతే ఎంత బాగుంటుంది. ఇదే చివరి పరీక్ష ఇంక అంతా స్వేచ్ఛే. అడిగేవాళ్ళుండరు. పుస్తకాలు అవతల పారేసి ఊరంతా తిరగొచ్చు. బామ్మ చెప్పే కథలు వినొచ్చు.

సూపర్‌వైజర్ తననే గమనించడం చూశాడు. రాసిన సమాధానాలను మళ్ళీ చూసుకుంటున్నట్టు నటించాడు. మొదటి సమాధానంలో నాలుగు లైన్లు చదివేసరికి విసుగు పుట్టింది. కాగితాలు తిప్పాడు. చివరి జవాబు మీద కళ్ళు నిల్చాయి. పులి-బ్రాహ్మణుడి కథలోని నీతి అర్థం లేనిదిగా అనిపించింది. పూర్తిచేసి చివరలో పెట్టినా చిన్న గీతను దిద్దసాగాడు. అది వెడల్పుగా అసహ్యంగా తయారైంది.

మళ్ళీ గడియారంకేసి చూశాడు. అయిదు అయివుంటుందని ఆశించాడు. కాని నాలుగు నలభై అయింది. ఇంకా ఇరవై నిముషాలు! అదే సమయంలో ఇద్దరు ముగ్గురు కుర్రాళ్ళు పేపర్లు ఇచ్చేసి బయటికి వెళ్ళడం కనిపించింది. స్వామికి సంతోషం కలిగింది. వెంటనే పేపర్లు మడిచాడు. పెద్ద పెద్ద అక్షరాల్లో ఈ కింది విధంగా రాశాడు:

'తమిదు...తమిళం

డబ్ల్యు.ఎస్.స్వామినాథన్

ఫస్ట్ ఫారం-'ఎ' సెక్షన్

అల్బర్ట్ మిషన్ స్కూల్, మాల్గుడి

సౌత్ ఇండియా, ఏషియా.

## 2

గంట మోగింది. ఇద్దరిద్దరూ, ముగ్గురు ముగ్గురుగా, కుర్రాళ్ళు బయటికి వచ్చారు. మూడు గంటలు వాళ్ళ స్వభావాలకు విరుద్ధంగా గడిచాయి. గోల గోలగా అరుస్తూ బయటికి వచ్చారు.

''చివరి ప్రశ్నకు ఏం సమాధానం రాశావు?'' ఒక కుర్రాణ్ణి స్వామినాథన్ అడిగాడు.

''ఏదీ? ఆ నీతికి సంబంధించిన ప్రశ్నేనా?... టీచరు చెప్పింది నీకు గుర్తులేదా? బంగారం మీది ఆశ బ్రాహ్మణుడి ప్రాణం తీసింది.''

''బంగారం ఎక్కడుంది? బంగారు కడియం వుంది. ఎన్ని వాక్యాలు రాశావు?'' అడిగాడు స్వామినాథన్.

''ఒక పేజీ,'' అన్నాడు ఆ కుర్రాడు.

ఆ సమాధానం స్వామినాథన్‌కు నచ్చలేదు. తను ఒకే వాక్యం రాశాడు. ''ఏమిటీ? అంతరాసి వుండకూడదు'' అన్నాడు.

. రాజం, శంకర్ వచ్చారు.

''ఏరా! పేపర్ ఎలా ఉంది?'' అడిగాడు స్వామి.

''నువ్వు చెప్పు. నీకెలా అనిపించింది?'' శంకర్ అడిగాడు.

''పర్వాలేదు,'' స్వామినాథన్ అన్నాడు.

''తమిళ పేపరుకు భయపడ్డాను. పర్వాలేదు పాసు మార్కులు రావచ్చు,'' అన్నాడు రాజం.

''ఏం కాదు. ఎక్కువే వస్తాయి. నీకు క్లాసు వస్తుంది,'' అన్నాడు శంకర్.

''నీతి కథ గురించిన ప్రశ్నకు కొందరు పిచ్చాళ్ళు పేజీలకొద్దీ సమాధానాలు రాశారట'' అన్నాడు స్వామినాథన్.

''ముప్పావు పేజీ రాశాను నేను,'' అన్నాడు రాజం.

''అర పేజీకి కొంచెం ఎక్కువ రాశాను,'' అన్నాడు శంకర్.

''నేనూ అర పేజీ రాశాననుకో,'' అబద్ధం చెప్పాడు స్వామినాథన్. ఆ పరిస్థితిలో అలా చెప్పకుండా వుండలేకపోయాడు.

''రేపటినుంచి మనకు స్కూలు వుండదు.''

''అవును! నాకు గుర్తేలేదు సుమా!'' అన్నాడు రాజం.

''శెలవుల్లో ఏం చెయ్యాలనుకుంటున్నారు?'' ఒకడి ప్రశ్న.

''నా పుస్తకాలను వంటింటి పొయ్యిలో పడేస్తాను,'' అన్నాడు స్వామినాథన్.

''మా నాన్న నాకోసం, శెలవుల్లో చదువుకోవడానికి చాలా పుస్తకాలు తెచ్చాడు. సింద్‌బాద్ ద సైలర్, అలీబాబా ఇంకా ఎన్నో...'' అన్నాడు శంకర్.

''నాకు టైం చాలలేదు చివరి ప్రశ్న రాయడానికి,'' గాలిలో చేతులు ఊపుతూ అరుస్తూ వచ్చాడు మణి.

బుగ్గమీద సిరా మరకతో బతాణీ రంగంలో ప్రవేశం చేశాడు. ''హల్లో! శంకర్! ఫస్ట్ క్లాసా?''

''అబ్బే లేదు. ముప్పయ్ ఐదు మార్కులు వస్తే చాలు.''

''యూ రాస్కెల్! అన్నీ అబద్ధాలే. పాసయితే నీ తలమీద పిలక జుట్టు కత్తిరించమంటావా?'' అన్నాడు మణి.



పదిహేను నిముషాల తర్వాత మళ్ళీ గంట మోగింది. స్కూలు పిల్లలందరూ హాల్లో గుమికూడారు. అందరి ముఖాల్లో సంతోషం తొణికిసలాడుతోంది. టీచర్లు కూడా పిల్లలతో చనువుగా, ఆప్యాయంగా ప్రవర్తిస్తున్నారు. ఎబెనెజార్ మణిని చూసి ''హలో! బ్లాక్ హెడ్! ఈ శెలవుల్లో ఏం చెయ్యబోతున్నావ్?'' అనిఅడిగాడు.

''హాయిగా నిద్రపోతాను సార్.'' అని స్నేహితులకేసి తిరిగి కన్నుగీటాడు.

''మళ్ళీ స్కూలుకు వచ్చేలోగా నీ తలకాయను కాస్త పదును పెట్టుకొస్తావా లేదా?''

''మీరు శంకర్ తలకాయ నరికి నాకు బహుమానంగా ఇస్తే తప్ప అదెలా సాధ్యం అవుతుంది సార్?'' పిల్లలందరూ గొల్లున నవ్వారు. దేనికైనా నవ్వే మూడ్‌లో వున్నారు.

హెడ్‌మాస్టర్ ప్లాట్‌ఫారం మీదకు వచ్చాడు. గోల సద్దుమణిగాక చిన్నపాటి ఉపన్యాసం ఇచ్చాడు. స్కూలు జూన్ పందొమ్మిది వరకు మూయబడుతుందనీ, మళ్ళీ జూలై ఇరవైకి తెరవబడుతుందనీ చెప్పాడు. ''మీరంతా శెలవుల్లో మంచి కథల పుస్తకాలు చదవాలి. పై క్లాసుకు సంబంధించిన పుస్తకాలను కూడా చదివితే మంచిది. సమయం వృధాచెయ్యొద్దు. చాలామందికి ప్రొమోషన్ వస్తుందనే ఆశిస్తున్నాను. ఇప్పుడు ప్రార్థన వుంటుంది. ఆ తర్వాత అందరూ వెళ్ళిపోవచ్చు.'' అన్నాడు.

ప్రార్థన అయిపోయింది. కేకలతో, కేరింతలతో ఆ హాలంతా ప్రతిధ్వనించింది. ఒకర్నొకరు తోసుకుంటున్నారు. స్వామినాథన్‌కు గాభరాగా ఉంది. చివరి రోజున శత్రువులు ఒకర్నొకరు కత్తులతో పొడుచుకుంటారట. తనకైతే ఎవరూ శత్రువులు లేరు. అయినా ఎలా నమ్మడం? ఈ స్కూలే అలాంటిది. ఎందుకైనా మంచిదని స్వామినాథన్ మణిని అంటిపెట్టుకొనేవున్నాడు.

మణి స్కూలు గేటులో నిల్చున్నాడు. కుర్రాళ్ళ సిరా బుడ్లూ, పెన్నులూ లాక్కుని విరగ్గొట్టడం, పగలగొట్టడం చేస్తున్నాడు. అతన్ని పొగడ్తూ కొందరు చుట్టూ చేరారు. అందరూ పిచ్చి సంతోషంతో, ఉద్వేగంతో వస్తువులు అందినంతవరకు లాక్కుని పాడుచేస్తున్నారు. ఒకరిద్దరు చిన్న పిల్లలు ఎదురు తిరిగారు. మణి వాళ్ళ సిరా బుడ్లు లాక్కున్నాడు. వాళ్ళ టోపీలు లాగి పారేశాడు. బట్టలమీద సిరా గుమ్మరించాడు. మణి చేస్తున్న ఈ పనుల్లో కొందరు సహకారం అందిస్తున్నారు. అందులో స్వామినాథన్ ప్రముఖుడు. అంతులేని

ఉద్రేకంతో తన సిరా బుడ్డిలోని సిరా తన తలమీదే గుమ్మరించుకున్నాడు. ముఖంమీదకు కారుతూ కళ్ళ చుట్టూ అలుముకుంది.

అటుగా వస్తున్న పోలీసును చూసి ''ఓ పోలీసూ! పోలీసూ! ఇటురా! ఈ పిల్లల్ని అరెస్టు చెయ్యి'' అంటూ మణి అరిచాడు. అనేక కంఠాలు అతడ్ని అనుకరించాయి. మరికొన్ని సిరాబుడ్లు పగిలాయి. కొన్ని కలాలు విరిగాయి.''సింగారం తలపాగా ఎవరు తెస్తారు? దానికి నేను రంగు వేస్తాను,'' అన్నాడు మణి.

సింగారం ఆ స్కూలు ప్యూన్. ఇంగ్లీషువాళ్ళు వెళ్ళిపోయినా అతడి వేషానికి మాత్రం స్వతంత్రం రాలేదు. తన తలపాగా గురించి వినగానే కర్ర తీసుకొని పిల్లలమీదకు వచ్చాడు. అది చూసి ఎక్కడివాళ్ళక్కడ పారిపోయారు.

## అధ్యాయం 10

# బండివాడి కొడుకు

### 1

స్వామినాథన్‌కు రెండు రకాల స్నేహితులు ఉన్నారు. ఒక రకం స్నేహితులు స్కూలుకే పరిమితం. అలాంటి స్నేహితులలోకి సోము, శంకర్, బఠాణీ వస్తారు. మణితో, రాజంతో వున్న స్నేహం అలాంటిది కాదు. ఆ స్నేహంలో ఆత్మీయత వుంది. అది విడదీయరానిది. సెలవుల్లో కూడా ముగ్గురూ తరచుగా కలుసుకుంటూనే ఉన్నారు.

స్వామినాథన్‌కు ఒక అందమైన కోరిక కలిగింది. ఒక పాత సైకిల్ చక్రం సంపాదించాలనుకొన్నాడు. దానికి టైర్ వుండకూడదు. ఆ చక్రం రంధ్రంలో, ఒక సువ్వ దూర్చి, దాన్ని నెట్టుకుంటూ పరిగెత్తడంలో వున్న ఆనందాన్ని ఊహించుకుంటూ ఉవ్విళ్ళూరసాగాడు. దాని వెంట పరిగెత్తుతూ సన్నగా కూనిరాగంలో పాటపాడితే బలే వుంటుంది. మాల్గుడిలో వాళ్ళందరూ అరమైలు దూరంనుంచే తన కూనిరాగం విని తను వస్తున్నట్టు గ్రహిస్తారు. అలా చక్రం గురించి ఆలోచిస్తూ పది గంటలదాకా నిద్రపోవడం లేదు రాత్రుళ్ళు. కలల్లో చక్రం కన్పిస్తోంది. తండ్రి స్నేహితుల దగ్గర్నుంచి, తనకు తెలిసిన ఒక మ్యునిసిపాలిటీ స్వీపర్ వరకు, ఒక చక్రం ఇప్పించమని అడిగాడు. కళ్ళ ముందునుంచి ఏదైనా సైకిల్ వెళితే చాలు అతడి చూపులన్నీ చక్రాలమీదే. ఒక రోజు కలలో స్వామి చక్రం దొర్లించుకుంటూ నల్లప్ప తోట దగ్గరకు వెళ్ళాడు. సరయు ఒడ్డున ఇసుకలోఅతి కష్టంమీద ముందుకు వెళ్తున్నాడు. అవతలి వడ్డుకు చేరాడు. అవతలి వడ్డు చేరగానే అతడి చక్రం ఒక్కసారి గుర్రంబండిగా మారిపోయింది. ఆ బండి స్వామినాథన్‌ను ముందు వంటింట్లోకి తీసుకెళ్ళింది. ఆ తర్వాత పడక గదిలోకి తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టింది. మెలకువ వచ్చాక స్వామినాథన్‌కు నిరాశ కలిగింది. ఆ రోజంతా నీరసంగానే గడిపాడు.

ఒక రోజు తనకు తెలిసిన గుర్రం బండివాడి దగ్గర తన గోడును వెళ్ళబోసుకున్నాడు. బండివాడు సానుభూతి చూపించాడు. చక్రం లేకపోవడం నిజంగా బాధను కలిగించే విషయమేనన్నాడు. తనదగ్గర ఒకటి వుందనీ,

పదిహేను నిముషాల్లో చక్రం ఇవ్వగలననీ చెప్పాడు. అయితే పది నిముషాల్లో ఐదు రూపాయలు తెచ్చి ఇవ్వాలన్నాడు.

ఐదు రూపాయలా? అంత పెద్ద మొత్తమా? తను ఎక్కడ్నుంచి తేవాలి? తను పెద్దవాడైతే, నాన్నంత పెద్దవాడైతే, నాన్నంత పొడుగైతే ఇవ్వగలడు. బండివాడితో అదే చెప్పాడు. వాడొక ఉపాయం చెప్పాడు. వెంటనే మొత్తం పైకం ఇవ్వక్కర్లేదన్నాడు. ముందు ఆరు పైసలు ఇవ్వమన్నాడు. ఆ తర్వాత ఆరణాలు ఇవ్వాలన్నాడు. మిగతా డబ్బు రూపాయి చొప్పున ఇవ్వాలన్నాడు. అలాగయితే మొత్తం ఆరు రూపాయలు అవుతుందన్నాడు. ఆరో రూపాయికి బలవంతం చెయ్యననీ, ఇవ్వగలిగితేనే ఇవ్వచ్చుననీ అన్నాడు. స్వామి ఆరో రూపాయి కూడా సంతోషంగా ఇస్తానన్నాడు. బండివాడు మరో రహస్యం కూడా చెప్పాడు. అతడిదగ్గిర ఒక చిత్రమైన కంచు పాత్ర వున్నదనీ, దానికి రాగిని వెండి చేసే శక్తి వుందనీ చెప్పాడు. అయితే అందుకు ఒక మూలికను కూడా ఉపయోగించాలన్నాడు. దాని పేరు మాత్రం చచ్చినా ఎవరికీ చెప్పనని చెప్పాడు. ఆ మూలిక అరణ్యంలోగాని దొరకదన్నాడు. అది తేవడం ఎంత కష్టమో కూడా వివరించాడు. రాగి, వెండిగా, బంగారంగా కూడా ఎలా మారుతుందో చెప్పాడు. అర్ధరాత్రి ఎవరూ చూడకుండా రాగి పైసలు పాత్రలో వేసి, మూలిక వెయ్యాలి. దాన్ని గొయ్యితీసి నేలలో పాతిపెట్టాలి. రెండురోజుల్లో రాగి పైసలు వెండి పైసలుగా మారిపోతాయి. అతడు చెప్పినదంతా ఆశ్చర్యంగా విన్నాడు స్వామినాథన్.

మళ్ళీ కలుస్తాననీ, అప్పుడు ఆరు పైసలు తెస్తాననీ, ఆ వెంటనే సైకిల్ చక్రం ఇవ్వాలనీ అన్నాడు స్వామినాథన్. ''లాభంలేదు. నేను కొన్ని వారాలు ఊళ్ళో ఉండను. వెంటనే ఆరు పైసలు తెచ్చి చక్రం తీసుకెళితే మంచిది.'' అన్నాడు బండివాడు. అరగంట సమయం ఇవ్వమని ప్రాధేయపడ్డాడు స్వామినాథన్. బండివాడు అంగీకరించాడు. స్వామినాథన్ ఇంటికేసి పరుగు తీశాడు.

బామ్మ తన దగ్గిర డబ్బులు లేవన్నది. స్వామి నమ్మలేదు. బామ్మ తను డబ్బు దాచుకొనే చిన్న పెట్టె బోర్లించి చూపించింది. అయినా స్వామికి నమ్మకం కలగలేదు. బామ్మ తలగడల్లో దాచి వుంటుందనే అనుమానం కలిగింది. బామ్మ తలగడలు వెతుక్కోమన్నది. స్వామి వెదికాడు. డబ్బు దొరకలేదు.

''నీకిప్పుడు ఆరు పైసలు ఎందుకురా అబ్బాయ్?'' అడిగింది.

''పెద్ద ఇచ్చేదానిలా అడుగుతున్నావు. ఎందుకు చెప్పాలేం?'' కసిగా అన్నాడు స్వామి.

''ఇదుగో కోడలూ! నీ దగ్గిర డబ్బులుంటే స్వామిగాడికి ఆరు పైసలు ఇవ్వు.'' కోడల్ని కేకవేసి చెప్పింది బామ్మ. ఆమె తనదగ్గిర లేవన్నది. తండ్రి దగ్గిరకెళ్ళి అడిగాడు. పూర్తిగా వినకుండానే తనదగ్గిర లేవన్నాడు. తండ్రి దగ్గిర ఆరు పైసలు కూడా లేవంటే స్వామికి ఆశ్చర్యం వేసింది. పార్టీలు ఇచ్చే డబ్బంతా ఏం చేస్తున్నాడో అని అనుకున్నాడు.

చివరి ప్రయత్నంగా, ఎవరూ చూడకుండా పిల్లిలా తండ్రి బట్టల బీరువా దగ్గరకు వెళ్ళాడు. వెదికితే ఆమాత్రం పైసలు దొరక్కపోతాయా అని అనుకున్నాడు. పైసలు దొరకలేదు. కాని బొద్దెంక పిల్లలూ, సాలెగూడూ చేతికి తగిలాయి. బోలెడంత దుమ్ము కూడా ఉంది.

తను కావాలంటే మ్యాజిక్ చెయ్యగలడనే నమ్మకం వుంది స్వామినాథన్‌కు. ''ప్రభువును ప్రార్థిస్తే అడిగింది ఇస్తాడు'' అని చెప్పే ఎబెనెజార్ మాటలు గుర్తుకొచ్చాయి.

స్వామి ఒక అట్టపెట్టె సంపాదించాడు. దానిలో రెండు చిన్న చిన్న రాళ్ళు వేశాడు. మట్టి పోశాడు. ఆ మట్టిమీద చెట్ల ఆకులు పేర్చాడు. దాన్ని తెచ్చి పూజ గదిలో ఒక మూల పెట్టాడు. ఆ గది చాలా చిన్నది. గోడకు దేవుళ్ళ ఫోటోలు వేలాడుతున్నాయి. గూట్లో ఇత్తడి దేవుడి బొమ్మలు ఉన్నాయి. ఆ దేవుళ్ళందరూ తననే చూస్తున్నట్టుగా అనిపించింది. ఆ గది పూలూ, సాంబ్రాణి, గంధం వాసనలతో నిండి వుంది.

స్వామినాథన్ దేవుళ్ళ ఎదురుగా నిల్చున్నాడు. తను తెచ్చిన పెట్టెలో ఏమేమి ఉన్నాయో చెప్పాడు. అందులో వున్న రెండు రాళ్ళనూ రెండు కానులుగా (ఆరు దమ్మిడీలు) మార్చమని ప్రార్థించాడు. ఆ డబ్బు తనకు ఎందుకు కావాలో కూడా వివరించాడు. ఆ పైసలు ఇస్తే తను గోళ్ళు కొరుక్కోవడం మానేస్తానని మాట ఇచ్చాడు. ''ఓ రామా! నువ్వు పది తలల రావణాసురుణ్ణి చంపావు. నాకు ఆరు పైసలు ఇవ్వలేవా? మరి నాకు సైకిల్ చక్రం ఎప్పుడిప్పిస్తావ్? కనీసం ఆ మూలిక పేరైనా చెప్పు. ఎంత కష్టమైనా మణి తీసుకురాగలడు. నువ్విప్పుడు ఆరు పైసలిస్తే ఒక ఏడాది వరకు నేను గోళ్ళు కొరుక్కోను. నిజం!''

అర్ధ గంటలో రాళ్ళను పైసలుగా మార్చమని దేవతల్ని అడిగి బయటికి వెళ్ళాడు. తను తిరిగి వచ్చి చూసేసరికి రాళ్ళు పైసలుగా మారిపోతాయనే నమ్మకం అతడికి వుంది. ఇంటిముందు అర్ధ గంట ఎప్పుడు అవుతుందా అని అశాంతిగా తిరుగుతున్నాడు.

పది నిముషాల తర్వాత పూజ గదిలోకి తిరిగి వచ్చాడు. దేవతల ముందు సాష్టాంగపడ్డాడు. లేచి నమస్కరించాడు. మూలగా వున్న అట్టపెట్టె తీసుకొని ఇంటి వెనకకు పరుగుతీశాడు. గుండె దడ దడలాడసాగింది. ఉద్వేగంతో పెట్టెను బోర్లించాడు. ఆత్రంగా ఆకుల మధ్య, మట్టిలో చేతులు పెట్టి పైసలకోసం వెదికాడు. చేతికి రెండు రాళ్ళు తగిలాయి. అట్టపెట్టకేసి పిచ్చి చూపులు చూశాడు. చిందరవందరగా పరచుకున్న ఆకుల్ని చూశాడు. మట్టి కొట్టుకుని వున్న రాళ్ళను చూశాడు. పిచ్చి కోపంతో ఊగిపోయాడు. తన ప్రార్థన వినని దేవుళ్లమీద కోపం వచ్చింది. కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. దేవుళ్ళను తిట్టాలనిపించింది. మళ్ళీ భయం వేసింది. తన కసినంతా అట్టపెట్టెమీద చూపించాడు. దాన్ని ఇష్టం వచ్చినట్టు ఇటూ అటూ తన్నాడు. ఆకుల్నీ, మట్టినీ, రెండు కాళ్ళతో కసి కసిగా తొక్కాడు. వెంటనే ఓ ఆలోచన వచ్చింది. ఇలా చేసినందుకు దేవుళ్ళకు కోపంవస్తే? డబ్బు లేకపోయినా పర్వాలేదు, పరీక్ష తప్పిస్తే? అమ్మనూ, నాన్ననూ, బేబీ, బామ్మనో చంపేస్తే? గబ గబా అట్టపెట్టె తీసుకొని, రాళ్ళు దాన్లో వేసి మట్టి పోశాడు. ఆకులు కప్పాడు. తీసుకెళ్ళి అరటిచెట్టు మొదట్లో గొయ్యి తీసి పాతిపెట్టాడు భక్తి శ్రద్ధలతో.

## 2

పది నిముషాల తర్వాత స్వామినాథన్ ఆబూ స్ట్రీట్‌లో వున్న మణి ఇంటి ముందుకు వచ్చి నిల్చున్నాడు. చిన్నగా ఈల వేశాడు. రెండోసారి, మూడోసారి కూడా వేశాడు. కాని మణి వున్న జాడ కనిపించలేదు. ధైర్యం చేసి తలుపు తట్టాడు. గొళ్ళం తీసిన చప్పుడు వినిపించగానే కొంచెం జంకు అనిపించింది. మణి కాక, మరెవరైనా తలుపు తెరిస్తే? ఏం చెప్పాలి? తలుపులు తెరుచుకున్నాయి. స్వామినాథన్ గతుక్కుమన్నాడు. ఎదురుగా గుబురుగా వున్న కనుబొమలతో ఒక మహాకాయుడు కనిపించాడు. ''ఎవర్రా నువ్వు?'' అతడుఅడిగాడు.

''నువ్వెవరు? మణి లేడా?'' మణి లేడా అని అడగాలనుకున్నాడు. కాని ఇతనెవరో తెలుసుకోవాలనిపించింది. అతడ్ని చూస్తుంటే తమాషాగా అనిపించింది. కాని అడగటమే సరిగా కుదరలేదు.

''ఎవర్రా నువ్వు? నా ఇంటికొచ్చి నన్నే ఎవరంటున్నావ్?'' గుబురు కనుబొమలు ముడిపడ్డాయి. స్వామినాథన్ గిర్రున తిరిగి, మెట్లు దిగాడు, పారిపోయే ప్రయత్నంలో.''ఏయ్! ఎందుకు పారిపోతావ్? ఇలా రా బుడ్డోడా!'' ఆ పిలుపుకు యాంత్రికంగా వెనక్కు వచ్చాడు స్వామినాథన్. గుండె దడ దడలాడుతోంది. ''ఎందుకలా పారిపోతున్నావ్? మణిని

చూడాలన్నావుగా? చూడకుండానే వెళ్ళిపోతున్నావేం? మణిని చూడవా?''

''చూస్తాను.'' భయంగానేఅన్నాడు.

''లోపలికెళ్ళు, చూడు.''

స్వామినాథన్ బిక్కు బిక్కుమంటూ లోపలకు నడిచాడు. మణి తలుపు వెనక నిల్చుని వున్నాడు. ఇంట్లో మణి, మణిలా అనిపించ లేదు. పెంపుడు పిల్లిలా అనిపించాడు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకుంటూ నిల్చుండిపోయారు. ఎవరి నోటా మాట పెగల్డం లేదు. స్వామినాథన్ వణుకుతున్న చేతివేలుతో చూపిస్తూ''ఎవరతను?'' అన్నట్టు చూశాడు.''మామయ్య'' చిన్నగా రహస్యం చెప్పినట్టుగా చెప్పాడు మణి. అంతవరకు వీపు లోపలవైపుపెట్టి వీధిలోకి చూస్తున్న మామయ్య వెనక్కు తిరిగాడు.''ఏమిటలా ఒకర్నొకరు గుడ్లు మిటకించుకొని చూస్తూ నిలబడ్డారు? ఏరాబుడ్డోడా! ఇందుకేనా వచ్చావ్. నాలుకల్ని కాస్త వదులు చెయ్యండి'' అని మళ్ళీ వీధికేసి తిరిగి, అక్కడ కొట్లాడుకుంటున్న కుక్కల్ని అదిలించసాగాడు.

''మీ మామయ్యా? నేను ఎప్పుడూ చూళ్ళేదు, మణీ! నాతో బయటికి రాగలవా?''

''రాలేను.''

''నేనొక అర్జెంటు పనిమీద వచ్చాను. ఆరు పైసలుంటే ఇవ్వు. ఇప్పుడు ఇవ్వకపోతే మళ్ళీ ఆ బండివాడు కొన్ని వారాలపాటు కన్పించడు,'' అని వీధివైపుకు చూశాడు. గుబురు కనుబొమల పెద్దమనిషి కుక్కల్ని తోలడంలో తలమునకలై వున్నాడు. ''ఇది నా జీవిత సమస్య. డబ్బు త్వరగా ఇవ్వు.''

''డబ్బు నాదగ్గిర లేదు. నాకు ఎవరూ ఇవ్వరు.''

''మీ మామయ్య డబ్బులు ఎక్కడ దాస్తాడు?''

''ఏమో నాకు తెలియదు.''

''ఒరేయ్ మణీ ఇలా రారా! ఆ కుక్కల్ని తోలు. ఒకరాయి తెచ్చి నాకివ్వు'' అని కేకవేశాడు మణి మామయ్య.

## 3

రెండు వారాలు గడిచాయి. స్వామినాథన్ రాజం ఇంటికి వచ్చాడు.

''రాజం! నాకొక పోలీసును సాయంగా ఇవ్వగలవా?'' అనిఅడిగాడు.

''పోలీసా? ఎందుకూ?''

''ఒక రాస్కెల్ నన్ను దోచుకున్నాడురా'' అని జరిగిన కథంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.''ఇప్పుడు వాడు నేను కన్పిస్తే తెలియనట్టే



నటిస్తున్నాడు. ఇంటికి వెళ్తే, వుండి కూడా లేడని చెప్పిస్తున్నాడు. నేను మొండికేస్తే, కుక్కను వదులుతానని బెదిరిస్తున్నాడు.''

''వాడిదగ్గర కుక్క ఉందా?''

''ఏమో! నేనైతే చూళ్ళేదు.''

''మరి! లోపలకెళ్ళి వాడ్ని నాలుగు తన్నకపోయావ్?''

''చెప్పడం తేలికే. వాడి ఇంటికని నడుస్తుంటేనే నా కాళ్ళు వణుకుతాయి. అసలు వాళ్ళిళ్ళల్లో ఏమేముంటాయో నాకేం తెలుసు? ఒకవేళ వాడు నామీద గుర్రాన్ని వదిలేస్తే?''

''గుర్రం నిన్ను తినెయ్యదులే.''

''తినదా? ఒకసారి నాతో, టైలర్ రంగాగాడి దగ్గరకు రా! గుర్రాల గురించి వాడు ఎన్ని విషయాలు చెప్తాడో విను. ఒకోసారి అవి పెద్దపులుల కంటే భయంకరంగా వుంటాయట.'' అనుకొన్నాడు స్వామినాథన్.

''ఇంటిముందు కాపలా కాసి వాడు బయటికి వచ్చినప్పుడు పట్టుకోవచ్చుగా?''

''అదీ చేశాను. వాడెప్పుడు బయటికి వచ్చినా గుర్రం బండిమీదే వస్తాడు. నన్ను చూడగానే చర్నాకోల ఎత్తేవాడు. నేను భయంతో అరుస్తూ పారిపోయాను. వాడు నాదగ్గర రెండు అణాలు దోచుకున్నాడు.''

''ఆరు పైసలేగా ఇచ్చావ్?''

''మొదటిసారి ఆరు పైసలు ఇచ్చాను.. మళ్ళీ ఆరు పైసలు ఇచ్చాను. మూడోసారి కూడా ఆరు పైసలు ఇచ్చాను.''

''అంటే అణన్నరేగా ఇచ్చావ్? రెండణాలంటావేం?'' అన్నాడు రాజం.

''కాదు రాజం, రెండణాలు.''

''అదెలారా? అణాకు పన్నెండు పైసలు. నువ్వు మూడుసార్లు ఆరు పైసల చొప్పున ఇచ్చావు. పద్దెనిమిది పైసలు ఇచ్చావన్న మాట. అంటే అణాన్నర ఇచ్చావనేగా?''

''ఏదోలే ఆ లెఖ్కలన్నీ అంత వివరంగా ఎవరికి తెలుసు?'' అన్నాడు స్వామి.

''అదెట్లా? లెక్క లెక్కే. డబ్బు విషయంలో ఖచ్చితంగా వుండాలి. సరే! పూర్తిగా చెప్పు.''

''మొదట ఆరు పైసలు ఇచ్చానా? రెండు రోజుల్లో వెండి పైసలు ఇస్తానన్నాడు. రెండు రోజుల తర్వాత మరో ఆరు పైసలు కావాలన్నాడు. మూలికలు పన్నెండు పైసలకు సరిపడేవి వున్నాయట. వ్యర్థంగా పాడయి పోతాయన్నాడు. మళ్ళీ అరు పైసలు ఇచ్చాను. ఆ తర్వాత మరో ఆరు పైసలు కూడా వెండిగా మార్చడానికి మూలికలు వున్నాయన్నాడు. మళ్ళీ ఇచ్చాను. నాలుగైదు సార్లు వాడి ఇంటిచుట్టూ తిరిగాను. వాతావరణం బాగాలేదు అందుకే రాగి వెండి కావడానికి ఆలస్యం అవుతుంది అన్నాడు. రెండు రోజుల క్రితం ''నువ్వెవరో నాకు తెలియదు. నువ్వు నాకు పైసలివ్వలేదు''అన్నాడు.డబ్బు

పోయిందని కాదురా నా బాధ. వాడు-ఆ రాస్కెల్-ఆ బండివాడి కొడుకు నన్ను చూసి వెక్కిరిస్తున్నాడు. మురిక్కాలవ నీళ్ళు తెచ్చి నామీద పోస్తానన్నాడు. నిన్న చిన్న చాకుతో పొడవడానికి నామీదకొచ్చాడు. వాడికి బుద్ధి చెప్పాలి. అప్పుడు కాని ఆ బండివాడు నా రెండణాలు నాకివ్వడు,''అన్నాడు స్వామినాథన్.

**4**

తెల్లవారి స్వామినాథన్, మణి, బండివాడి ఇంటికి బయలుదేరారు. ముందుగా ఈ విషయం మిత్రులిద్దరికీ చెప్పనందుకు స్వామినాథన్ విచారం వ్యక్తంచేశాడు. ఇప్పుడు మణి, రాజం కూడా రంగంలోకి దిగారు. ఈ వ్యవహారం ఎంతదూరం పోతుందో మరి!

బండివాడి కొడుకుని ఎత్తుకొచ్చేదానికి ఒక ప్లాన్ తయారు చేసాడు రాజం. మణి ఆ ప్లానును అమలుపర్చాలి. మణి చిన్నగా బండివాడి కొడుకును మచ్చిక చేసుకోవాలి. ప్రారంభ దశలో స్వామినాథన్ చెయ్యవలసింది పెద్దగా ఏమీలేదు. మణికి బండివాడి ఇల్లు చూపించాలి అంతే.

స్వామినాథన్ ఇంటికి ఒక మైలు దూరంలో ఉంది బండివాడు నివసించే మురికివాడ. అక్కడ దాదాపు డజను పూరిళ్ళు వుంటాయి. మిగతావన్నీ చిన్న చిన్న గుడిసెలు. చెత్తా చెదారంతో నిండిపోయి మురికి వాసన కొడ్తూ వుంటుంది ఆ వాతావరణం.

బండివాడి ఇల్లు అల్లంత దూరంలో కనిపిస్తున్నది. తాము చెయ్యబోయే పని ఆపదతో కూడుకున్నదనిపించి, భయంవేసింది స్వామినాథన్‌కు. ఎలాగైనా తమ ప్లాను జరక్కుండా ఆపాలనే ఆలోచన వచ్చింది.

''మణీ! బండివాడి కొడుకు నా రెండణాలు ఇచ్చేశాడనిపిస్తోంది.''

''ఏమిటీ?''

''సరిగ్గా గుర్తు రావడంలేదు కాని ఇచ్చేసినట్టే వున్నాడు.''

''ఇచ్చేశాడా? అయితే ఆ డబ్బు నీదగ్గర వుండాలిగా? వుందా? వుంటే చూపించు.''

''మణీ నా మాట విను. మనం చెయ్యబోతున్న పని మంచిది కాదు. అనవసరంగా పోలీసు కేసుల్లో ఇరుక్కుంటాం.''

''నోరు ముయ్! మరొక మాట అన్నావా నీ పీక పిసికి చంపేస్తాను'' మణి అరిచాడు.

స్వామినాథన్‌కు బండివాడి కొడుకంటే చచ్చేంత భయం. వాడి రూపమే భయంకరంగా వుంటుంది. వాడు స్వామినాథన్ కలల్లోకి కూడా వస్తాడు.

''అదుగో అదే ఇల్లు'' ఠక్కున ఆగి అన్నాడు స్వామినాథన్.

మణి చివరి నిముషంలో అనుకున్న ప్లాను మార్చేశాడు. స్వామినాథన్ కూడా ఆ ఇంటికి రావాలన్నాడు. స్వామి రానన్నాడు. మణి వినిపించుకోవడం లేదు. స్వామినాథన్ మొండికేసినట్టు రోడ్డుమీద చతికిలబడి కూర్చున్నాడు. మణి మొండివాడు. మొరటువాడు. స్వామినాథన్‌ను బండివాడి ఇంటివరకూ ఈడ్చుకుంటూ తీసుకెళ్ళాడు. ఇంటి ముందుకు రాగానే స్వామినాథన్ మీద కేకలు వెయ్యసాగాడు.

స్వామినాథన్ బావురుమని ఏడవసాగాడు. మణి స్వామినాథన్ గొంతు పట్టుకొన్నాడు. రకరకాల జనం చుట్టూ చేరారు. జులాయిగా తిరిగే కుర్రాళ్ళూ, నల్లగా బలిష్టంగా వున్న ఆడవాళ్ళూ, చాలీచాలని బట్టల్లో మగవాళ్ళూ, పెద్ద



పెద్ద బాన కడుపుల పిల్లలూ, గోల గోలగా అటూ ఇటూ పరుగెత్తుతున్న కోళ్ళూ...మిట్ట మధ్యాహ్నపు ఎండ మండిపోయింది. నాలుగైదు పెంపుడు కుక్కలు చెట్టుకింద పడుకునే గుర్రుమంటున్నాయి. కోళ్ళ గంపలు, మురికి బట్టలు, ముక్కులు బద్దలుకొట్టే కంపు.

పొట్టిగా, మురిగ్గా వున్న బండివాడి కొడుకు జనాన్ని తోసుకుంటూ వచ్చి ముందు వరుసలో నిల్చున్నాడు. బొటనవేలు నోట్లో పెట్టుకొని చీకుతున్నాడు. స్వామినాథన్, వాడ్ని మణికి చూపించాడు. వాడు అక్కడ జరుగుతున్న తతంగం కుతూహలంగా చూస్తున్నాడు. మణి జనంకేసి చూస్తూ స్వామినాథన్ గురించి చెప్పడం మొదలుపెట్టాడు. ''చూడండిబాబూ! వీడెవడో నాకు తెలియదు. ఎప్పుడూ వీడ్ని నేను చూడను కూడా లేదు. నేను వీడికి రెండణాలు బాకీ వున్నానట. సతాయిస్తున్నాడు'' అంటూ దాదాపు పదిహేను నిముషాలు చెప్పాడు. స్వామినాథన్ ముఖంమీద కన్నీటి చారికలు కనిపిస్తున్నాయి.

''వీడ్ని జైలుకు పంపించాలి'' అన్నాడు బండివాడి కొడుకు నోట్లో వేలు తీసి. ''అవును. వీడ్ని పోలీసులకు అప్పగించాలి. పోలీసు స్టేషన్‌కి లాక్కెళ్ళాలి. నువ్వు కూడా వచ్చి సాయంచేస్తావా?'' అని అడిగాడు మణి.

''రాను'' పోలీసువాళ్ళను తలుచుకుంటూ అన్నాడు బండివాడి కొడుకు.

''మరి వీడ్ని జైలుకు పంపాలని ఎందుకన్నావ్?''

''వీడి గురించి నాకు తెలుసు.''

''నిన్ను కూడా ఎప్పుడైనా ఇలాగే సతాయించాడా?''

''లేదు, లేదు.''

''ఏయ్! మీ నాన్న నాదగ్గిర తీసుకొన్న రెండణాలు ఎక్కడ?'' ఏడుపు ముఖంతోనే అడిగాడు స్వామినాథన్.

అప్పటికే జనం వెళ్ళిపోయారు. ''ఇది కావాలా?'' ఎర్రగా మెరుస్తున్న బొంగరం చూపిస్తూ మణి అడిగాడు. బండివాడి కొడుకు ఆశగా చెయ్యి చాచాడు.

''ఇది నీకు ఇవ్వను. ఇంతకంటే పెద్దది వుంది. నాతో వస్తే అది నీకిస్తాను,'' అన్నాడు మణి. ''మనిద్దరం స్నేహం కడదాం'' అన్నాడు మళ్ళీ.

''అలాగే! దాన్ని ఒక్కసారి చూస్తాను'' అని అన్నాడు బండివాడి కొడుకు. మణి వాడికి బొంగరం ఇచ్చాడు. వాడు దాన్ని అటూ ఇటూ తిప్పి మెరుస్తున్న కళ్ళతో ఆశగా చూశాడు.

ఉన్నట్టుండి వాడు దాన్ని తీసుకొని మెరుపులా పరుగు తీశాడు. జరిగింది అర్థం చేసుకోవడానికి మణికి కొద్ది క్షణాలు పట్టింది. అర్థం అయి చూసేసరికే వాడు ఒక గుడిసెలోకి జొరబడి తలుపేసుకున్నాడు.

మణి పరుగుతీశాడు. తలుపు కొట్టాడు. ఒక మగవాడు తలుపు తీశాడు. తన ఇంటికి ఎవరూ రాలేదు పొమ్మన్నాడు. ధడాలున తలుపేసుకొన్నాడు. మణి మళ్ళీ గట్టిగా తలుపుమీద బాదసాగాడు. ఆ గొడవకు ఇరుగు పొరుగు గుడిసెల్లోనివాళ్ళు బయటికి వచ్చారు. ''నువ్విలా మా ఇళ్ళకొచ్చి అల్లరి చేశావంటే నిలువునా పాతిపెడ్తాం, జాగ్రత్త'' అన్నారు. స్వామినాథన్ మణిని బతిమాలుతున్నాడు. కాని మణి మొండిగా తలుపును బాదుతూనే వున్నాడు.

అక్కడ చేరినవాళ్ళు చెట్టుకింద నిద్రపోతున్న కుక్కల్ని రాళ్ళతో కొట్టి ఉసిగొల్పారు. కుక్కలు అరుస్తూ దూకడానికి సిద్ధంగా వున్నాయి.

''స్వామీ! పారిపో!'' అరుస్తూ పరుగుతీశాడు మణి.

వెనకనుంచి పారిపోతున్న స్వామినాథన్ వీపుకు రెండు రాళ్ళు తగిలాయి. ఒక పదునైన రాయి వచ్చి మణి మోకాలు దగ్గిర చర్మాన్ని చీల్చింది.

ఇద్దరూ పిచ్చిగా పరుగులు తీశారు.

## అధ్యాయం 11

# తండ్రి సమక్షంలో

### 1

దక్షిణ భారతదేశంలోని మాల్గుడి పట్టణాన్ని ఎవరూ వేసవికాలంలో ఇష్టపడరు. ఎండ చాలా భయంకరంగా వుంటుంది. ఒకోసారి నూట పది డిగ్రీలు దాటుతుంది. సాధారణంగా పన్నెండూ మూడు గంటల మధ్య ఎవరూ బయటికి వెళ్ళరు. గాడిదలు, కుక్కలు, ఇతర జంతువులు రోడ్డువారగా, భవనాల నీడలో నడుస్తూ కనిపిస్తాయి.

ఈ ఎండలో ఒక విశేషం ఉందనిపిస్తుంది. దాన్ని గురించి ఆలోచించిన వాళ్ళకే అది హాని చేస్తుంది. మాల్గుడి ఎండ భరించరానిదని ఎవరైనా అంటే స్వామినాథన్, మణి, రాజం ఆశ్చర్యపోతారు. మధ్యాహ్నంపూట ఎండ వాళ్ళకు ఎలాంటి బాధనూ కలిగించదు. పైగా వాళ్ళు సరదాగా తిరిగే సమయం అదే. కాని వేడిని భరించలేక మిల్లు మేనేజరు హాంటెల్ కొడైకెనాల్ వెళ్ళిపోయ్యాడు. తలపాగా పెట్టుకొని కూడా చీఫ్ ఇంజనీర్ మిస్టర్ కృష్ణన్ ఆ ఎండను భరించలేడు. అంత ఎండలో తిరగవలసిన ఉద్యోగం చేస్తుందుకు చాలా బాధపడ్తూ వుంటాడు. స్వామినాథన్ వంకీల జుట్టును కానీ, మణి బిరుసు జుట్టును కానీ, రాజం దగ్గిరగా కత్తిరించిన క్రాపును కానీ ఆ ఎండ ఏమీ చెయ్యలేదు. భూమిని పెనంలా కాల్చేస్తున్న ఆ ఎండలో దాదాపు ఇండియన్‌గా మారిపోయిన ఆ యూరోపియన్ సహితం (అతడు ఎవరో, ఎక్కడ్నుంచి వచ్చాడో ఎవరికీ తెలియదు. చక్కగా తమిళం మాట్లాడతాడు. బియ్యం మిల్లు నడుపుతున్నాడు) పొరపాటున చెప్పులు లేకుండా బయట కాలుపెట్టి కెవ్వున అరిచాడు. కాని ఆ ఎండ ఆ ముగ్గురు కుర్రాళ్ళనూ ఏమీ చెయ్యదు. వాళ్ళకు ఇంటిపట్టున నీడన వుండాలంటే ఏవగింపు.

ఆ ముగ్గురూ ఊరిబయట, ట్రంకురోడ్డు పక్కన వున్న కాలవ వంతెనమీద కూర్చుని వున్నారు. వంతెన కిందగా. సన్నటి నీటిధార ప్రవహిస్తున్నది. అది ముందుకు సాగి సరయు నదిలో కలిసిపోతున్నది. అక్కడ చెట్టు నీడ కూడా లేదు. ఎండ వాళ్ళ తలలు మాడుస్తున్నది. రోడ్డు రెండు వైపులా పంటపొలాలు ఉన్నాయి. పంట కోశాక మిగిలిపోయిన మోళ్ళు

పూర్తిగా ఎండిపోయి ఉన్నాయి. అక్కడక్కడ మామిడి చెట్లకు కాయలు గుత్తులుగా వేలాడుతున్నాయి. కొబ్బరిచెట్లకు కూడా కాయలున్నాయి. ట్రంకు రోడ్డుమీద ఎవరూ కనిపించటం లేదు. అరుదుగా ఎడ్లు బళ్ళు పోతుంటాయి.

''నేను చెయ్యమన్న పని నువ్వు చేసివుండవలసింది,'' అన్నాడు రాజం మణితో.

''అవును రాజం. ఆ ఇల్లు చూపించి ఆగిపోయాను మన ప్లాను ప్రకారం. అకస్మాత్తుగా నన్ను హత్య చెయ్యాలని ప్రయత్నించాడు...'' కోపంగా మణిని చూస్తూ అన్నాడు స్వామినాథన్.

మణి తప్పు చేసినవాడిలా తల దించుకొని వున్నాడు. ''అవును! నేను పొరపాటే చేశాను. నాకు అక్కడకు వెళ్ళగానే బుర్రలోకి కొత్త ఆలోచన వచ్చింది. నేను ఇడియట్‌ననే ఒప్పుకుంటాను. అయినా ఆ బొంగరం వాడి చేతికి ఇవ్వకుండా వుంటే వాడు నావెంట వచ్చేవాడు. ఈపాటికి షెడ్డులో మూసిపెట్టేవాళ్ళం'' అన్నాడు మణి పశ్చాత్తాపపడుతూ.

''ఇంకా నొప్పిగానే ఉంది'' మెడ చూపిస్తూ స్వామినాథన్ అన్నాడు. కిలాచేరీ నుంచి వచ్చాక మూడు గంటలు సముదాయించాడు స్వామిని మణి. అదంతా తను వాడ్ని తీసుకురావడానికి వేసిన ఎత్తేనని చెప్పాడు.

''నువ్వంత మొరటుగా స్వామిని గాయపరచి వుండకూడదు,'' అన్నాడు రాజం.

''అయ్యల్లారా మీకో నమస్కారం. తల కిందకు పెట్టి కాళ్ళు పైకెత్తి పది నిముషాలు నిల్చోమంటే నిల్చుంటాను. మీరు ఏ శిక్ష విధించినా సరే! బండివాడి కొడుక్కి మేమిద్దరం శత్రువులమని నమ్మించడానికి అలా చేశాను'' అన్నాడు మణి తన అపరాధాన్ని అంగీకరిస్తూ.

బండి వస్తున్న శబ్దం వినిపించింది. ఒంటెద్దు బండి వస్తూ కనిపించింది. బండి వంతెన దగ్గరగా వచ్చింది. ముగ్గురు మిత్రులూ బండికి అడ్డంగా నిల్చున్నారు. ఎద్దును విడిచిపెట్టు,'' అరిచారు గట్టిగా.

బండివాడు చిన్న కుర్రవాడు. పల్లెటూరివాడు.

''ఒరే ఫూల్! బండి ఆపరా!'' అరిచాడు రాజం.

''ఆపకపోతే వాడ్ని అరెస్టు చేద్దాం. బండిని స్వాధీనం చేసుకుందాం'' అన్నాడు స్వామినాథన్.

''అబ్బాయిలూ! నన్నెందుకు అడ్డగిస్తున్నారు?''

''నోరు ముయ్‌రా!'' అని మణి బండిచుట్టూ తిరిగి దీక్షగా చక్రాలను తనిఖీ చేస్తున్నాడు. బండి కిందకు దూరి అడుగు భాగాన్ని పరిశీలించాడు. ''ఏయ్! దిగరా కిందకు,'' అన్నాడు.

''అబ్బాయిలూ! నేను త్వరగా వెళ్ళిపోవాలి.''

''ఏయ్! ఎవరనుకుంటున్నావ్ మమ్మల్ని? అబ్బాయిలూ అంటున్నావ్?'' రాజం అధికార దర్పంతో చూస్తూ అన్నాడు.

''మేము సర్కారు పోలీసులం తెలుసా? నీలాంటి దొంగవెధవల్ని పట్టుకోవడమే మా పని'' స్వామినాథన్ వంతపలికాడు.

''మరో మాట మాట్లాడావా కాల్చి పారేస్తాను'' బెదిరించాడు రాజం.

బండి కుర్రవాడు వాళ్ళ మాటల్ని పూర్తిగా నమ్మలేదు. కాని ఏదో కొంత సత్యం లేకపోలేదు అనిపించింది.

''వంతెన బలహీనంగా వుంది. పాస్ చూపిస్తేనేగాని వెళ్ళడానికి అనుమతి ఇవ్వం'' అన్నాడు మణి బండి చక్రం పట్టుకొని.

''సార్! సార్! దయవుంచి నన్ను వెళ్ళనివ్వండి'' దీనంగా అడిగాడు బండివాడు.

''నోరు ముయ్!'' రాజం ఆజ్ఞాపించాడు.

స్వామినాథన్ ఎద్దును పరిశీలించాడు. ''ఇలా రారా!'' బండివాడిని పిలిచాడు. బండివాడు బండి దిగడానికి ఇష్టపడలేదు.

మణి ఆ కుర్రాణ్ణి బండిమీదనుంచి కిందకు లాగి స్వామినాథన్ ముందుకు తోచాడు.

''ఏరా? ఎద్దును ఎందుకు కడగలేదు'' అడిగాడు స్వామినాథన్.

''కడిగాను సార్'' బండివాడు అన్నాడు భయపడుతూ.

''మరి ఈ మరకేమిటి?''

''అది మరక కాదు సార్. మచ్చ. అది పుట్టుకతోనే వచ్చిన మచ్చ'' అన్నాడు బండివాడు.

''ఇది పుట్టుకతో వచ్చిన మచ్చా? ఎవరికిరా పాఠాలు నేర్పిస్తున్నావ్?'' అంటూ స్వామినాథన్ కాలెత్తాడు తన్నడానికి.

మరు క్షణమే ముగ్గురూ మెత్తబడిపోయారు.

''ఈ రాస్కెల్‌కు పాసు ఇచ్చి పంపెయ్యండి'' అన్నాడు రాజం, జాలి చూపిస్తున్న ధోరణిలో. వెంటనే స్వామినాథన్ జేబులోనుంచి చిన్న నోటుబుక్కు తీశాడు. ఈ నోటుబుక్కు ఎప్పుడూ జేబులో వుంచుకోవడం ఒక నియమంగా పెట్టుకున్నాడు. ప్రతిరోజూ ఎన్నో విషయాలు- ఆ రోజు ఎన్ని

సైకిళ్ళు రోడ్డుమీద పరిగెత్తాయి, ఎంతమంది చెప్పులు లేకుండా నడిచారు. ఎంతమంది చెప్పులతో నడిచారు వగైరా విషయాలు రాస్తూ వుంటాడు. పెన్సిల్‌కూడా జేబులోనుంచి తీశాడు. నోట్ చేసుకోవడానికి రెడీగా వున్నాడు.

మణి ఎద్దు పగ్గాలు పట్టుకొని నిల్చున్నాడు. బండిని తిప్పి వచ్చిన వైపుకే ఎద్దు ముఖం పెట్టాడు. ''సర్! సర్! నేను ఇటు వెళ్ళాలి సార్! అటునుంచే వచ్చాను'' బండివాడు లబ లబలాడాడు. భయపడకు. ఈ బండి ఈ హద్దుదగ్గరే నిలబడివుండాలి'' అన్నాడు మణి.

''నేను ముందుకెళ్ళాలి'' సార్ మళ్ళీ అన్నాడు బండివాడు.

''బండిని తిప్పుకొని వెళ్ళొచ్చులే.''

''నీ పేరేమిటి?'' రాజం ప్రశ్నించాడు.

''కరుప్పన్.''

స్వామినాథన్ రాసుకొన్నాడు.

''నీ వయసెంత?''

''తెలియదు సార్!''

''తెలియదా! స్వామీ! వందని రాయి'' అన్నాడు రాజం.

''సార్! సార్! నాకు వందేళ్ళు కాదు సార్.''

''నోరు మూసుకో. నోరు తెరిచావా కాల్చిపారేస్తాను. నీకు వందేళ్ళు. నీ ఎద్దు పేరేమిటి?'' రాజం అడిగాడు.

''తెలియదు సార్.''

''కరుప్పన్. రాయరా స్వామినాథన్.''

స్వామినాథన్ ఎద్దు పేరు కరుప్పన్ అని రాశాడు.

''సార్! అది నా పేరు.''

వాడి మాట ఎవరూ వినిపించుకోలేదు.

''ఎక్కడికి వెళ్తున్నావ్?''

''సెత్తూర్.''

స్వామినాథన్ రాసుకున్నాడు.

''అక్కడెన్ని రోజులు ఉంటావ్?''

''అది మా ఊరే సార్.''

''ఇక్కడికెందుకొచ్చావ్ మరి?''

''మా యజమాని రైల్వే స్టేషనుకు పది కొబ్బరికాయల బస్తాలు పంపించాడు.'' స్వామినాథన్ అన్ని వివరాలు రాశాడు. నోటుబుక్కులో

నుంచి ఆ పేపరు చింపి తీశాడు. ముగ్గురూ సంతకం చేసి, బండివాడికి యిచ్చి వెళ్ళడానికి అనుమతినిచ్చారు.

## 2

మే రెండో వారం నుంచి కోర్టులకు శెలవులు. స్వామినాథన్ తండ్రి ఇంటిదగ్గరే వుంటున్నాడు రెండు రోజులుగా. అది స్వామినాథన్ బొత్తిగా నచ్చలేదు. మణి, రాజంతో కలిసి, మధ్యాహ్నంపూట ఊళ్ళో చాంద్రాయణం తిరిగే అవకాశం వుండదని భయపడుతున్నాడు. అదే జరిగింది. మూడోరోజు చిన్నగా బయటికి వెళ్తున్న కొడుకును వెనక్కు పిలిచాడు తండ్రి, "స్వామీ ఇలారా!"

తండ్రి ధోవతి కట్టుకొని బనీను వేసుకొని, వరండాలో నిల్చుని వున్నాడు. ఆ దుస్తుల్లో తండ్రిని చూడడం స్వామికి ఇష్టం వుండదు. కారణం ఆ దుస్తుల్లో వున్నాడంటే, ఇక బయటికి వెళ్ళే ప్రసక్తే లేదని తెలుసు.

"ఎక్కడికిరా వెళ్తున్నావ్?"

"ఎక్కడికీ లేదు."

"నిన్న మధ్యాహ్నం ఎక్కడికి వెళ్ళావ్?"

"ఇక్కడే వున్నా."

"అబద్ధం! నిన్న నువ్విక్కడ లేవు. ఇవ్వాళ బయట వెళ్ళడానికి వీల్లేదు."

"ఎండలో రోజూ బలాదూర్ తిరుగుతున్నాడు. వడదెబ్బ కొట్టి ఎప్పుడో చస్తాడు" అప్పుడే అక్కడికి వచ్చిన తల్లి అన్నది. "నీ గదిలోకి పద" అని గదికేసి దారితీశాడు. స్వామి తండ్రిని అనుసరించాడు.

ఆయన పుస్తకాల మీద వున్న దుమ్మును చేత్తో తాకి చూశాడు. వాటిమీద సాలీడు గూడు కడ్తున్నది. "ఎంత కాలమైందిరా పుస్తకాలు ముట్టుకొని?" కొడుకుని చూస్తూ అడిగాడు.

తండ్రి చాలా అన్యాయంగా మాట్లాడుతున్నట్లనిపించింది.

"శెలవుల్లో కూడా చదవాలా?"

"ఏమిట్రోయ్, బి.ఏ. పాసయి పోయాననుకుంటున్నావా?"

"అదికాదు నాన్నా. పరీక్షలు అయిపోయాక, శెలవులిచ్చాక కూడా చదవాలా అని...!" నసిగాడు.

"అదేం ప్రశ్న? చదవాలి."

"పరీక్షల ముందు ఏమన్నావ్? బాగా చదివి పరీక్షలు రాయి. ఆ తర్వాత నీ ఇష్టం వచ్చినట్టు తిరగొచ్చు. శెలవులు వచ్చేస్తాయి అన్నావు. రాజం కూడా శెలవుల్లో చదవడం లేదు." ఆమాట అనగానే రాజం చెప్పిన విషయం

గుర్తొచ్చింది. వాడికీ వచ్చినట్టు రోజుకు మూడు గంటలు ప్రైవేటు మాస్టారు ముందు కూర్చోవాల్సి వస్తుందట.

స్వామినాథన్ తండ్రి కొడుకు మాటల్ని పట్టించుకోలేదు. ''పుస్తకాలు దులుపు. బల్లమీది వస్తువులన్నీ శుభ్రంగా తుడిచి సర్దుకో.''

స్వామినాథన్ దుమ్ము దులిపే నెపంతో పుస్తకాల అట్టలమీద అరచేత్తో తప తప బాదుతూ తన కోపాన్ని వ్యక్తం చేస్తున్నాడు. సాలీడును మాత్రం జాగ్రత్తగా పట్టుకొని కిటికీ అంచుమీద పెట్టాడు. దాని కదలికల్ని ముగ్ధుడై చూస్తున్నాడు. ''ఎంతసేపురా? దాన్ని బయట పారెయ్!'' తండ్రి అరిచాడు.''సాలీడును బయట పారెయ్యడం ఏమిటి? పెంచుకోవాలిగాని!'' అనుకొన్నాడు. తండ్రి చూడకుండా దాన్ని జేబులో వేసుకొని, వట్టి చేతిని కిటికీ బయటపెట్టి సాలీడును పారేస్తున్నట్టు విదిలించాడు.

''చూడ్రా! ఈ ఇంగ్లీషు పుస్తకం చూడు ఎంత దుమ్ము కొట్టుకు పోయిందో?అలా కాదు. బట్ట తీసుకొని తుడువు.''

''ఏదీ ఇక్కడ లేదుగా?''

''ఎక్కడుందో చూడు.''

స్వామినాథన్‌కు ఊపిరి పీల్చుకోవడానికి సమయం దొరికినట్టుగా అనిపించింది. లోపలకు పరుగు తీశాడు. బామ్మ దగ్గరకు వెళ్ళాడు.

''బామ్మా! చిన్న బట్టముక్క వుంటే ఇవ్వవూ?''

''గుడ్డముక్కా? నా దగ్గరెక్కడుందిరా?''

''నీ దగ్గర లేకపోతే నా దగ్గర వుంటుందా మరి? అయినా శెలవుల్లో చదవాలంటారు. అటువంటప్పుడు సెలవులివ్వడం ఎందుకో?'' గొణుక్కున్నాడు.

''ఏమిట్రా స్వామీ! ఏం జరిగింది?''

స్వామికి బామ్మ సానుభూతి చూరగొనే అవకాశం దొరికింది.

''నువ్వే చెప్పు బామ్మా! రాజం, మణీ నన్ను గురించి ఏమనుకుంటారో కాస్త ఆలోచించు. వస్తానని చెప్పాను. వెళ్ళకపోతే ఏం బాగుంటుంది? నేనేమో ఇక్కడ పిచ్చివాడిలా అయిపోయాను. నాన్నకు పనిలేకపోతే పడుకొని నిద్రపోవచ్చుగా?నా వెంటబడడం ఎందుకూ?'' ఏడుపు గొంతుతో అన్నాడు.

''ఏరా స్వామీ! ఎంతసేపు?'' తండ్రికేకపెట్టాడు.

''బామ్మ దగ్గర లేదంట.'' గట్టిగా అరిచి చెప్పాడు స్వామి. ''అమ్మను అడిగితెస్తాను'' మళ్ళీ అరిచాడు. తల్లిదగ్గరకు వెళ్ళాడు. తల్లి గోడకు ఆనుకొని చాపమీద కూర్చుని ఉంది. ఒళ్ళో బేబీ నిద్రపోతున్నాడు. అంతకు ముందు

తండ్రితో తనమీద చెప్పిన చాడీ గుర్తొచ్చింది. ''అమ్మా! చాలా మంచిదానివి. నావెంట ఎందుకు పడ్తావ్?'' అన్నాడు.

''ఏమిట్రా?'' తల్లికి కొడుకు ఏమంటున్నాడో అర్థం కాలేదు. ఆమెకు తను కొడుకుమీద భర్తకు చేసిన ఫిర్యాదుకూడా గుర్తులేదు.

''నాన్నకు నామీద చాడీలు చెప్తావా? నేను నిన్నేం చేసాను. ఎందుకు చెప్పాలి?'' సాగదీసి చాలాసేపు పేచీ పెట్టుకోవాలని వుంది. కాని తండ్రి తనకోసం ఎదురుచూస్తూ నిల్చున్నాడనే విషయం గుర్తొచ్చింది.

''నాకో బట్టముక్క కావాలి.'' అసలు విషయానికి వచ్చాడు.

''బట్ట ముక్కేమిటి? ఎందుకూ?''

''ఏమో నాకేం తెలుసు? నాన్న తెమ్మన్నాడు. ఆ పుస్తకాలు తుడుస్తూ కూర్చోవాలిట. ఆహా! నా శెలవులు ఎంత బాగా గడుస్తున్నాయో!''

''నాదగ్గర లేదు.''

''నీదగ్గర లేదా?'' బేబీ కిందవున్న బట్టమీద స్వామి చూపులు నిల్చాయి. ఒక్కసారిగా బేబీని పక్కకు దొర్లించి, బట్ట లాక్కుని తుర్రున పరుగు తీశాడు. తిక్క కుదిరింది. ఆ బేబీగాడ్ని ఏడిపించాను. తల్లిమీద కోపం తీర్చుకోగలిగినందుకు స్వామి సంతోషించాడు.

ఆ సంతోషంతో బల్లమీది వస్తువులన్నీ కింద పెట్టి, ఒక్కొక్కటే శుభ్రంచేసి, మళ్ళీ బల్లమీద పొందికగా పెడుతున్నాడు. తండ్రి కొడుకు చేస్తున్న పని చూస్తూ ''అలాగేనా పుస్తకాలు పెట్టుకోవాల్సింది. పెద్ద పుస్తకాలు కింద పెట్టాలి. చిన్న పుస్తకాలు వాటిపైన పెట్టుకోవాలి'' అన్నాడు. ''అదిగో ఆ అట్లాసు అన్నిటికంటే కింద పెట్టు'' మళ్ళీ అన్నాడు. అంతలో తల్లి అక్కడికి వచ్చి, భర్తకు స్వామిమీద పిర్యాదు చేసింది. ''వాడేం చేశాడో చూడండి. పిల్లవాడి కిందవున్న బట్టను లాక్కొచ్చాడు. మరీ అల్లరి ఎక్కువైంది. స్కూలు ఎప్పుడు తెరుస్తారో, ఏమో?'' అతను భార్య మాటలు వినిపించుకో లేదు. స్వామి చేస్తున్న పనిని ప్రశంసాపూర్వకంగా చూస్తూ నిల్చున్నాడు.

అర్థగంట తర్వాత స్వామి, తండ్రి గదిలో, ఆయనకెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. చేతిలో పలక, బలపం వున్నాయి. లెక్కల పుస్తకం తెరిచి ఒక లెక్క చెప్పి రాసుకోమన్నాడు.

''రాముడి దగ్గర పది మామిడి కాయలున్నాయి. వాటిని పదిహేను అణాలకు అమ్మాలనుకొన్నాడు. కృష్ణకు నాలుగు మామిడికాయలు కావాలి. ఎంత డబ్బు ఇవ్వాలి?'' లెక్క చెయ్యి అన్నాడు తండ్రి.

స్వామి లెక్కను కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తున్నాడు. ఒకటికి నాలుగుసార్లు చదివాడు. ప్రతిసారీ కొత్త సమాధానం వస్తోంది. తనొక భయంకరమైన ఉచ్చులో పడ్డట్టుగా అనిపించింది స్వామికి...

మామిడి పండ్లను తల్చుకున్నాడు. నోట్లో నీరు ఊరింది. పది పండ్లకు పదిహేను అణాలు ధర పెట్టడం ఏమిటి? వీడేం మనిషి? బహుశా ఈ రాముగాడు శంకర్‌లాంటి వాడే అయివుండాలి. అవును అంతే! లేకపోతే పది పండ్ల కోసం పదిహేను అణాలు సంపాదించాలనే పట్టుదల ఏమిటి? రాముగాడు శంకర్‌లాంటివాడైతే, కృష్ణబఠాణీగాడిలాంటివాడు అయివుండాలి. స్వామికి కృష్ణమీద బోలెడంత జాలి పుట్టుకొచ్చింది.

''చేశావా?'' చదువుతున్న పేపరు పైనుంచి తల ఎత్తి అడిగాడు తండ్రి.

''నాన్నా! ఆ కాయలు పండినవా లేక పచ్చివా?''

తండ్రికి నవ్వు వచ్చింది. ''ముందు లెక్క చెయ్యి. ఆ తరువాత అవి పండ్లో, పచ్చి కాయలో చెప్తాను'' అన్నాడు.

స్వామి అయోమయంలో పడిపోయాడు. పండిన పళ్ళు అమ్మతాడో, పచ్చి కాయలు అమ్మతాడో ముందు తెలియకుండా, ఆ లెక్క చెయ్యడం ఎలా? పచ్చి కాయలకు పదిహేను అణాలు తీసుకోవడం అన్యాయం. అలా చేసేవాళ్ళంటే స్వామినాథన్‌కు ఇష్టంలేదు. అలాంటివాళ్ళంటే అతడికి అసహ్యం..

''నాన్నా! నాకు ఈ లెక్క చెయ్యడం రావడం లేదు'' పలక అవతలికి నెట్టూ అనేసాడు స్వామి.

''నీ సంగతి నాకు అర్థం కావడం లేదు. ఇంత తేలిక లెక్క చెయ్య లేకపోవడం ఏమిటి?'' తండ్రివిసుక్కున్నాడు.

''ఇలాంటి లెక్కలు మాకు స్కూల్లో నేర్పించలేదు.''

''ఏదీ, ఆ పలక ఇలా తీసుకురా. దాన్ని ఎలా చెయ్యాలో చెప్తాను.'' స్వామినాథన్‌పలక ఇచ్చి ఏదో అద్భుతం జరగబోతుందనుకున్నాడు. ఆయన ఓ క్షణం లెక్కకేసి చూసి ''మామిడి పండ్ల ధర ఎంత?'' అనిఅడిగాడు.

''నాకు తెలియదు.''

''ఏమిట్రా వట్టి చవటలా వున్నావ్! ఇలారా. లెక్క చదువు. రాము పది పళ్ళకు ఎన్ని అణాలు సంపాదించాలనుకున్నాడు?''

''పదిహేను అణాలు'' స్వామినాథన్ మనసులో అనుకున్నాడు. కాని ఇది ధరగా ఎలా అనుకోవడం. రాము పేరాశతో పది పళ్ళకు పదిహేను అణాలు సంపాదించుకోవాలనుకోవచ్చు. అంతమాత్రాన వాటి ధర అదేనని ఎలా

అనుకోవడం? పండిన పళ్ళయితే పోనియ్‌లే అనుకోవచ్చు. ఒకవేళ అవి పచ్చి కాయలైతే?

''పళ్ళకు రాము ఎంత సంపాదించాలనుకున్నాడు?'' రెట్టించాడుతండ్రి.

''పదిహేను అణాలు'' అన్నాడు స్వామినాథన్ ఆ ధర న్యాయమైనది కాదనుకుంటూనే.

''కృష్ణకు ఎన్ని మామిడి పళ్ళు కావాలి?''

''నాలుగు.''

''మరి నాలుగు పళ్ళకు ఎంత ఇవ్వాలి?''

నాన్నకు ఇవ్వాళ ఏమైంది. తన వెంట ఇలా పడ్డాడేం? ఆ కృష్ణగాడు నాలుగు పళ్ళకు ఎంత ఇస్తానంటాడో మరి! ఈ విషయం తనకెలా తెలుస్తుంది?

''నిన్ను చూస్తుంటే నాలుగు తగిలించాలనిపిస్తోంది. అసలు ఇవ్వాళ నీకేమైందిరా? నీ తలకాయలో ఏముందో నాకు అర్థం కావడం లేదు. పది మామిడి పండ్ల ఖరీదు పదిహేను అణాలైతే, ఒక పండు ఖరీదు ఎంత? చెప్పు? ఎంత?''స్వామినాథన్ చెవు్వ పట్టుకొని మెలిపెట్టాడు తండ్రి. స్వామి నోరు తెరవలేదు. అది కూడికో, భాగారమో, హెచ్చవేతో అర్థం అయి చావడం లేదు. తండ్రి చెవు్వ వదలలేదు. ''ఇవ్వాళ నిన్ను వదలను. ఒక్క పండు ధర ఎంతో చెప్పు.''స్వామినాథన్ కళ్ళు మిటకరించి చూచాడు. ఏమిటో అంత అర్జంటు? ఇప్పుడు వాటి ఖరీదు తెలియకపోతేనేం? అంత తెలుసుకోవాలనుకొంటే మార్కెట్‌కు వెళ్ళి తెలుసుకోవచ్చుగా? తనను సతాయించడం ఎందుకు? ఇదసలు రాము కృష్ణకూ సంబంధించిన వ్యవహారం. స్వామికి వాళ్ళమీద కోపం వచ్చింది. మనసులోనే కసితీరా తిట్టుకున్నాడు.

తండ్రికి దిగిపోక తప్పలేదు.

''ఒక మామిడి పండు ధర తెలుసుకోవాలంటే, ఒకటి బై పది ఇన్‌టూ పదిహేను. ఇప్పుడు లెక్క చెయ్యి'' అన్నాడుతండ్రి.

''ఆ పలక ఇలా ఇవ్వండి, చెప్తాను'' అన్నాడుస్వామి.

పలక తీసుకొని పదిహేను నిముషాలు లెక్కతో కుస్తీ పట్టాడు. చివరకు తలెత్తి''ఒక పండు ధర అణా పైన కొన్ని పైసలు'' అన్నాడు. తండ్రిచేత మళ్ళీ తిట్లు తప్పవు అనుకొన్నాడు.

''వెరీ గుడ్. ఎన్ని పైసలో కూడా తెలుసుకో.'' మృదువుగా చెప్పాడు.

స్వామినాథన్ బుర్ర బద్దలు కొట్టుకొని చివరకు ''కృష్ణ ఆరు అణాలు రాముకు ఇవ్వాలి'' అని బావురుమని ఏడ్చాడు.

## 3

స్వామినాథన్ తండ్రి సాయంత్రం ఐదు గంటలకు క్లబ్బుకు ప్రయాణం అయ్యాడు. వాడిన ముఖంతో గుంజకు చేరబడి చూస్తున్న కొడుకుని చూడగానే జాలివేసింది. మధ్యాహ్నంనుంచి లెక్కలు చేయించి బాధపెట్టినట్టున్నానని అనుకున్నాడు."ఏరా క్లబ్బుకు వస్తావా?" అప్యాయంగా అడిగాడు . స్వామినాథన్ తుర్రున లోపలకు వెళ్ళాడు. తండ్రి కొడుకు అలా వెళ్ళాడానికి కారణం తెలుసుకొని, నిల్చున్నాడు. కొద్ది నిముషాల్లో స్వామినాథన్ కోటూ, టోపీ పెట్టుకొని వచ్చాడు. "ఏమిట్రా ఆ వేషం నువ్వూ వ్వనూ!" అన్నాడు తండ్రి. స్వామినాథన్ మెలికలు తిరిగిపోయాడు ఇబ్బందిగా.

''లక్ష్మి'' భార్యను కేకవేశాడు. ఆమె వచ్చింది. ''వాడికి శుభ్రమైన బట్టలు ఇవ్వు. ఆ పెట్టెలో చూడు'' అన్నాడు. ''పోనిద్దురూ, బాగానే వున్నాడు. ఆ పెట్టె తియ్యాలంటే తాళం వెదకాలి. బేబీకి పాలు కలుపుతున్నాను.''

''వాడి దుస్తులన్నీ ఏమయ్యాయి?''

''దుస్తులన్నీనా? అసలు ఎన్ని వున్నాయేం? ఎప్పుడు తెచ్చారు? పోయిన వేసవికాలం తర్వాత గజం గుడ్డముక్క తెచ్చారా/''

''ఏమిటి మాట్లాడుతున్నావ్? ఆ మధ్య తెచ్చిన ట్వీల్లు ఏమైంది?''అన్నాడు. వచ్చే బుధవారం పిల్లవాడ్ని బజారుకు తీసుకెళ్ళి బట్టలు కొనాలని కూడా అనుకున్నాడు. తల్లి సమాధానం స్వామినాథన్‌కు సంతోషం కలిగించింది. లేకపోతే తను లోపలకు వెళ్ళాల్సి వచ్చేది. బట్టలు తియ్యడం ఆలస్యం అయితే నాన్న వెళ్ళిపోయేవాడు అనుకున్నాడు.

ఇంటిముందు ఒక కారు వచ్చి ఆగింది. స్వామినాథన్ తండ్రివెంట వీధిలోకి నడిచాడు. కారు చక్రం (స్టీరింగ్) ముందు కూర్చున్న పెద్దమనిషి తండ్రిని విష్ చెయ్యడం చూశాడు. తనను కారు ఎక్కనివ్వడేమోననే అనుమానం వచ్చింది. భయం వేసింది. ''కొడుకును తీసుకొస్తున్నావా క్లబ్బుకు శ్రీనివాసన్!''నవ్వుతూ అతను అనడంతో స్వామినాథన్ భయం తీరింది. స్వామినాథన్‌ను వెనక సీట్లో కూర్చోమని, తను స్నేహితుడి పక్కన ముందు సీట్లో కూర్చున్నాడు శ్రీనివాసన్ చేతిలో టెన్నిస్ రాకెట్ పట్టుకొని.

కారు వేగంగా పోతోంది. స్వామినాథన్‌కు చాలా ఉషారుగా వుంది. ఇప్పుడు తన స్నేహితులు చూడాలని వుంది. కారు ఒక గేటు దగ్గర ఆగింది. అక్కడ ఇంకా దాదాపు ఓ అరడజను కార్లు ఆగివున్నాయి.

స్వామినాథన్ తండ్రి టెన్నిస్ ఆడడం చూస్తూ కూర్చున్నాడు. చాలా బాగా ఆడుతున్నాడనుకొన్నాడు. తన తండ్రి బంతి కొడితే ఎదుటివాడు

అందుకోలేక పోవడం ఉత్సాహంగా చూస్తున్నాడు. పిక్కర్ చేసే పని అన్నిటికంటే కష్టమైన పనిగా అవిపించింది.

అక్కడ తను అలా కూర్చుని చూడడం స్వామినాథన్‌కు చాలా గొప్పగా ఉంది. తెల్లవారి స్నేహితులకు చెప్పడానికి చాలా విషయాలు తెలుసుకోవాలనుకొన్నాడు. లేచి తండ్రికి అల్లంత దూరంలో నిల్చున్నాడు. ఖాకీ డ్రెస్సులో వున్న కుర్రాడు తనకు అక్కడ నిల్చోవడానికి అభ్యంతరం చెబుతాడేమోనని భయపడ్డాడు. కాని వాడు బంతులు తియ్యడం, వాటిని మళ్ళీ ఆడేవాళ్ళకేసి విసరడంలో నిమగ్నమై వున్నాడు. అక్కడ్నుంచి తండ్రి ఆట బాగా కనిపిస్తోంది. తండ్రి బంతి కొట్టినప్పుడల్లా, ఆ శబ్దం అతని చెవులకు మధురంగా వినిపిస్తోంది.

స్వామినాథన్ కళ్ళు తిప్పి ఖాకీ డ్రెస్సులో వున్న కుర్రాణ్ణి పరిశీలనగా చూశాడు. వెంటనే ముఖ కవళికలు మారిపోయాయి. తను చూస్తున్నది నిజమో కాదో అర్థం కావడం లేదు. వాడు బండివాడి కొడుకు. ఖాకీ డ్రెస్సులో కొంచెం మార్పు కనిపిస్తోంది. వాడు తల తిప్పి స్వామినాథన్ చూశాడు. పళ్ళు ఇకిలించి, జేబులోనుంచి చిన్న చాకు తీశాడు. స్వామికి చూపించాడు. పై ప్రాణాలు పైనే పోయినట్టయింది. గబుక్కున వెనక్కు వచ్చి, తను మొదట కూర్చున్న చోట కూర్చున్నాడు. అదే భయంలేని చోటు అనుకున్నాడు.

ఆట పూర్తి అయింది. స్వామి తండ్రి భవనంకేసి నడుస్తున్నాడు. స్వామి తండ్రి వెనక నడవడానికి భయపడ్డాడు. వెనకనుంచి వచ్చి వాడు కత్తితో పొడిస్తే? అందుకే ముందు నడవడానికి ప్రయత్నిస్తున్నాడు.

''స్వామీ! ముందు నడవకురా. నా కాళ్ళకు అడ్డం పడ్తున్నావ్'' అన్నాడు తండ్రి. అయిష్టంగానే తండ్రి చెప్పినట్టు చేశాడు. పక్కలకూ వెనక్కూ చూస్తూ నడుస్తున్నాడు. వంగి, బాగా పదునుగా వున్న రాయి ఒకటి చేతిలోకి తీసుకున్నాడు ఎందుకైనా మంచిదని. టెన్నిస్ కోర్టుకూ, భవనానికీ మధ్య దూరం పన్నెండు గజాలు. అది స్వామికి మైలున్నర దూరంలా తోచింది.

పేకాట గదిలో తండ్రి పక్కన కుర్చీలో కూర్చున్నాకగాని మనసు తేలిక పడలేదు. తండ్రి పేకముక్కలు కలుపుతున్నాడు. అందరికీ పంచుతున్నాడు. బల్ల చుట్టూ చాలామంది ఉన్నారు. వాళ్ళ ఆట చూస్తూ కూర్చున్నాడు. కాని బండివాడి కొడుకు రూపం కళ్ళముందు మెదుల్తూనే ఉంది. అయినా నిర్భయంగా కూర్చున్నాడు. చాలాసేపు గడిచిపోయింది. కిటికీలోనుంచి బయటికి చూశాడు. బయట అంతా చీకటిగా వుంది. చీకటిపడిపోయింది. వాడు చీకట్లో పొంచివుండి తనమీద...

ఆట ఆగిపోయింది. తండ్రి లేచి నిల్చున్నాడు. స్వామి కూడా లేచి నిల్చున్నాడు. తండ్రికీ అతని స్నేహితునికీ మధ్య నడుస్తున్నాడు. నడక సరిగా కుదరడం లేదు. కాళ్ళు వంకరటింకరగా పడ్తున్నాయి. గుండె దడ దడలాడుతోంది. ఆ చీకట్లో ఏమైనా జరగవచ్చు. వాడు-అదే ఆ బండివాడి కొడుకు, ఈ లోపల ఇంటికి వెళ్ళి, స్నేహితులతో వచ్చి దారి కాస్తున్నాడేమో? వీళ్ళతోపాటు నడుస్తూ తను కారువరకూ చేరగలడా? నాన్నతో చెప్పేస్తే? అదే మంచిది.

''నాన్నా!''

''ఏమిట్రా స్వామీ?''

అంతలోకే మనసు మార్చుకున్నాడు. బండివాడి కొడుకు గురించి చెప్తే చాలా విషయాలు బయటికి వస్తాయి. ఇంకేమైనా వుందా?

''ఏం బాబూ! ఏం కావాలి?''

''మనం ఇంటికి వెళ్తున్నామా?''

''అవును!''

''నడిచా?''

''కాదు కార్లో. గేటుదగ్గర వుందిగా?''

కారు దగ్గరకు రాగానే స్వామినాథన్ ముందుగా వెనక సీట్లోకి ఎక్కి మధ్యలో కూర్చున్నాడు. ఇంకా కారు స్టార్ట్ చెయ్యడేం? తను ఒక్కడే వెనక సీట్లో. తండ్రి చాలా దూరంలో కూర్చుని వున్నాడు. వాడు ఒక్కసారిగా తనవాళ్లతో వచ్చి, బయటికి లాగి పొడిచి పారిపోయే అవకాశం వుంది.

కారు కదిలింది. ఇంజను మోత స్వామినాథన్‌కు ఊరట కలిగించింది. కారు రోడ్డు ఎక్కింది. వేగంగా పోయింది. స్వామినాథన్ వంగి ధోవతి అంచుతో ముఖంమీది చెమట తుడుచుకున్నాడు.

## అధ్యాయం 12

# పగిలిన అద్దాలు

### 1

అది ఆగస్టు 15, 1930. గౌరీశంకర్ అరెస్టును నిరసిస్తూ వేలకొద్దీ మాల్గుడి జనం సరయు నది ఒడ్డున చేరారు. గౌరీశంకర్ బొంబాయిలో పేరుగల రాజకీయ నాయకుడు. ఖద్దరు ధరించిన ఒక వ్యక్తి ప్లాట్‌ఫారంమీద నిల్చుని వున్నాడు. అతడ్ని చూస్తుంటే దృఢసంకల్పం గల వ్యక్తిలా కనిపిస్తున్నాడు. ఆయన కంచు కంఠంతో ప్రజలను ఉద్దేశించి మాట్లాడుతున్నాడు. గౌరీశంకర్ గొప్పతనాన్ని కీర్తిస్తున్నాడు. ఆ తర్వాత జనాన్ని ఉద్దేశించి "ఈ రోజు మనం బానిసలం. ఏనాడూ మనం ఇంత బానిస బతుకు బతకలేదు. ఒకసారి మన పూర్వుల్ని గుర్తు చేసుకుందాం. రామాయణ, మహాభారత కాలాలనాటి మన దేశ ఔన్నత్యాన్ని మనం ఈనాడు మర్చిపోయాం. ప్రపంచానికి, కాళిదాసు, బుద్ధుడు, శంకరుడు వంటి మహోన్నత మానవుల్ని ప్రసాదించిన దేశం మనది. ఇంగ్లీషువాళ్ళు పచ్చి మాంసం తింటూ, నగ్నంగా అరణ్యాలలో మృగాల్లా బ్రతుకుతున్న కాలంలోనే మన నాగరికత ఉన్నత శిఖరాలమీద అధిష్ఠించి వున్నది. ఈనాడు మనం ఎలా వున్నాం?" కొద్ది క్షణాలు మౌనంగా వుండి మళ్ళీ అందుకొన్నాడు. "మనం ఈనాడు బానిసలకు బానిసలం." మణికిగాని స్వామినాథన్‌కుగాని ఈ ఉపన్యాసం అర్థం కాలేదు. ఐదు నిముషాల తర్వాత ఉపన్యాసకుడు చెప్పింది మాత్రం చెయ్యడం తేలిక అనిపించింది. "ఒకసారి ఆలోచించండి. మనం మూడు వందల ముప్పయ్ ఆరు మినియన్ల ప్రజలం. మన దేశం, (రష్యాను తొలగిస్తే) మొత్తం యూరోప్ అంత వుంది. ఇంగ్లాండు మన మద్రాసు ప్రెసిడెన్సీ కంటే పెద్దదేం కాదు. అక్కడ వున్న ఆ తెల్లవాళ్ళు గుప్పెడుమంది. దొంగవెధవలు! పైగా వాళ్ళు ఎన్నో వేల మైళ్ళ దూరంలో ఉన్నారు. అయినా మనం వాళ్ళ ముందు వినయంగా చేతులు కట్టుకొని నిల్చుంటున్నాం. మనం తప్పు చెయ్యలేదు. అయినా ఎందుకు పిరిగ్గా, పెంపుడు జంతువుల్లా వుంటున్నాం? ఈ బ్యూరోక్రసీ మనల్ని బీదవాళ్ళుగా, పిరికివాళ్ళుగా మార్చింది. మీరు ఎక్కువ ఏమీ చెయ్యక్కర్లేదు.

మీరందరూ ఇంగ్లాండు మీద ఉయ్యండి. ఇంగ్లండును ముంచెయ్యడానికి మనందరం ఊసే ఉమ్మి చాలు.

''గాంధీకీ జై!'' స్వామినాథన్ అనుకోకుండా అరిచాడు. మణి మోచేత్తో పొడిచి ''ఫూల్! నోరు మూసుకో,'' అన్నాడు.

''ఇది నిజమేనా?'' స్వామిఅడిగాడు.

''ఏమిటి?''

''అదే. ఉమ్మడం-అందులో ఇంగ్లాండు మునిగిపోవడం.''

''కావచ్చు. లేకపోతే ఆయన ఎందుకు అలా చెప్పాడంటావ్?'' మరి అయితే ఆ పని ఎందుకు చెయ్యరు? అదేమంత కష్టమైన పని?''

''ఇంగ్లీషువాళ్ళు మనల్ని కాల్చేస్తారు. వాళ్ళకు హృదయాలు లేవు.'' ఈ సమాధానం స్వామినాథన్‌కు సంతృప్తిని ఇచ్చింది. ఇంకా ఏదో అడగాలనుకున్నాడు. కాని వాళ్ళ పక్కన కూర్చున్న ఇద్దరు ముగ్గురు చిరాగ్గా వాళ్ళకేసి చూడడంతో ఆగిపోయాడు.

ఆ సాయంకాలం అంతా మణి, స్వామినాథన్ ఆ ఉపన్యాస ప్రభావంలోనే వుండిపోయారు. ఉపన్యాసకుడితో పాటు, మన రైతుల దుర్భర స్థితిమీద ఏడ్చారు. విదేశీ వస్తువులు బహిష్కరించాలని నిర్ణయించుకున్నారు. ముఖ్యంగా లాంకోషైర్, మాంచెస్టర్‌లలో తయారయే బట్టలు. ఒకనాడు చాలా ప్రసిద్ధికెక్కిన మన ఢాకా మస్లిన్ నేతగాళ్ళ చేతి బొటనవేళ్ళను నరికినవాళ్ళు తయారుచేసిన బట్టలు ధరించరాదనుకొన్నారు. నలభై గజాల ఢాకా మస్లిన్ ముక్కుపొడుం పెట్టెలో పట్టేదట. అలాంటి నిపుణుల వేళ్ళు తెగకొట్టిన వాళ్ళను కఠినంగా శిక్షించాలి. స్వామినాథన్ ఖద్దరు ధరించి వాళ్ళను శిక్షించాలనుకొన్నాడు. తన బట్టలకేసి చూసుకున్నాడు. ''మణీ! నేను కట్టుకొన్న బట్టలు ఏమిటో చెప్పగలవా ?'' అనిఅడిగాడు.

మణి, స్వామినాథన్ కోటు పరీక్షించాడు. ''ఇది లాంకషైర్ గుడ్డతో కుట్టిందే''అన్నాడు.

''నీకెలా తెలుసు?''

సమాధానంగా స్వామి ముఖంలోకి గుచ్చి చూశాడు.

''మరి నీ బట్టలు?'' స్వామిఅడిగాడు.

''ఖద్దరు. నేను ఆ దయ్యాలకు దమ్మిడీ ఇస్తాననుకున్నావా? లేదు. నానుంచి వాళ్ళు ఒక పైసా కూడా తీసుకోలేరు.''

స్వామినాథన్‌కు ఎన్నో సందేహాలు కలిగాయి. కాని బయటికి చెప్పలేదు. లాంకషైర్ బట్టల్లో వున్న తనను తాను నగ్నంగా వున్నట్టు అనిపించింది.

''భారత మాతాకీ జై! గాంధీజీకీ జై!'' జనంలోనుంచి ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా వినిపించాయి నినాదాలు. ఆ తర్వాత జాతీయ గీతం పాడారు. ఆ సాయంత్రం కార్యక్రమం విదేశీ వస్త్రాల దహనకాండతో ముగిసింది. అప్పటికే చీకటి పడింది. అప్పుడే మంట లేచింది. ఇద్దరు కుర్రాళ్ళు గాంధీ టోపీలు ధరించి, జనంలోకి వచ్చి వారిదగ్గర వున్న విదేశీ వస్తువుల్ని మంటలో వేయమని చెబుతున్నారు. టోపీలు, కోట్లూ, షర్టులూ వచ్చి మంటలో పడిపోతున్నాయి. అగ్నిజ్వాలలు పైపైకి నాలుకలు చాస్తూ లేస్తున్నాయి. గాలిలో బట్టలు కాలుతున్న వాసన, పొగ. ఆ ఎర్రటి వెలుగులో జనం నీడల్లా కదులుతున్నట్టు కనిపిస్తున్నారు. స్వామినాథన్ ఆనందంతో పులకించిపోయాడు. ''ఏం కుర్రాడా! మన దేశం శాశ్వతంగా బానిసత్వంలో వుండిపోవాలనుకుంటున్నావా?'' ఎవరో స్వామినాథన్‌ను అడిగారు.

''లేదు, లేదు'' అన్నాడు స్వామినాథన్.

''కాని నువ్వు విదేశీ టోపీ పెట్టుకున్నావ్?''

స్వామినాథన్ సిగ్గుతో ముడుచుకుపోయాడు.

''నేను గమనించలేదు,'' అంటూ టోపీ తీసి మంటల్లోకి విసిరాడు. తను కూడా దేశ విముక్తి కార్యక్రమంలో పాలుపంచుకున్నట్టుగా భావించాడు.

## 2

స్వామినాథన్ మర్నాడు ఉదయం కళ్ళు తెరిచి కిటికీలోంచి పడుతున్న ఉదయ కిరణాలను చూస్తున్నాడు. ఏదో దిగులుగా అనిపించింది. ఎందుకు దిగులుగా వుంది? అని తనకు తానే ప్రశ్నించుకున్నాడు. బహుశా స్కూలు వెళ్ళాలనేనేమో? హోమ్ వర్క్? కాదు. ఇవి రోజూ వుండేవే. ఆ రాత్రి దహనకాండకు సంబంధించిన దిగులు-తన టోపీని ఆమంటలోకి విసిరాడు. ఆ విషయం తన తండ్రికి తెలియదు.

స్కూలుకు టోపీ లేకుండా ఎలా వెళ్ళడం? తండ్రిని కొత్త టోపీ అడగడం సామాన్యమైన విషయం కాదు. స్కూలుకు టోపీ లేకుండా వెళ్ళడానికి వీల్లేదు.

అతడు టోపీ లేకుండా భగవంతుడిమీద భారంవేసి స్కూలుకు బయలుదేరాడు. అతడి అదృష్టం బాగుంది. స్కూలు ముందు పిల్లలు గుంపులు గుంపులుగా నిల్చుని అరుస్తున్నారు. భగవంతుడే ఈ విధంగా తనను రక్షింటాడనిపించింది స్వామినాథన్‌కు.

స్వామినాథన్ అడ్డంవున్న వాళ్ళను తోసుకుంటూ స్కూలు గేటుదగ్గరకు చేరాడు. ఒక థర్డ్‌ఫారం కుర్రాడు స్వామిని ''ఎక్కడికెళ్తున్నావ్?'' అన్నాడు. ఆ ప్రశ్నలో ఏదో కుట్ర వున్నట్టు తోచింది స్వామికి. ''ఎందుకు...ఇంకెక్కడికి...''

''ఈ రోజు స్కూలు లేదు'' అన్నాడు తనకు పరిచయం లేని ఆ కుర్రాడు.''భారతమాత ఒక ప్రియ పుత్రుడిని జైలుకు పంపించారు'' అన్నాడు మృదువుగా మళ్ళీ ఆ కుర్రాడు.

''నేను స్కూలుకు వెళ్ళను.'' టోపీ సమస్యింత తేలిగ్గా విడిపోయి నందుకు, అతడి మనసు తేలిక పడింది.

హెడ్‌మాస్టరూ, మిగతా టీచర్లూ ముందు వరండాలో నిలబడి ఉన్నారు. హెడ్‌మాస్టర్ విచారంగా కనిపిస్తున్నాడు. ఎబెనెజార్ చేతిలో బెత్తం పట్టుకొని ముందుకూ వెనక్కూ నడుస్తున్నాడు. హిస్టరీ టీచర్ డి. పిళ్లె పెదవుల మధ్య మీసాలు నములుతున్నాడు ఉద్రేకంతో. రోడ్డుమీద గుంపు పెరిగిపోయింది. అరుపులు కూడా ఎక్కువ అవుతున్నాయి. పదికి ఐదు నిముషాలు వుండగా మొదటి గంట మోగింది. గేటు దగ్గర వున్నవాళ్ళకు తప్ప ఆ గంట ఎవరికీ వినిపించలేదు. హెడ్‌మాస్టర్, టీచర్ల మధ్య ఏవో చర్చలు జరుగుతున్నాయి. చేతి గడియారం చూసుకుంటున్నప్పుడు హెడ్‌మాస్టర్ చెయ్యి వణకడం కనిపించింది. రెండో బెల్ కూడా మోగింది. ఆ రొదలో గంట మోత సరిగ్గా వినిపించలేదు. హెడ్‌మాస్టర్ టీచర్స్‌తో కలసి గేటుదగ్గరకు వచ్చాడు. జనంలో అరుపులు ఆగిపోయాయి.

పిల్లల్ని హెడ్‌మాస్టర్ స్కూలుకు రావల్సిందిగా కోరాడు. లేకపోతే కఠినంగా శిక్షించాల్సి వస్తుందని బెదిరించాడు. కాని ఆ బెదిరింపుల్ని ఎవరూ లక్ష్యపెట్టలేదు. టీచర్లు కూడా చెప్పి చూశారు. ప్రయోజనం శూన్యం. హెడ్‌మాస్టరూ, టీచర్లూ తిరిగి లోపలకు వెళ్ళిపోయారు. ''భారత మాతాకీ జై, గాంధీజీకి జై, గౌరీశంకర్‌కీ జై'' నినాదాలతో ఆ వాతావరణం ప్రతిధ్వనించింది.

రోడ్డున వెళ్ళే జనం కూడా విద్యార్థులతో వచ్చి కలిశారు. నినాదాలు చేశారు. దాదాపు అరడజను మంది నాయకుల్లా ప్రవర్తిస్తున్నారు. ''గుర్తుంచుకోండి మనం చేస్తున్నది హర్‌తాళ్ అని. ఈ రోజు మనకు దుర్దినం. మన విచారాన్నీ, బాధనూ మౌనంగా తెలియ పరచవలసిన రోజు.''

స్వామినాథన్ ఆ గుంపులో కనిపించని అణువు. మరో అణువుగాడు రాళ్ళు పోగుచేస్తున్నాడు. కిటికీల అద్దాలకేసి విసురుతున్నాడు. స్వామినాథన్ కూడా రాయి ఎత్తాడు. విసరబోయాడు. అప్పటికే డెబ్భయ్ శాతం అద్దాలు పగిలిపోయి ఉన్నాయి. హెడ్‌మాస్టర్ గది వెంటిలేటర్ అద్దం చెక్కు చెదరకుండా వుండడం చూసి ఆనందంతో గంతులేసినంత పని చేసాడు. గురి చూసి రాయి విసిరాడు. అద్దం పగిలిన చప్పుడు అద్దం పెంకులు కిందపడిన

శబ్దం. స్వామి ఆనందానికి అంతులేదు. ఏదో అద్భుతం జరిగినట్టుగా అనిపించింది.

పొట్టిగా, పీలగా వున్న వ్యక్తి ఒకడు పరుగు పరుగుగా వచ్చి, బోర్డు హైస్కూలు నడుస్తూ ఉన్నదనే వార్త అందించాడు. అది మార్కెట్ రోడ్డు చివర్లో వున్నది.

జనంలో ఆ వార్త ఉద్రిక్తతను కలిగించింది. జనప్రవాహం మార్కెట్ రోడ్డు వైపుకు కదిలింది.

స్కూలు దగ్గరకు రాగానే, తమను తామే నాయకులుగా నియమించుకొన్నవాళ్ళు చేతులు ఎత్తి జనాన్ని ఆగమని ఆదేశించారు. వాళ్ళుమాత్రం లోపలకు వెళ్ళారు.

కాని జనం ఎంతోసేపు వాళ్ళ ఆజ్ఞను పాటించలేదు. క్రమంగా అందరూ స్కూలు హాల్లోకి ప్రవేశించారు.

ఒక నాయకుడు హెడ్‌మాస్టర్‌తో ''మేము మిమ్మల్ని ఏమీ చెయ్యం. స్కూలు ముయ్యండి. స్కూలు ముయ్యక తప్పదు. మన నాయకుడు జైలుపాలయ్యాడు. మన దేశమాత చెరలో వున్నది,'' అన్నాడు.

హెడ్‌మాస్టరు మంత్రగాడు సృష్టించిన గుడ్లగూబలా వుంటాడు. ''స్కూల్లోకి ఎవరి అనుమతితో వచ్చారు? బయటికి వెళ్ళండి. లేదా పోలీసుల్ని పిలవాల్సి వస్తుంది'' అరుస్తూ అన్నాడు.

నవ్వులూ, వెక్కిరింతలూ, చప్పట్లూ వినిపించాయి జనంలోనుంచి. కుర్చీలు ఎత్తేశారు. బల్లలు విరగ్గొట్టారు. అద్దాలు పగులగొట్టారు. బోర్డు స్కూలు పిల్లలు చాలామంది జనంలో కలిసిపోయారు. కొద్దిమంది మాత్రం దూరంగా బిక్కు బిక్కుమని చూస్తూ నిల్చుండిపోయారు. అలా నిల్చున్నవాళ్ళని కొందరు బలవంతంగా బయటికి లాక్కెళ్ళారు.

ఈ పనులన్నింటిలో స్వామినాథన్ జోక్యం తక్కువేమీ కాదు. ''పోలీసుల్ని పిలిస్తే, వాళ్ళమీద మేము ఊస్తాం'' అని ముందుగా అరిచింది స్వామినాథనే. హెడ్‌మాస్టర్ పోలీసులు అనగానే అతడి రక్తం వేడెక్కింది. ఎంత సిగ్గులేనితనం! ఎంత దుర్మార్గం! పోలీసుల్ని - ఆ చేతివేళ్ళు కోసేసిన లాంకషైర్ ఏజెంట్లని పిలుస్తాడా? అందరూ కుర్చీలూ, బల్లలూ విరగ్గొట్టే పనిలో వుంటే, స్వామి మాత్రం అద్దాల తలుపులకోసం వెదకసాగాడు. వాటిని పగలగొట్టడంలో వున్న ఆనందం చెక్క కుర్చీలు విరగ్గొట్టడంలో కనిపించలేదు. తన స్కూల్లో సంతృప్తిగా అద్దాలు పగలగొట్టే అవకాశం దొరకలేదు. చాలా అద్దాలు కనిపించాయి. సిరా బుడ్లు తీసుకొని అద్దాలకేసి

కొట్టడం ప్రారంభించాడు. కొందరు స్కూలు వదలడం ఇష్టపడనివాళ్ళను, బయటికి ఈడ్చుకుపోవడం చూశాడు. ఆ పనికూడా చేయాలనిపించింది. కాని ఆ పిల్లలంతా తనకంటే పెద్దగా వున్నారు. అందుకే ఆ కోరిక తీరలేదు. అకస్మాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. చిన్న పిల్లల క్లాసుకేసి వెళ్ళాడు. అక్కడ చిన్న చిన్న పిల్లలు భయంతో బిగిసిపోయి కొందరూ, ఏడుస్తూ కొందరు కనిపించారు. భయంతో పడుతూ లేస్తూ పారిపోవడానికి ప్రయత్నిస్తున్న ఓ పిల్లవాడిమీద స్వామినాథన్ దృష్టి పడింది. వాడిమీద విరుచుకు పడ్డాడు. టోపీ లాగి కాలికింద వేసి తొక్కాడు. ముందుకూ వెనక్కూ ఈడ్చాడు. రెండు మొట్టికాయలు వేశాడు. ఏడుస్తున్న వాడ్ని వదలి అక్కడ్నుంచి కదిలాడు.

ఆ స్కూల్లో పని అయిపోయింది. అందరూ ఊరేగింపుగా నినాదాలిస్తూ మార్కెట్‌కేసి నడవసాగారు. దేశభక్తి గేయాలు పాడుతున్నారు. అనేక కంఠాలు తారాస్థాయిలో వినిపిస్తున్నాయి. స్వామినాథన్ కూడా అంత జనంలో నడుస్తున్నాడు. చెట్ల నీడకూడా లేని చోట నడుస్తున్నారు. ఎండకు కళ్ళు మూసుకు పోతున్నాయి. జనం కాళ్ళనుంచి లేస్తున్న దుమ్ముపొగ మంచులా కమ్మివేస్తున్నది. స్వామినాథన్‌కు ఆకలి వేస్తున్నది. గొంతు ఎండిపోతున్నది. జనం మధ్యలో వుండడం వల్ల ముందు నడుస్తున్న వాళ్ళ వీపులు తప్ప ఇంకేమీ కనిపించడం లేదు. అక్కడక్కడ ఎత్తైన భవనాలు మాత్రం కనిపిస్తున్నాయి. చిన్నగా అక్కడ్నుంచి తప్పించుకొని ఇంటికి వెళ్ళిపోవాలనిపించింది. ఉన్నట్టుండి ప్రొసెషన్ ఆగింది. ఏం జరిగిందో తెలుసుకోవాలనే కుతూహలం కొద్దీ వెనక నడుస్తున్న వాళ్ళు ముందుకు తోసుకొని రాసాగారు.

జనం మార్కెట్ రోడ్డు మధ్య వున్నారు. చౌరాస్తా మధ్యలో ఫౌంటెన్ ఉంది. దానిముందు వరసగా పోలీసులు నిల్చుని వున్నారు. ప్రొసెషన్ ముందుకు వెళ్లడానికి వీలులేకుండా నిల్చివున్నారు. వాళ్ళ చేతుల్లో లాఠీలు వున్నాయి. మొత్తం ఏభయ్ మందివరకు ఉన్నారు. బాగా ఎత్తుగా వున్న పోలీసు ఆఫీసరు చేతిలో లాఠీ, బెల్టులో రివాల్వర్‌తో ముందుకు వచ్చాడు. భుజాల మీద స్ట్రాపులూ, మెరుస్తున్న బూట్లూ - స్వామినాథన్ అతడ్ని కుతూహలంగా చూశాడు. అతడి ముఖం చూసి స్వామినాథన్ బిక్కపోయాడు. అతను రాజం నాన్న. రాజం తండ్రి ఆ దుర్మార్గుల్లో ఒక దుర్మార్గుడు కావడం స్వామినాథన్‌కు చాలా బాధ కలిగించింది. డెప్యూటీ సూపరెంటెండెంట్ వాచీ చూసుకుంటూ ''మీరు శాసనధిక్కారానికి పాల్పడుతున్నారు. ఐదు నిముషాల టైం ఇస్తున్నాను. అందరూ వెళ్ళిపోండి'' అన్నాడు. ఐదు నిముషాలు అయింది. ఎవరూ కదల్లేదు. ఆయన 'ఛార్జి' అని అరిచాడు.

జనంలో తొక్కిసలాట మొదలైంది. కొంచమైతే స్వామినాథన్ జనం కాళ్ళకింద పడి చచ్చిపోయేవాడే. ఎలాగో తప్పించుకొని, పరుగుతీస్తున్న చిన్న గ్రూపుతో కలిసిపోయాడు. ఎదురుగా వచ్చిన కొందరు పోలీసులు పరుగెత్తుతున్న వాళ్ళను ఆపారు. ''సార్! సార్! నేనేం చెయ్యలేదు. నన్ను వదిలెయ్యండి'' నిలువెల్లా వణికిపోతూ ప్రాధేయపూర్వకంగా అన్నాడు. పోలీసులు ఎవర్నీ వినిపించుకోవడం లేదు. వారి లాఠీలు జనం శరీరాలపైన నాట్యం చేస్తున్నాయి. ఒకడికి తల పగిలి రక్తం చిమ్మింది. మరొకడు లాఠీ తగిలి పరిగెత్తుతూనే విరుచుకు పడిపోయాడు. పరిగెత్తుతున్న మూడోవాడి వీపుమీద లాఠీ దెబ్బలుఒకదాని తర్వాత ఒకటి పడ్తూనే ఉన్నాయి.

స్వామినాథన్ పరిగెత్తుతూనే వున్నాడు. కళ్ళు తిరుగుతున్నాయి. అకస్మాత్తుగా పోలీసువాడొకడు స్వామినాథన్ జుట్టు పట్టుకొని తల పైకెత్తాడు. ''ఏం చేస్తున్నావిక్కడ?'' అనిఅడిగాడు.

''ఏం చెయ్యడం లేదు. నాకేం తెలియదు సార్!'' వణికిపోయాడు.

''ఏం చెయ్యడం లేదా? కోతి వెధవా! ఫో!!'' అని లాఠీతో చిన్నగా తలమీద ఒకటి అంటించాడు. పోలీసువాడు దగ్గరగా చూస్తే చాలా భయంకరంగా వుంటాడు అనుకొన్నాడు స్వామినాథన్.

## 3

స్వామినాథన్ ఆ రోజు జరిగిన సంఘటనలు ఏవీ తండ్రి దృష్టికి రాకుండా జాగ్రత్తపడాలని నిర్ణయించుకున్నాడు. స్వామినాథన్, తండ్రి ఇంటికి వస్తూనే, కోటు కూడా విప్పకుండా తల్లిని పిల్చి ఆ రోజు జరిగిన విషయాలు చెప్పడం విన్నాడు. ఆ విషయాలు చెప్తున్నప్పుడు అతడి కంఠంలో కోపం ధ్వనించింది."పోలీసు డెప్యూటీ సూపర్నెంటు ఒక కసాయివాడు" అని బట్టలు మార్చుకోవడానికి గదిలోకి వెళ్ళాడు. స్వామినాథన్ కళ్ళముందు, చేతి వాచీ చూస్తూ, క్రూరంగాఛార్జి చెయ్యమని ఆజ్ఞలు జారీచేసిన రాజం తండ్రి రూపం కదిలింది. బట్టలు మార్చుకుని బయటికి వచ్చి ''ఏభయ్ మందిని అరెస్టు చేశారు. ఒకళ్ళిద్దరు చనిపోయారని కూడా అంటున్నారు. స్కూలు పిల్లలు కూడా చాలా గొడవ చేసారని విన్నాను. ఒరే స్వామీ నువ్వేం చేశావురా?'' అని అడిగాడుతండ్రి.

''స్కూల్లో స్ట్రైక్ జరిగింది.'' టోపీ పోయినట్టు చెప్పడానికి అవకాశం దొరికిందనుకున్నాడు. ''ఒకటే అల్లరి. ఒకడు నా టోపీ లాగేశాడు. ముక్కలు ముక్కలుగా చింపేశాడు. రేపు స్కూలుకు వెళ్ళడానికి నాకు కొత్త టోపీ కావాలి.''

''ఎవడ్రావాడు?''

''నాకేం తెలుసు ఎవడో? జనంలోనుంచి వచ్చాడు. ఎద్దులా వున్నాడు.''

''ఎందుకలా చేసాడు?''

''విదేశీ టోపీకదా? అందుకే.''

''ఎవర్రా ఆ మాట అన్నది? నేను రెండు రూపాయలు పెట్టి దాన్ని ఖాదీ షాపులో కొన్నాను. అది నల్ల ఖద్దరు. అన్నీ తెలిసినట్టే నటిస్తావేమిట్రా?''

''అదంతా నాకేం తెలుసు? ఎదురు తిరిగాను అప్పటికీ. వాడు నన్ను కొట్టడానికి మీద మీదకు వచ్చాడు.''

''నువ్వో నాలుగు తగిలించాల్సింది. నీ కోటుకు గుడ్డ కొన్న రోజే టోపీ కూడా కొన్నాను. నీ కోటు కూడా ఖద్దరు కోటే. వాడికి కళ్ళు లేవా? విదేశీ వస్తువులని ఎలా అన్నాడు?''

''అది లాంకషైర్‌లో తయారయిందన్నారు చాలామంది.''

''నాన్‌సెన్స్! ఎవడ్రా ఆ మాట అన్నది? నీ జోలికి ఎవరైనా వస్తే, వాళ్ళ పనేదో వాళ్ళను చూసుకోమను. నీ జోలికి రావద్దని చెప్పు. ఇలా నువ్వు వళ్ళు అప్పగించేస్తే, నీ వంటిమీద బట్టలు కూడా ఉంచరు. జాగ్రత్త. అయినా పిల్లలకు-మీకు రాజకీయాలేమిట్రా? ఇప్పటికే ఈ దేశం అనేక సమస్యలతో సతమతమైపోతున్నది. పిల్ల వెధవలు కూడా రాజకీయాల్లో తల దూరిస్తే ఎట్లా?''

స్వామినాథన్ పడుకున్నాడే కాని నిద్ర పట్టడం లేదు. ఇంట్లో దీపాలు తీసేశారు. స్వామినాథన్‌కు వళ్ళంతా పచ్చి పుండులా వుంది. వళ్ళంతా దెబ్బలు. మోచేతులూ, మోకాళ్ళూ తమ తమ కథలు చెప్తున్నాయి. ఆ రోజు రెండు మూడుసార్లు కిందపడ్డాడు. మొదటిసారిగా, రాజం కారులో వచ్చి స్కూలు ముందు దిగినప్పుడు, వాడికి కనిపించకుండా వుండాలనే ప్రయత్నంలో పడ్డాడు. రాళ్ళమీద పడడంవల్ల మోకాళ్ళ దగ్గర చర్మం చీరుకుపోయింది. రెండోసారి పోలీసు ఛార్జింగ్ మొదలు పెట్టినప్పుడు. పరిగెత్తుతూ బొక్కబోర్లా రోడ్డుమీద పడ్డాడు. ఎవరిదో కాలు తన వీపుమీద పడింది.

తిరిగి పడుకుంటున్నప్పుడు వీపు నొప్పి పుట్టింది. తొడలమీద పెద్ద బరువులు వున్నట్టుగా అనిపించింది. పోలీసు లాఠీ దెబ్బ గుర్తు వచ్చి తల నొప్పిగా ఉన్నట్టనిపించింది. వాడు ఆ కోతి ముఖంగాడు తనను 'కోతి వెధవా' అన్నాడు. తనేం కోతి కాదు. వాళ్ళే ఆ పోలీసువాళ్ళే కోతి వెధవలు. అన్నీ కోతి చేష్టలే!

4

హెడ్‌మాస్టర్ జేవురించిన ముఖంతో క్లాసులో ప్రవేశించాడు. కళ్ళలో కసి కనిపిస్తోంది. తను ఆ సమయంలో అక్కడ లేకుండా వుంటే బాగుండేది అనిపించింది స్వామినాథన్‌కు. హెడ్‌మాస్టర్ కొద్ది నిముషాలపాటు క్లాసును కలయజూశాడు. "మీకు సిగ్గుగా లేదా? నిన్న చేసిన పనులు గుర్తున్నాయా? మళ్ళీ వచ్చి క్లాసులో ఎలా కూర్చోగలిగారు?" అని కొందరి పేర్లు చదివాడు. వాళ్ళందరూ క్రితం రోజు క్లాసుకు వచ్చిన బుద్ధిమంతులు. వాళ్ళను ప్రత్యేకంగా గౌరవించడానికే అన్నట్టుంది ఆ పేర్లని చదవడం. స్కూలుకు రానివాళ్ళ పేర్లు చదివి, వాళ్ళందర్నీ లేచి నిల్చోవలసిందిగా ఆజ్ఞ జారీ చేశాడు. అందరూ లేచి నిల్చున్నారు. బెంచీలెక్కి నిల్చోవలసిందిగా మళ్ళీ ఆజ్ఞ. అందరూ అలాగే చేశారు. స్వామినాథన్‌కు అవమానకరంగా అనిపించింది. హెడ్‌మాస్టర్ పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు. ఆ తర్వాత ఒక్కొక్కర్నీ సంజాయిషీ అడగడం ప్రారంభించాడు. ఒకడు తలనొప్పిగా వున్నందువల్ల స్కూలుకు రాలేదని చెప్పాడు. డాక్టరు సర్టిఫికెట్ పట్టుకురమ్మని చెప్పి అతడ్ని అంతటితో వదిలేశాడు. తను స్కూలుకు బయలుదేరాననీ, దారిలో ఎవరో "ఇవ్వాళ స్కూలు లేదు" అని చెప్పారనీ, అందుకే తిరిగి వెళ్ళిపోయాననీ రెండోవాడు చెప్పాడు.

"ఎవడో బజారు వెధవ స్కూలు లేదంటే వెళ్ళిపోవడమేనా? స్కూలుకు వచ్చి చూడక్కర్లేదా?" అని అడిగాడు. ఆ కుర్రాడు మౌనంగా నిల్చున్నాడు. "పది రోజులు హాజరు పట్టీలో కొట్టివేయడం, రెండు రూపాయలు జరిమానా- ఆ రోజంతా బెంచీమీద నిలబడడం." ఇదీ అతడికి విధించిన శిక్ష. మూడోవాడు తలనొప్పి వచ్చిందన్నాడు. నాలుగోవాడు కడుపు నొప్పి వచ్చిందన్నాడు. తను స్కూలుకు బయలుదేరుతూ వుండగా, అనుకోకుండా నాయనమ్మ చచ్చిపోయిందని చెప్పాడు ఐదోవాడు. అలాగని అతడి తండ్రినుంచి ఉత్తరం పట్టుకు రావాలన్నాడు హెడ్‌మాస్టర్. తనకు తండ్రి లేడన్నాడు ఆ కుర్రవాడు. మరి గార్డియన్ ఎవరంటే, నాయనమ్మ అని చెప్పాడు. "మీ నాయనమ్మ చనిపోయిందిగా?" "ఆ నాయనమ్మ వేరు." "నీకు ఎంతమంది నాయనమ్మలు ఉన్నార్రా?" అని హెడ్‌మాస్టర్ అడిగిన చివరి ప్రశ్నకు సమాధానం చెప్పకుండా నిల్చున్నాడు. "పోనియ్! నీ ఇరుగు పొరుగు వాళ్ళనుంచి ఉత్తరం తీసుకురా!" "వాళ్ళంతా చదువు రానివాళ్ళు. ఎల్లమ్మన్ స్ట్రీట్‌లో వున్నవాళ్ళెవరూ చదుకోలేదు" అని సమాధానం. హెడ్‌మాస్టర్ వదల్లేదు. ఒక మాస్టర్ని పంపి వాకబు చేయిస్తానన్నాడు. అక్కడివాళ్ళకు తన

నాయనమ్మ చనిపోయిన సంగతి తెలియదన్నాడు. ఆమె ఏదో గ్రామంలో చచ్చిపోయిందన్నాడు. అప్పటికే ఆ కుర్రవాడి వళ్ళంతా చెమట పట్టింది. హెడ్‌మాష్టర్ పిచ్చి కోపంతో బెత్తంతో బాదాడు. పిచ్చి తిట్లు తిట్టాడు. పదిహేను రోజులు స్కూలుకు రాకూడదని ఆంక్ష విధించాడు. అదే వాడికి వేసిన శిక్ష.

స్వామినాథన్ వంతు వచ్చింది. అసహాయంగా నాలుగు వైపులా చూశాడు. రాజం, ముందునుంచి మూడో బెంచీలో కూర్చుని వున్నాడు. రాజం వీపు కనిపిస్తున్నది. రాజం తిరిగి చూడలేదు. బ్లాక్‌బోర్డుమీద చూపులు నిలిపి కదలకుండా కూర్చున్నాడు. రాజం తిరిగి చూడకూడదనుకున్నాడు. తనను ఆ పరిస్థితిలో రాజం చూడడం ఇష్టంలేదు స్వామికి. ఒకవేళ రాజం తిరిగి చూస్తే, స్వామి బెంచీమీదనుంచి పడిపోయే ప్రమాదం లేకపోలేదు. రాజం ఎర్రటి చెవులు కనిపిస్తున్నాయి వెనక నిల్చుని వున్న స్వామికి. ఆ చెవుల్ని చూస్తూ హెడ్‌మాస్టర్ వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం అసంభవం. వాడి చెవులకూ, తన చూపులకూ మధ్య ఒక బ్లాక్‌బోర్డు పెడితే? హెడ్‌మాస్టర్‌కు స్వామి మౌనం కోపం కలిగించింది. బెత్తంతో నాలుగు అంటించాడు. స్వామి ఈ లోకంలోకి వచ్చాడు.

''నిన్ననెందుకు రాలేదు?'' హెడ్‌మాస్టర్. ''అబద్ధం. నిన్న నేను స్కూలుకు వచ్చాను'' అని అరిచి చెప్పాలనిపించింది. కాని మౌనంగా నిల్చున్నాడు.''వచ్చాను. రాళ్ళు కూడా వేశాను. నీ గది వెంటిలేటర్ అద్దం పగలగొట్టింది ఎవరనుకున్నావ్? నువ్వేం చేసావ్? ఒక గొప్పవాణ్ణి జైల్లో పెట్టిన ఇంగ్లీషువాడికి సలాం కొట్టావ్. వాళ్ళు లాంకషైర్ మన నేత నేసేవాళ్ళ చేతివేళ్ళు నరకలేదా?'' ఇలా ఎన్నెన్నో ఆలోచనలు స్వామి బుర్రలో తలెత్తాయి. తనొప్పి వచ్చి రాలేదని చెప్పాలనుకున్నాడు. ''ఏరా? మాట్లాడవేం? నోరు తెరవవా?'' కసిగా బెత్తంతో కొట్టసాగాడు హెడ్‌మాస్టర్. కన్నీరు నిండిన కళ్ళతో మూగగా చూస్తూ నిల్చున్నాడు. ''నిన్ను చంపేస్తాను ఇవ్వాళ, మాట్లాడకపోతే.'' పిచ్చిగా అరిచాడు హెడ్‌మాస్టర్.

''నే...నే...ను రాలేకపోయాను.'' ఎలాగో గొంతు పెగుల్చుకొని అన్నాడు.

''అలాగా? ఒరే ఎవర్రా అక్కడ? ఆ బంట్రోతును పిలవండి.''

స్వామినాథానికి అర్థం అయింది. బంట్రోతు ఏం చెబుతాడో కూడా ఊహించుకున్నాడు. అందర్నీ కసితీరా కొరికి పారిపోవాలనిపించింది. ప్యూన్ వచ్చాడు.

''చెప్పరా! ఈ రాస్కెల్ ఏం చేశాడో చెప్పు.''

ప్యూన్ స్వామినాథన్‌కేసి చూస్తూ "నువ్వు రాళ్ళు విసిరి అద్దాలు పగలగొట్టావు కదూ?" అన్నాడు.

"నా గది వెంటిలేటర్ అద్దాలు," హెడ్‌మాస్టరుఅన్నాడు.

స్వామినాథన్‌కు తప్పించుకొనే మార్గం కనిపించ లేదు. వీపుమీద బెత్తం దెబ్బలు మళ్ళీ పడ్డాయి. "దొంగవెధవా చెప్పరా జవాబు." దొంగవెధవ దగ్గర జవాబు లేదు. తను చేశాడు. ఆ ప్యూనుగాడు చూశాడు. మొండికెత్తినట్టు నిల్చున్నాడు. వీపుమీద మరో దెబ్బ గట్టిగా పడింది. "అబ్బ! కొట్టకండి సార్. చాలా నొప్పిగా వుంది" అన్నాడు. మరో నాలుగు దెబ్బలు వేసి "నేను నీకు డిస్‌మిస్ ఆర్డరు ఇచ్చేదాకా అలాగే నిల్చుని వుండు" అన్నాడు హెడ్‌మాష్టర్.

స్వామినాథన్ శరీరమంతా పేము దెబ్బలతో వాతలు పెట్టినట్టుగా వుంది. అకస్మాత్తుగా మొండి ధైర్యం వచ్చింది. అది అసహాయత పరాకాష్ఠకు చేరినప్పుడు వచ్చే ధైర్యం. గుడ్ల నీరు గుడ్ల కుక్కుకున్నాడు. బెంచీమీద నుంచి గెంతినట్టుగా దిగాడు. పుస్తకాలు తీసుకొని "బోడి స్కూలు! నీ స్కూలు ఎవడిక్కావాలి" అని అరుస్తూ బయటికి పరుగుతీశాడు.

# అధ్యాయం 13

# ఎం.సి.సి.

## 1

ఆరు వారాల తర్వాత రాజం స్వామినాథన్ ఇంటికి వచ్చాడు. స్వామి రాజకీయాల్లో పాల్గొని చేసిన తప్పుల్ని క్షమించాడు. బోర్డు హైస్కూలు వాతావరణంలో స్వామి కొంత నిర్లిప్తంగా, కొంత నిర్లక్ష్యంగా, మరికొంత స్తబ్ధంగాతయారయ్యాడు.

అల్బర్ట్ మిషన్ స్కూలునుంచి, ఆ రోజు నాటకీయంగా బయటికి నడిచాక (స్ట్రయికు జరిగిన రెండో రోజు) కొంతకాలం చాలా మొండిగా ప్రవర్తించాడు. కొన్ని రోజుల తర్వాత తండ్రి స్వామిని తీసుకెళ్ళి బోర్డు హైస్కూల్లో చేర్చాడు. సాధారణంగా కొత్త విద్యార్థులు ఎదుర్కొనే ఇబ్బందుల్ని స్వామినాథన్ ఆ స్కూల్లో అనుభవించాడు. త్వరగానే ఆ వాతావరణంలో ఇమిడిపోయాడు. సెకెండ్ ఫారం 'సి'లో అందరి అభిమానాన్ని చూరగొన్నాడు. పిల్లలు కాస్త సమయం దొరికితే చాలు స్వామి చుట్టూ చేరిపోతారు. అతడి మాటలు కుతూహలంగా వింటారు. వారిలో ఎవర్ని తన ఆత్మీయ మిత్రులుగా స్వీకరించాలో ఇంకా నిర్ణయించుకో లేదు స్వామినాథన్. అల్బర్ట్ స్కూలు మిత్రుల్నే ఇంకా తన మిత్రులుగా భావిస్తున్నాడు. ఆ స్కూల్లో మిత్రుల పరిస్థితుల్లో స్కూలు తెరిచాక, మార్పు వచ్చినట్టు గుర్తించాడు. శంకర్ స్కూలుకు రావడంలేదు. అతని తండ్రికి బదిలీ అయిందనీ, అందరూ ఈ ఊరునుంచి వెళ్ళిపోయారని తెలిసింది. సోము పరీక్ష తప్పి పాత క్లాసులోనే ఉండిపోయాడు. అతడ్ని మిత్రుల లిస్టునుంచి తొలగించాడు. మరి రూలంటే రూలే. బతాణీ సెకెండ్ పారంలోకి వచ్చాడు. కాని స్కూలు తెరిచాక మూడు నెలలు రాలేదు. ఆ తర్వాత బోలెడన్ని సర్టిఫికెట్లు, డాక్టర్ సర్టిఫికెట్‌తో సహా, తీసుకొచ్చి చేరాడు. వాడికి అన్నీ సమస్యలే. పాత మిత్రులు కనిపిస్తే ముఖం చాటు చేసుకుంటున్నాడు. స్వామితో రాజం, మణి ఎప్పటిలాగా స్నేహంగా ఉంటున్నారు. మణి రోజూ స్వామిని కలుసుకుంటూనే ఉన్నాడు. రాజం మాత్రం స్వామి రాజకీయ కార్యకలాపాల గురించి విని, కొంతకాలం దూరంగా వుండిపోయాడు.

ఆ రోజు స్వామినాథన్, గదిలో, ఒక చీకటి మూల కూర్చుని అట్టపెట్టెతో కెమేరా తయారు చేస్తున్నాడు. అద్దం అమరుస్తున్నాడు. అద్దం ముక్కకంటే, పెట్టె రంధ్రం చాలా చిన్నదిగా ఉంది. అది సరిగా ఇమడడం లేదు. స్వామికి చాలా విసుగ్గా వుంది. అదే సమయంలో బయట చిరపరిచిత కంఠస్వరం వినిపించి, గదిలోనుంచి పరుగుతీశాడు.

''హల్లో! హల్లో! రాజం! ఏమిటి చెప్పకుండానే వచ్చేశావ్?''

''ఏమిటది?'' స్వామి చేతిలో వున్న పెట్టెను చూస్తూ రాజం అడిగాడు.

స్వామినాథన్ ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

''ఏదీ! ఇలా ఇవ్వు చూద్దాం.''

''ఇదా? ఆ, ఏంలేదు'' అన్నాడు. పెట్టె రాజంకు అందిస్తూ స్వామి.

రాజం ఒక కన్ను మూసి రెండో కన్ను, పెట్టె కన్నుందగ్గర ఆనించి చూడసాగాడు.''అక్బర్ అలీ మంచి కెమెరా తయారు చేశాడు.'' అన్నాడు స్వామి.

''అవునా? దాంతో ఏం చెయ్యాలని?''

''బోలెడన్ని ఫొటోలు తీశాడు.''

''నిజంగా? ఏం ఫొటోలు అవి?''

''ఇంకా నాకు చూపించలేదు. ఇళ్ళూ, మనుషులూ, చెట్లూ తీశాడనుకుంటా''అన్నాడు స్వామి.

వాకిట్లో మెట్టుమీద కూర్చుని ''అక్బరలీ ఎవరు?'' అనిఅడిగాడురాజం.

''మంచి ముస్లిం. మా క్లాసే.''

''బోర్డు హైస్కూల్లోనా?'' ఏదో అనుమానం అతడి కంఠంలో ధ్వనించింది. స్వామి అదేమీ పట్టించుకోలేదు. ''వాడికి సైకిలు వుంది. మంచి ముస్లిం. గజనీ మహమ్మదునూ, ఔరంగజేబునూ పెద్ద రాస్కెల్స్ అంటాడు. చాలా మంచివాడు.''

''వాళ్ళు మంచివాళ్ళు కారని ఎందుకను కుంటున్నావ్?''

''వాళ్ళు మన దేవాలయాలను పడగొట్టారు. హిందువుల్ని హింసించారు. సోమనాథపురం దేవాలయం గురించి నీకు తెలియదా?''

''మన బ్రాహ్మలకు అలాగే జరగాలి. మళ్ళీ మాట్లాడితే ఇంకా... మా ఇంట్లో పౌర్ణమి రోజు పాటించం. మా నాన్న చచ్చిపోయిన వాళ్లకు తద్దినాలు కూడా పెట్టడు.'' రాజం తర్కించే మూడ్‌లో వున్నాడని అర్థం చేసుకున్నాడు స్వామినాథన్. అందుకే మౌనంగా వుండిపోయాడు. ''చూడు, నీకు ఈ

మనస్తత్వం ఆ బోర్డు హైస్కూల్లో చదవడం వల్ల వచ్చింది,'' మళ్ళీ అన్నాడు రాజం.

రాజంతో ఏకీభవించడమే మంచిదనిపించింది. ''నువ్వు కరెక్ట్. ఆ స్కూల్లో చదవడం నాక్కూడా ఇష్టం లేదు,'' అన్నాడు స్వామి.

''మరి ఎందుకు చేరావు?''

''ఏం చెయ్యమంటావ్? ఆ హెడ్‌మాస్టర్ పశువులా ప్రవర్తించాడు. నీకూ తెలుసుగా? ఆ రోజు నా స్థానంలో నువ్వు వుండివుంటే, వాడి ముఖంమీద ఈడ్చితన్నేవాడివి.''

ఈ పొగడ్త రాజంమీద పనిచెయ్యలేదు. ''నేను అసలు చెత్త రాజకీయాల జోలికే వెళ్లను. స్ట్రయిక్‌లో కూడా పాల్గొనను,'' అన్నాడు రాజం. అతని తండ్రి ప్రభుత్వ అధికారి. ఆ కుటుంబమే రాజకీయాలకు బద్ధ విరోధి.

''నిజమే. ఆ రోజు నేను అసలు స్కూలుకు రాకుండా వుండాల్సింది.'' స్వామి తన తప్పును అంగీకరించడంలో రాజం మెత్తబడ్డాడు. అతను చేసిన తప్పుల్ని క్షమించానని చెప్పాడు. ''మనం మిత్రులుగానే వుందాం. క్రికెట్ టీము ఎలా వుంటుందంటావ్?'' అడిగాడురాజం.

స్వామినాథన్‌కు తను క్రికెట్ ఆడగలననే నమ్మకం లేదు. అతి కష్టంమీద హాబ్స్, బ్రాడ్‌మాన్, దులీప్‌ల గురించి కొన్ని వివరాలు గుర్తు పెట్టుకున్నాడు. రాజంకు అవన్నీ బాగా తెలుసు. అందుకే తను కూడా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూ వుంటాడు. రాజంలా క్రికెట్ ఆటగాళ్ళ ఫొటోలు కూడా సేకరించాడు. రాజం చేసినట్టే ఆల్బంలో అంటించాడు. స్వామికి ఆ ఫొటోలమీద బొత్తిగా మోజు లేదు. అందరి ఫొటోలూ ఒకలాగే కనిపిస్తాయి.

''నేను క్రికెట్ ఆడలేను రాజం. నాకు రాదు.''

''అందరూ అలాగే అంటున్నారు. నేను ఫొటోలు సంపాదించాను. కాని నేను ఆడగలనా అనే సందేహం నాకూ ఉంది.''

అది విని స్వామి సంతోషించాడు. బహుశా హాబ్స్ లాంటివాళ్ళకు కూడా మొదట్లో అలాగే వుండి వుండాలి.

''అవును! మనం, మా స్కూల్లో పదకొండో క్లాసు టీమును కూడా ఛాలెంజి చేద్దాం. వాళ్ళను కొట్టేవాళ్ళు లేరని వాళ్ళకు పొగరు,'' అన్నాడు స్వామినాథన్.

''బోర్డు హైస్కూలు పొట్టిగాళ్ళకు కూడా అంత పొగరా? వాళ్ళ తిక్క కుదిరిద్దాం.''

''మన టీముకు ఏం పేరు పెడదాం?''

''నీకు తెలియదా? ఎం.సి.సి.''

''అది హాక్స్ టీము పేరుకదా? వాళ్ళు ఊరుకుంటారా?''

''ఏం చేస్తారేం? ఒకవేళ చిక్కుల్లో పడ్డా పరవాలేదు. జడ్జి ముందు అది మాల్గుడి క్రికెట్ క్లబ్బు పేరని చెప్పేస్తాను.''

స్వామినాథన్‌కు రాజం సమాధానం నచ్చలేదు. పేరు కూడా చాలా పాతదిగా అనిపించింది. ''రాజం, మనం కొత్త పేరు పెట్టుకుందాం.''

''అయితే ఒక మంచి పేరు చెప్పు.''

''ఫ్రండ్స్ ఎలెవన్.'' (మిత్రులు పదకొండుమంది.)

''ఫ్రండ్స్ ఎలెవనా?''

''జంపింగ్ స్టార్స్.'' (ఎగిరే నక్షత్రాలు.)

''ఈ పేరు పర్వాలేదు. బాగానే వుంది.''

''మనం ఎగిరే నక్షత్రాలం-చెప్పుకోవడానికి బలేగా వుందికదూ?'' అన్నాడు స్వామి.

''ఎగిరే నక్షత్రాలు. బోర్డు హైస్కూలు టీమును చిత్తుగా ఓడించింది.'' అనే వార్త పత్రికల్లో వచ్చేసినట్టే అనిపించింది రాజంకు. ''అద్భుతం!''ఇంతెత్తున లేచి కూర్చున్నాడు. రాజం జేబులో వున్న కాగితం, పెన్సిలూ తీసుకున్నాడు. ''స్వామీ! చెప్పు! ఇంకా కొన్ని పేర్లు చెప్పు.'' అంటూ''ఎగిరే నక్షత్రాలు'', ''ఎం.సి.సి.'' అనే పేర్లను అంతకు ముందే వున్న లిస్టులో చేర్చాడు.

స్వామినాథన్ గంభీరంగా ముఖం పెట్టి ఆలోచించాడు.

''ఫ్రెండ్స్ ఎలెవన్, జంపింగ్ స్టార్స్, మిత్ర సమాఖ్య.''

''మిత్ర సమాఖ్య అనే పేరు నేను ముందేరాశాను. చూడు లిస్టులో వుంది.''

''ఛాంపియన్ ఎలెవన్,'' ఆలోచనలో పడ్డాడు స్వామి.

''అదీ రాశాను. ఏమిటి? సరుకు అయిపోయిందా?''

''కాదు, మణిగాడుంటే మరికొన్ని పేర్లు చెప్పేవాడుకదా అని ఆలోచిస్తున్నాను. ఛాంపియన్ ఎలెవన్...''

''ఇంతకు ముందే చెప్పావ్.''

''విక్టరీ యూనియన్ ఎలెవన్.''

''ఇది చాలా బాగుంది. ఇది చాలా బాగుందనిపిస్తోంది. ఆ పేరు వినగానే మిగతావాళ్ళు భయపడిపోతారు. రాజం లిస్టులో వున్న పేర్లన్నీ చదివాడు. స్వామి టక టకా అన్ని పేర్లు చెప్పడం ఆశ్చర్యాన్ని కలిగించింది. రాత్రంతా ఆలోచించినా తనకు రెండు పేర్లు కూడా తట్టలేదు. ''స్వామీ! రేపు

సాయంత్రం నన్ను కలుస్తావా? మణిని కూడా రమ్మంటాను. ముగ్గురం కలిసి ఒక పేరు సెలక్టు చేద్దాం'' అన్నాడురాజం.

''మనం మన టీము ప్రారంభించాక ప్రభుత్వానికి టాక్సు కట్టాల్సి వుంటుందా?'' స్వామి సందేహం వెలిబుచ్చాడు.

''గవర్నమెంటు అన్నిటిమీదా పన్ను వేస్తుంది. మా నాన్న జీతం ఐదు వందలు. అందులో రెండొందలు పన్నుకే సరిపోతుంది. మనం పన్ను కట్టాల్సి వుంటుందని నీకెందుకనిపించింది?''

''టాక్సు కట్టకపోతే మన పేరును ప్రభుత్వం గుర్తించదేమో? అలా అయితే మన పేరుని ఇంకా చాలామంది పెట్టుకొనే అవకాశం వుంది. అప్పుడు అంతా గందరగోళంగా తయారు కావచ్చు.''

''మనం రెండు పేర్లు పెట్టుకుంటే?''

''అలా వీల్లేదు.''

''ఎందుకు లేదు. నేను బిషప్ వాలెర్ స్కూల్లో వున్నప్పుడు మా క్రికెట్ టీముకు రెండు పేర్లు వుండేవి. ఇప్పుడు గుర్తులేవు. రెండు పెట్టుకోవచ్చు. ఒకటి మనం పిల్చుకోవడానికి, మరొకటి మాచెస్ ఆడేప్పుడు ఉపయోగించుకోడానికి.''

''వాల్లెర్ స్కూల్ టీములాంటి పెద్ద టీముకు రెండు పేర్లు వుండాలి. కాని మనకెందుకు? రెండు పేర్లకు టాక్స్ కట్టాల్సి వస్తుంది.''

క్రికెట్ టీమును ప్రారంభించటం కష్టాలతో కూడిన పని అని తెలుసుకున్నాడు రాజం. పేరు పెట్టడం దగ్గర్నుంచి, పన్ను కట్టడం వరకు చాలా చిక్కులున్నాయి. తన ఇంటి వెనక వున్న మైదానంలో డజను మందితో తేలిగ్గా ప్రారంభించవచ్చునని మొదట అనుకున్నాడు. కాని తీరా చూస్తే అన్నీ అడ్డంకులే. ముఖ్యంగా గవర్నమెంటు అన్ని విషయాల్లో తల దూరుస్తుంది అందుకే గాంధీగారికి గవర్నమెంటు అంటే గిట్టదు.

స్వామినాథన్‌గాడికి తెలియని విషయమే లేదు. పన్ను కట్టాలని కూడా తెలుసు. అది ఎవరికి కట్టాలి? గవర్నమెంటు అంటే ఎవరు? ఎక్కడుంటాడు? పన్ను వైస్రాయ్‌కి కట్టాలా? కాదు. మరెవరు? ఎవరైనా వచ్చి నేనే గవర్నమెంటును, నాకు పన్ను కట్టు అని మోసంచేస్తే? ఎందుకైనా మంచిది మనియార్డరు ద్వారా పంపించడం. గవర్నరుకు పంపిస్తే సరి! ఎంత పంపించాలి? రాజం బుర్రలో అనేక సందేహాలు తలెత్తాయి.

రాజం ఇంట్లో ముగ్గురూ టేబులు చుట్టూ కూర్చున్నారు. మణి చేతిలో మెజర్స్ బిన్స్(ఆటల సామాను అమ్మే షాపు) క్యాటలాగు వున్నది."జూనియర్ విల్లార్డ్ బ్యాట్స్ నాణ్యమైన చెక్కతో చేసిన బ్యాట్సు... కేంబ్రిడ్జి జూనియర్ బాయ్స్ ఎలెవన్ వాడే బ్యాట్సు..." అనే ప్రకటన చూస్తున్నాడు మణి.

"ఒకసారి చూడనివ్వు" అని వంగి చూస్తూ "మంచి బ్యాటులాగే వున్నది. స్వామి నువ్వు కూడా చూడు." అన్నాడు రాజం. స్వామి మెడ ముందుకు చాచి చూస్తూ అన్నాడు, "బాగానే వుంది. కాని నాకు అన్ని బ్యాటులూ ఒకటిగానే కనిపిస్తున్నాయి." మణి చెయ్యి స్వామినాథన్ మెడమీద పెట్టి తల కిందకు వంచి అన్నాడు-"జూనియర్ ఎల్లార్డ్ బ్యాటుకూ, వేరేవాటికీ భేదం తెలియనివాడివి, పెద్ద క్రికెట్ ఆటగాడిలా పోజుకొడ్తా వెందుకు? నీకు మా టీములో స్వీపరుగా వుండే అర్హత కూడా లేదు."

"స్వామీ! సరిగా చూడు. ఎల్లార్డ్ బ్యాటు, రోల్స్‌రాయిస్ కారులాంటిదట. దానికీ వేరే కార్లకూ వున్న భేదం తెలుసా?"

"నాకు తెలియదని చెప్పానా?"

"తెలిస్తే చెప్పు మరి." మణి ఎగతాళిగా నవ్వాడు.

"రోల్స్‌రాయిస్ కారు ఖరీదు లక్ష రూపాయలు. మిగతా కార్ల ఖరీదు పది వేలు. రోల్సు ఇంజను వెండిది. మిగతావాటి ఇంజన్లు ఇనుపవి."

"ఓహో!" వంకరగా చూస్తూ అన్నాడు రాజం.

"రోల్సు సతాయించవు. మిగతా కార్లు సతాయిస్తాయి. రోల్సు నడుస్తూ నడుస్తూ ఆగిపోదు. మిగతావి ఆగిపోతాయి. రోల్స్ శబ్దం చెయ్యదు. మిగతా కార్లు లొడ లొడమంటూ శబ్దం చేస్తాయి."

"రోల్స్‌రాయిస్ మీద ఒక ఉపన్యాసం ఇవ్వకూడదూ?" వ్యంగ్యంగా అన్నాడు మణి.

"స్వామీ! కార్ల గురించి బాగానే తెలుసు. కాని బ్యాటుల్ని గురించి నీకు బొత్తిగా తెలియకపోవడం నాకు సిగ్గుగా వుంది. నేను బిషప్ వాల్లర్ స్కూల్లో వున్నప్పుడు మా టీము దగ్గర డజను విల్లార్డ్ జూనియర్స్ ఉండేవి. చాలా అద్భుతంగా వుండేవి. వాటిలో స్ప్రింగులు వుంటాయి. బంతి తగిలితే చాలు సర్రున దూసుకుపోతుంది. పట్టుకొనే చోట మెత్తటి సిల్కు గుడ్డ చుట్టి వుంటుంది. నీకసలేం తెలియదు. అన్నీ తెలిసినట్టు మాట్లాడతావు. విల్లార్డ్ బ్యాట్‌లాంటిది మరొకటి నాకు చూపించగలవా?"

కొద్ది నిముషాలు మౌనంగా వున్నాడు. ''స్వామీ, కాగితం తీసుకో. విల్లార్డ్ జూనియర్ బ్యాట్సు ఆ ఎన్ని కావాలి?'' అన్నాడు రాజం.

''మూడు. సరిపోతాయా మణీ?'' అడిగాడు స్వామి మణిని.

''మూడెందుకూ? డబ్బు దండగ. రెండు చాలు...'' అన్నాడు మణి.

''ఆట మధ్యలో ఒకటి విరిగిపోయిందనుకో, అప్పుడు?'' అన్నాడు రాజం.

''మనతో ఆడే టీముకు కూడా మనమే బ్యాట్లు సప్లయి చెయ్యాలనుకుంటున్నావా? అలా జరగడానికి వీల్లేదు. వాళ్ళ బ్యాట్లు వాళ్ళే తెచ్చుకోవాలి. ఈ విషయంలో మనం ఖచ్చితంగా వుండాలి'' అన్నాడు రాజం.

''మన బ్యాటు ఒకటి విరిగిపోతే మనకు ఇబ్బంది కాదా?'' స్వామి అన్నాడు.

''రెండు చాలు రాజం. నువ్వు డబ్బు పాడుచెయ్య తల్చుకుంటే నేనేమీ చెయ్యలేను'' మణి అన్నాడు.

రాజం చాలా ఉద్విగ్నంగా వున్నాడు. తన కుర్చీలోంచి లేచి, మణి కుర్చీమీద కూర్చుని క్యాటలాగులోని బొమ్మల్ని పరిశీలనగా చూడసాగాడు. స్వామి కూడా లేచి వెళ్ళి మణి కుర్చీ రెండో చేతిమీద కూర్చున్నాడు. ముగ్గురూ క్యాటలాగులోని బొమ్మల్ని దీక్షగా చూడసాగారు.

గంటసేపు ఆలోచించి చివరకు తమ టీముకు కావాల్సిన వస్తువుల్ని ఎంచుకున్నారు. ఇంతవరకు బాగానే వుంది. అసలు కష్టం ఇప్పుడే ప్రారంభం అయింది. ఆ షాపుకు ఉత్తరం రాయాలి. వస్తువులకు ఆర్డరు పంపించాలి. మర్యాదకోసం రాజం మణికి ఉత్తరం రాసే బాధ్యత అప్పగించాడు. కాని మణి అందుకు అంగీకరించ లేదు. బలవంతంగా ఆ బాధ్యత స్వామినాథన్ మీద పెట్టారు. స్వామి పెన్సిల్ నోట్లో పెట్టుకొని అర్ధగంట కూర్చున్నాడు. ఒక్క వాక్యం రాయలేకపోయాడు. స్వామి చిన్న మాటకు స్పెల్లింగు రాయలేడు. 'ద', 'అండ్' అనే మాటలకు స్పెల్లింగ్ రాయాలన్నా అనేక అనుమానాలు వస్తాయి. చివరకు కాగితం, పెన్సిలు, రాజం తీసుకున్నాడు. అర్ధగంటలో ఉత్తరం ముగించి టేబులుమీద పెట్టాడు.

''ఎం.సి.సి. (విక్టరీ యూనియన్ ఎలెవన్)

మాల్గుడి.

మెజర్స్ బిన్నిస్‌కు,
స్పోర్ట్సుమెన్
మౌంటు రోడ్డు
మద్రాసు.

డియర్ సర్,

దయచేసి మా టీముకు రెండు బ్యాటులు (విల్లర్డ్ జూనియర్) ఆరు బంతులూ, క్రికెట్ ఆటకు కావలసిన ఇతర వస్తువులు పంపించగలరు. త్వరగా పంపించండి. మీ వస్తువులు అందాక డబ్బు పంపిస్తాము. డబ్బుకు భయపడకండి. దయచేసి వెంటనే పంపించండి.

మీ విశ్వాస పాత్రుడు,
కెప్టెన్ రాజం (కెప్టెన్)''

ఆ ఉత్తరానికి స్వామినాథన్ ప్రశంసలు లభించాయి. మణికి ఒక సందేహం వచ్చింది. ముక్కూ మొహం తెలియనివాళ్ళకు డియర్ (ప్రియమైన) అని రాయడం ఏమిటనుకొన్నాడు. ''డియర్ సర్, అని ఎలా రాస్తావు? సర్ అని రాయాలిగాని?'' అన్నాడు.

''నేను వట్టి 'సర్' అని అనను. సర్ అని గుమాస్తాలు అంటారు. నేను ఆ షాపువాళ్ళ గుమాస్తాను కాదు. నేను వాడ్ని సర్ అని చస్తే అనను'' అన్నాడు రాజం మొండిగా.

ఉత్తరం వెళ్ళిపోయింది. ఆ పని పూర్తికావడంతో ముగ్గురూ తేలికపడిన మనసులతో కూర్చుని వున్నారు. అదే సమయంలో పోస్టుమాన్ ఒక కార్డు తెచ్చి రాజంకి ఇచ్చాడు. రాజం కార్డు చదివి ''ఎవరు రాశారో చెప్పుకోండి చూద్దాం.'' అన్నాడు.

''బిన్నిస్'' స్వామి.

''తెలివి! మన హెడ్‌మాస్టర్ రాశాడు,'' మణి అన్నాడు.

''కాదు.''

''జె.బి. హాబ్స్!''

''శంకర్‌రాశాడు.'' ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ అన్నాడు రాజం.

''శంకరా? దొంగవెధవను దాదాపు మర్చేపోయాం.'' స్వామినాథన్, మణి, రాజం చేతులోనుంచి కార్డు లాక్కుని చదివారు.

''నా ప్రియమైన రాజం,

నేను ఇక్కడ చదువుతున్నాను. మా నాన్నకు ఇక్కడకు బదిలీ అయింది. మా అమ్మ కూడా ఇక్కడే వుంది. అందరం ఇక్కడే వున్నాం. ఇక్కడే వుంటాం.

నేను బాగానే ఉన్నాను. నువ్వూ బాగానే వున్నావని అనుకుంటున్నాను. ఇక్కడ ఎండలు ఎక్కువగా ఉన్నాయి. నాకు మూడు రోజులు జ్వరం వచ్చింది. మందు తాగాను. బాగా చదివి పరీక్ష పాసవుతాననే అనుకుంటున్నాను. స్వామీ, మణీ బాగున్నారా? ఇక్కడ చాలా వేడిగా ఉంది. నేను క్రికెట్ ఆడుతున్నాను. ఇంతకంటే రాయలేను.

గౌరవంతో,
నీ ప్రియమైన మిత్రుడు
శంకర్."

"పి.యస్.
'నన్ను మరిచిపోకు'
యస్."

ఆ ఉత్తరం చదివి ముగ్గురూ కరిగిపోయారు. వెంటనే సమాధానం ఇవ్వాలని నిర్ణయం తీసుకున్నారు.

గంటలో మూడు ఉత్తరాలు తయారయ్యాయి. మణి శంకర్ ఉత్తరాన్ని తు.చ. తప్పకుండా కాపీ చేశాడు. స్వామి ఉత్తరం, రాజం ఉత్తరం, రెండూ దాదాపు ఒకే మాదిరిగా ఉన్నాయి. "భగవంతుడి దయవల్ల ఇక్కడ అందరూ బాగున్నారు. నువ్వు బాగా చదువు. పాసవుతావు తప్పక" అని రాశారు. తమ క్రికెట్ టీము గురించి రాశారు. శంకర్‌ను కూడా టీములో మెంబరుగా చేరమని ఆహ్వానించారు. శంకర్ టీము, తమ టీము ఓ మ్యాచ్ ఆడటానికి చాలెంజ్ చేసినా పర్వాలేదన్నారు. స్టాంపు అంటించిన కవర్లో ఉత్తరాలు పెట్టారు. కవరు అతికించారు. అప్పుడు గుర్తొచ్చింది శంకర్ అడ్రసు తమ దగ్గర లేదని. శంకర్ రాసిన కార్డును తిప్పి తిప్పి చూశారు. కాని ఒక్క అక్షరం కూడా అడ్రసు తెలిపేది కనిపించలేదు. కార్డుమీద ముద్రలో ఊరి పేరైనా వుంటుందేమోనని చూశారు. నల్లగా మసి పూసినట్టున్న ఆ ముద్రలో అక్షరాలు స్పష్టంగా లేవు.

3

"బినిస్ మద్రాసు" వారినుంచి ఎం.సి.సి. కెప్టెన్ పేర ఉత్తరం వచ్చింది. ఆ సంస్థ కార్యకర్తలు, అంత పెద్ద కంపెనీనుంచి తమకు గుర్తింపు రావడాన్ని గర్వకారణంగా భావించారు. అందంగా వున్న ఆ కవర్ని చేతుల్తో తడిమి చూస్తూ ఆనందంతో ఉప్పొంగిపోయారు. ఇకముందు కూడా తమకు కావాల్సిన వస్తువులన్నీ వాళ్ళనుంచే కొనాలని నిర్ణయం చేసుకున్నాడు రాజం.

మూడు ప్రధాన కారణాల వల్ల తమ సంస్థకు చాలా గొప్ప గుర్తింపు వున్నట్టుగా భావించారు: (1) గౌరవనీయులైన పోస్టాఫీసువారు, తమ సంస్థ

కెప్టెన్ పేరుమీద వచ్చిన ఉత్తరం వెంటనే అందజేశారు; (2) బిన్నిస్ కంపెనీవారు, చిన్న కార్డుమీద జవాబు రాయకుండా, పెద్ద ఉత్తరం-టైపు చేసిన ఉత్తరం-కవర్లో పెట్టి పంపించారు! (3) మరో పెద్ద కవర్లో, పెద్ద క్యాటలాగు పెట్టి, నాలుగణాల స్టాంపులు అతికించి పంపించారు. ఎంత గౌరవం! ఎంత గుర్తింపు!

ఎం.సి.సి. కెప్టెన్ రాసిన ఉత్తరానికి బిన్నిస్ వారు ధన్యవాదాలు తెలిపారు. ముందు 25 శాతం 'రెమిట్' చేసి మిగతా డబ్బు వి.పి.పి. అందుకొని పంపించవలసిందిగా రాశారు. రైల్వే పార్సిల్ ద్వారా పంపిస్తామని రాశారు. చివర్లో కృతజ్ఞతలు కూడా తెలుపుకున్నారు.

ఆ ఉత్తరం అర్థం చేసుకోవడానికి ముగ్గురూ బుర్రలు బద్దలు కొట్టుకున్నారు. ఇంతకూ వాళ్ళు తాము కోరిన వస్తువులు పంపిస్తున్నారో లేదో అర్థం కాలేదు. ''ఒబ్లైజ్'' అన్న పదానికి అర్థం చెబితే వాళ్ళేం రాశారో చెప్పగలను,'' అన్నాడు మణి. ఆ పదం సరిగా పలకలేక పోయాడు.

అర్థం కోసం డిక్షనరీ చూశారు. అందులో ఇచ్చిన అర్థం వారికి అర్థం కాలేదు. ఆ పదం అర్థంలేని పదంగా అనిపించింది. ''ఒకటి మాత్రం నిజం! వాళ్ళు మనకు'థ్యాంక్సు' చెప్పారు. అంటే మనకు వస్తువులు పంపిస్తామనేగా?'' రాజం చెప్పాడు. స్వామినాథన్ అతని అభిప్రాయంతో ఏకీభవించాడు. ఉత్తరం తీసుకొని అందులో 'థ్యాంక్సు' అనే పదం వుందో లేదో చూశాడు. ''అవును రాజం, వస్తువులు పంపడానికి ఇష్టం లేకపోతే 'థ్యాంక్సు' అని ఎందుకు రాస్తారు?''ఏదో పెద్ద సత్యం కనుగొన్నట్టు ముఖం పెట్టాడు స్వామినాథన్.

''వాడొక ఫూల్! ఆ మాట రాయకపోతే నేం? అసలు వాళ్ళు మనల్ని ఆట పట్టించడానికే ఆ మాట రాశారేమో?'' పెద్ద సందేహాన్ని వెలిబుచ్చాడు మణి.

''అదేదో 25 శాతం 'రెమిట్' అన్నాడు. అది తెలిసినా చాలు.'' అన్నాడు రాజం.

''నీకు ఆ ఉత్తరం అర్థం కాలేదంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది రాజం. పరీక్షల్లో 60 శాతం మార్కులు వచ్చాయి నీకు.'' అన్నాడు స్వామి.

''నీకసలు బుర్రుందా? దానికీ దీనికీ సంబంధం ఏమిటి? బి.ఏ. పాసయినవాళ్ళకూడా ఈ ఉత్తరం అర్థంకాదు,'' అన్నాడు రాజం. చివరకు ఆ ఉత్తరం తమకు రాసింది కాదనే అభిప్రాయానికి వచ్చారు. తమకు రాసే సమాధానంలో ''ఒ బ్లైజ్, రెమిట్, 25 పర్సెంటు'' అనే పదాలు రాయాల్సిన

అవసరం ఏముంది? అంత పెద్దవాళ్ళకు తమతో ఆడుకోవాల్సిన పనికూడా లేదు. ఏదో పొరపాటు జరిగింది.

''కెప్టెన్ ఎం.సి.సి.కి అని సంబోధించాడుగా?'' అన్నాడు స్వామినాథన్.

''అది కూడా పొరపాటే.''

ఒక ఉత్తరం రాసి, వాళ్ళ ఉత్తరంతో జతపరచి కవర్లో పెట్టి పోస్టు చేశారు. ఆ ఉత్తరం ఇలా ఉంది:

''మీరు ఎవరికో రాసిన ఉత్తరం పొరపాటుగా మాకు పంపించారని తెలియజేయడానికి చింతిస్తున్నాం. ఆ ఎవరికో రాసిన, మీ ఉత్తరం, మీకే పంపిస్తున్నాం. దయచేసి మేము ఆర్డరు చేసిన వస్తువులు త్వరగా పంపించండి.''

## 4

ఎం.సి.సి. మీద ఆ ముగ్గురూ ఎన్నో ఆశలు పెంచుకున్నారు. ఎన్నెన్నో ఊహించుకొన్నారు. ఇంతవరకు బిన్నిస్‌వారినుంచి ఉత్తరం రాలేదు. వస్తువులు రాలేదు. నిరాశ చెందకుండా రోజూ పోస్టుమాన్ కోసం ఎదురుచూస్తూనే ఉన్నారు. పది రోజులు గడిచిపోయాయి. చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. అసలైన బ్యాట్లూ, బంతులూ వచ్చేవరకూ ఆగకుండా ఏదోవిధంగా ఆట ప్రారంభించాలనుకొన్నారు. రాజం, తండ్రి క్లబ్బులో వాడి పారేసిన మూడు టెన్నిస్ బంతుల్ని సంపాదించాడు. వికెట్లుగా ఉపయోగించే నిజమైన కర్రలు తమ ఇంట్లో వున్నాయని బఠాణీ చెప్పాడు. వాటిని తెస్తానని మాట ఇచ్చాడు. రాజం ఇంటి వెనక ఖాళీ స్థలం 'పిచ్'గా ఉపయోగించుకోవాలనుకొన్నారు. ఆటకు కావలసినవి అన్నీ ఉన్నాయి. బిన్నీస్‌వారు ఆలస్యంగా వస్తువులు పంపించినా దిగులు లేదు. ఎం.సి.సి. వారికోసం బిన్నీస్ కంపెనీ ప్రత్యేకంగా బ్యాట్లు తయారు చేస్తూ వుండివుంటారనే నమ్మకం కూడా వారికి కలిగింది. అందుకే ఇంత ఆలస్యం అయిందనుకున్నారు. ఇక క్రికెట్ ప్రాక్టీసు మొదలు పెట్టవచ్చు. మద్రాసునుంచి బ్యాట్లూ, బంతులూ వచ్చేసరికి, మాచ్‌లో పాల్గొనే స్థాయికి చేరుకోవచ్చు.

రాజం తన క్లాసులో చదివేవాళ్ళను కొందర్ని ఎం.సి.సి. సభ్యులుగా తీసుకొన్నాడు. బాగా ఆలోచించి, పనికొస్తారనుకొన్న వాళ్ళను మాత్రమే తీసుకొన్నాడు.

ఆ రోజే ఆట ప్రారంభం. సాయంత్రం ఐదు గంటలకు మైదానంలో ఎం.సి.సి. సభ్యులు సమావేశమయ్యారు. అందరూ వచ్చారు. బఠాణీ రాలేదు.

రాజం ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాడు. ఏమయ్యాడు? అసలైన వికెట్ కర్రలు తెస్తానన్నాడు. అర్థగంట గడిచింది. బతాణీగాడు ఇంకా రాలేదు.

చాలా దూరంగా ఓ పీలగా వున్న ఆకారం నడిచి వస్తున్నట్టుగా అనిపించింది. రాజం బతాణీగాడ్ని గుర్తించాడు. మనసు స్థిమిత పడింది. నీరెండలో నడిచి వస్తున్న బతాణీ చేతుల్లో కర్రలు ఉన్నాయో, లేవో తెలియడం లేదు. అందరూ ఎండకు కళ్ళపైగా అరచేతుల్ని అడ్డం పెట్టుకొని చూడసాగారు. అతడి చేతుల్లో కర్రలు ఉన్నాయన్నారు కొందరు. మరి కొందరు లేవు, చేతులు ఆడించుకుంటూవస్తున్నాడన్నారు.

''కర్రలు లేవని ముందే ఎందుకు చెప్పలేదు?'' గట్టిగానే అడిగాడు రాజం.

''ఉన్నాయి. కాని ఎక్కడున్నాయో కనిపించలేదు. మా నాన్నకు అవి ఎక్కడున్నాయో తెలుసు. రేపు తెస్తాను.''

''నీకోసం ఇంతవరకూ ఎదురు చూస్తూ ఉన్నాం. ముందే వచ్చి ఆ మాట చెప్పొచ్చుగా?''

''పొద్దుటినుంచీ వెదుకుతూనే ఉన్నాను. రెండు పనులూ ఒకేసారి ఎలా చెయ్యగలను?''

అందరూ నీరు కారిపోయారు. గత ఇరవై నాలుగు గంటలుగా అందరూ ఆడబోయే ఆట గురించి కలలు కన్నారు. బ్యాటుతో గాలిలోకి లేస్తున్నట్టూ, బంతితో పరుగు తీస్తున్నట్టూ, దూసుకుపోతున్న బంతి ఎగిరి పట్టుకున్నట్టూ, రక రకాలుగా ఊహించుకున్నారు. అందరికీ బతాణీమీద మింగేద్దామన్నంత కోపం వచ్చింది. వాడితో ఎవరూ మాట్లాడలేదు. ముఖాలు ముడుచుకున్నారు. బ్యాట్లుగా ఉపయోగించడానికి తెచ్చిన కర్రచెక్కలూ, టెన్నిస్ బంతులూ చూస్తుంటే రాజంకు ఏడుపే వచ్చింది.

వీడు–ఈ బతాణీగాడు ఇలా చేసివుండకపోతే ఈ సాయంత్రం ఎంతో సంతోషంగాగడిచిపోయేది?

అందరూ దిగులుగా వున్నారు. ప్రహరీ గోడను వికెట్‌గా గుర్తుపెట్టుకొని ఆడదామని ఒకడు సలహా ఇచ్చాడు. ఆ సలహా అందరికీ నచ్చింది.

గోడమీద కొంత భాగాన్ని బొగ్గుతో గుర్తుపెట్టారు. ఆ భాగాన్ని వికెట్‌గా భావించాలనుకొన్నారు. రాజం బ్యాటింగ్‌కి దిగాడు. ఆట ప్రారంభం అయింది. స్వామినాథన్ బౌలర్. టెన్నిస్ బంతి పట్టుకొని వెనక్కు వెనక్కు కొన్ని అడుగులు వేశాడు. ఒక్కసారిగా ముందుకు పరుగుతీస్తూ బంతి విసిరాడు. రాజం తన బ్యాటుతో దూసుకుపోతున్న ఆ బంతిని ఆపలేకపోయాడు. అది వెళ్ళి గోడమీద మార్కు చేసిన భాగాన్ని కొట్టింది. మొదటి దెబ్బకే రాజం

అవుటయి పోయాడు. అందరూ చప్పట్లు కొట్టారు. స్వామినాథన్ చుట్టూ చేరి పొగడ్తలతో అతడ్ని ముంచేశారు. వీపు తట్టారు. అప్పటికప్పుడే ''టెటే'' అనే బిరుదు ఇచ్చేశారు.

## అధ్యాయం 14

# బొమ్మ అజ్ఞానం

### 1

బోర్డు హైస్కూల్లో చదువు భారం ఎక్కువ. హోంవర్కు కూడా కుప్పలు తిప్పలు. అల్బర్ట్ స్కూల్లో ఇచ్చే హోం వర్కు, దీంతో పోలిస్తే చాలా చాలా తక్కువనే చెప్పాలి. ఇక్కడ ప్రతి టీచరూ, విద్యార్థి, తను చెప్పే సబ్జెక్టు కోసమే స్కూలుకు వస్తున్నట్టు ప్రవర్తిస్తాడు. ఆరు లెఖ్ఖలు, ఐదు పేజీల చూచి వ్రాత, డిక్షనరీ చూసి అర్థాలు రాయాల్సిన కఠిన పదాల పెద్ద లిస్టు, రెండు దేశ పటాలు, ఐదు తమిళ పద్యాలు, ఇది సర్వసామాన్యంగా ఈ స్కూల్లో ఇచ్చే హోంవర్కు. పాత స్కూలు వదిలేసి వచ్చివుండాల్సింది కాదనుకుంటాడు స్వామినాథన్ అనేకసార్లు. ఇక్కడి టీచర్లు బొత్తిగా దయాదాక్షిణ్యాలు లేనివాళ్ళు. సాయంకాలాలలో వారానికి మూడు రోజుల డ్రిల్లు క్లాసులు. రెండు రోజులు స్కౌట్ క్లాసులు. ఇవికాక తప్పనిసరిగా వుండే ఆటలు. ఇందులో ఏ ఒక్క క్లాసుకు గైరుహాజరైనా రెండోరోజు పేము బెత్తం వాతలు తప్పవు. ఇక ఈ స్కూలు హెడ్‌మాస్టరు - భూతద్దాల కళ్ళజోడు, కీచు గొంతు, ఇతనికంటే చాలా విషయాల్లో అల్బర్ట్ స్కూలు హెడ్‌మాస్టరే నయం. ఇవీ స్వామినాథన్ అభిప్రాయాలు.

ఈ స్కూల్లో చదివే విద్యార్థులకు విరామ సమయం దాదాపు లేనట్టే. స్వామినాథన్ చాలా త్వరగా నిద్ర లేస్తాడు. హోంవర్కు చేసుకుంటాడు. స్నానం భోజనం ముగించుకొని స్కూలుకు బయలుదేరతాడు. మార్కెట్ రోడ్ చివర్లో వున్న బట్టలషాపు దగ్గిరకు వచ్చేసరికి స్వామినాథన్‌కు స్కూలు మొదటి గంట వినిపిస్తుంది. క్లాసులో అడుగు పెడుతుండగానే రెండో గంట మోగుతుంది. ఈ గంట మోత కూడా అంత బాగా వుండదు. పాత స్కూలు గంట మోత అంటేనే స్వామినాథన్‌కు ఇష్టం. రాను రాను ఈ గంట మోతకు అలవాటుపడ్డాడు.

మధ్యాహ్నం ఒక అర్ధగంట తప్ప, స్కూలుకు వచ్చినప్పటినుంచి, సాయంకాలం నాలుగున్నర దాకా సీటుకు అతుక్కుపోయి వుండాల్సిందే. స్వామినాథన్ చివరి బెంచీమీద కూర్చునే అలవాటునుంచి బయటపడ్డాడు.

(బహుశా ఇక్కడ మణి సాహచర్యం లేకపోవడం వల్లనే కావచ్చు.) రెండో వరసలో కూర్చుంటున్నాడు. బుద్ధిగా పాఠాలు వింటున్నాడు. టీచర్ ఎదురుగా, దగ్గరగా వుండడం వల్ల అల్లరికి ఆస్కారం లేదు. నాలుగున్నరకు బెల్ మోగుతుంది. పెన్సిల్ జేబులో పెట్టుకొని చేతి వేళ్ళు విరుచుకుంటాడు. రాసి రాసి వేళ్ళు నొప్పులు పుడ్తాయి. నాలుగున్నర గంట మ్రోగినా ఆనందం లేదు. గంట విని కేరింతలు కొడ్తూ బయటికి పరుగులు తీసే అవకాశం లేదు. అక్కడ్నుంచి డ్రిల్లు క్లాసుకు వెళ్ళాలి.

ఆ నలభై అయిదు నిముషాలు డ్రిల్లు టీచరు నిన్ను అతడి పెంపుడు కుక్కలా చూస్తాడు. వెనక్కూ, ముందుకూ నడిపిస్తాడు. చేతులు గాలిలోకి ఊపమంటాడు. 'లఫ్ట్ - రైట్ - మార్చ్'అంటూ ఇష్టం వచ్చినట్టు కసరత్తు చేయిస్తాడు. సువ్వలు పట్టుకొని పైకి ఎక్కమంటాడు కిందకు దూకమంటాడు. ఆ పని నువ్వు చెయ్యగలవో లేదో అతడికి అనవసరం. సువ్వలు పట్టుకొని పైకి పాకుతున్నప్పుడు జారి పడితే? డ్రిల్లు టీచరుదేం పోయింది?

చివరకు ఇంటికి పరుగు తీస్తావు. పుస్తకాలు ఓ మూలకు విసిరేస్తావు. కాఫీ తాగి క్రికెట్ ఆటకు బయలుదేరతావు. సూర్యబింబం పడమటి దిక్కున ఎర్రగా అస్తమించడానికి సిద్ధంగా ఉంటుంది. సూర్య కిరణాలు పచ్చికమీద పడుతూ వింత రంగుల్ని సృష్టిస్తాయి. ఆలస్యం అయిపోతుందనే ఆదుర్దా. కాసేపు పరుగు, కాసేపు నడక. సూర్యాస్తమయం కాకముందే క్రికెట్'పిట్'కి చేరుకోవాలి. సూర్యాస్తమయం అవుతుంది. వీధి దీపాలు వెలుగుతాయి. నువ్వు పరుగులంకించుకుంటావు. ఆట ప్రాక్టీసుకు ఇంకా సమయం ఉందనే ఆశతో పరుగులు తీస్తావు. అల్లంత దూరంలో వుండగానే నీకు ఆట స్థలంలో, ఆటగాళ్ళు ఇటూ అటూ తిరుగుతూ కనిపిస్తారు. ఆట ఆపేశారని తెలిసిపోతుంది.

మనసు చివుక్కుమంటుంది. బాధగా 'పిచ్'లో కాలు పెట్టిన నీకు రాజం మందలింపు ఎదురౌతుంది. వాడికి బొత్తిగా ఎదుటివాడి కష్టసుఖాలు తెలియవు. తెలుసుకోవడానికి ప్రయత్నించడు. తన ధోరణే తనది. ''ఓ స్వామీ! ఇవ్వాళా ఆలస్యమేనా?''

''డ్రిల్లు క్లాసు...''

''డ్రిల్లు క్లాసు కాకపోతే స్కౌట్ క్లాసు. రోజూ ఏదో ఒకటి చెప్పకపోతే కాస్త ముందుగారాకూడదూ?''

''ఏం చెయ్యమంటావో చెప్పు.''

''సరి! సరి! రోజూ ఏదో ఒక సాకు చెబుతూనే వుంటావు. కొత్త బ్యాట్లూ, బంతులూ వచ్చాక నువ్వెన్నిసార్లు ప్రాక్టీసుకు వచ్చావో చెప్పు. నాలుగుసార్లు వచ్చావు. అంతే! ఇలా అయితే కష్టం!''

స్వామితో ఆడడానికి ఎవరూ ఇష్టపడలేదు. ''అలసిపోయాం. మళ్ళీ ఆడలేం''అన్నారు. అందరికంటే చిన్నవాడ్ని ఒప్పించి ఆటలోకి దిగాడు స్వామి. ఆ బుడ్డోడు ఐదోక్లాసు చదువుతున్నాడు. బంతి విసరడానికి భయపడుతున్నాడు. స్వామి మరి 'టెటే' కదా? అందుకే భయం. వాడికి బ్యాటు ఇచ్చి తను బౌలింగ్ తీసుకొన్నాడు స్వామి. కొంతసేపు ఆడాక స్వామి మళ్ళీ బ్యాటు తీసుకున్నాడు. చీకటి పడింది. అక్కడున్న చిన్న చిన్న వస్తువులన్నీ బంతిలాగే కనిపిస్తున్నాయి. ఎం.సి.సి. కేప్టెన్ ఆట ఆపమని ఆర్డరు చేశాడు. అందరూ వెళ్ళిపోయారు. ముగ్గురు మిత్రులూ మిగిలిపోయారు. ప్రహరీ గోడకు చేరబడి నిల్చున్నారు. ఆనాటి ఆట గురించి దీర్ఘంగా చర్చించుకున్నారు పెద్ద పెద్ద క్రికెట్ ఆటగాళ్ళ గురించి మాట్లాడుకున్నారు. వారి మంచి చెడుల్ని గురించి చర్చించుకున్నారు.

బాగా చీకటి పడిపోయింది.

ట్యూషన్ మాస్టారు వచ్చాడని రాజం ఇంటినుంచి ఒక బంట్రోతు వచ్చి చెప్పాడు.

## 2

ఆ రోజు క్రికెట్ మైదానం నుంచి మణితోపాటు ఇంటికి బయలుదేరాడు స్వామి. గ్రోవ్ స్ట్రీట్ కూడలిలో మణి మార్గం వేరయింది. స్వామికి ఇంటికి వెళ్ళాలంటే అదోలా వుంది. తప్పు చేసినవాడిలా బాధపడుతున్నాడు. ఆ సాయంకాలం చిన్న పొరపాటు పని చేశాడు. స్కూలునుండి ఇంటికి వస్తూనే పుస్తకాలు టేబుల్‌మీదకు గిరాటు పెట్టి వంటింటికేసి పరుగు తీశాడు. వెనకనుంచి ''ఒరే స్వామీ! ఒకసారి ఇలారా! అబ్బాయ్! నిన్నేరా!'' బామ్మ పిలుపు వినిపించింది.

''రాను!'' అంటూ వంటింట్లోకి వెళ్ళి కాఫీ గ్లాసు తీసుకొని గటగట తాగసాగాడు. బామ్మ వణుకుతున్న కంఠస్వరం ఇంకా వినిపిస్తూనే ఉంది. స్వామికి బామ్మమీద జాలి వేసింది.''పాపం! బామ్మ! రోజంతా అలా కూర్చుని ఎవర్నో ఒకర్ని పిలుస్తూనే వుంటుంది. సాధారణంగా ఎవరూ ఆమె మాటల్ని పట్టించుకోరు. ''ఏం కావాలి?'' అన్నాడు స్వామి బామ్మ దగ్గరకు వచ్చి.

బామ్మ తలెత్తి స్వామిని చూసింది. కూర్చోమన్నది. స్వామికి చిరాకు వేసింది. అంతకు ముందు కలిగిన జాలి ఇట్టే ఎగిరిపోయింది. ''ఏం కావాలో త్వరగా చెప్పు. దద్దమ్మలా నీ దగ్గిర కూర్చుండిపోతా ననుకోకు,'' అన్నాడు.

''నేను ఆరు పైసలు ఇస్తాను. మూడు పైసలు నువ్వు తీసుకో. మూడు పైసలు పెట్టి నాకొక నిమ్మకాయ తెచ్చిపెట్టు.'' మనవడి మీద లౌక్యం ఉపయోగించింది. కూర్చోమనడం కూడా లౌక్యంలో భాగమే.



మరో మాట మాట్లాడకుండా పైసలకోసం స్వామినాథన్ చెయ్యి చాపాడు. ''త్వరగా రావాలి. నేను పది లెక్కపెట్టే లోపల రావాలి.'' స్వామినాథన్‌కు వళ్ళు మండిపోయింది. పైసలు విసిరికొట్టి ''అంత అర్జంటుగా కావాలంటే వెళ్ళి తెచ్చుకో,'' అన్నాడు.

''తొందరేం కాదు. నువ్వు వచ్చేటప్పుడు తీసుకురా'' అని అంటుందేమోనని కొద్ది క్షణాలు ఎదురుచూశాడు.

''నాకు కడుపులో నొప్పిగా వుందిరా. త్వరగా నిమ్మకాయ తెచ్చిపెట్టు. మా నాయనవు కదూ...'' ఆమె మాట పూర్తికాకుండానే గిర్రున తిరిగి బయటికి పరుగుతీశాడు. అప్పటికే ఆలస్యం అయింది. సూర్యాస్తమయానికి ముందే క్రికెట్ ఫీల్డులో వుండాలి.

ఆట పూర్తి అయింది. ఉద్వేగం చల్లబడింది. అందరిదగ్గరశెలవు తీసుకొని ఇంటికి బయలుదేరాడు. గ్రోవ్ కూడలిలో, వినాయక మొదలి స్ట్రీటులో నడుస్తున్నాడు. బామ్మ గుర్తొచ్చింది. తప్పు చేశానన్న భావం మనసును పీడిస్తున్నది. ఈ సమయంలో కడుపు నొప్పితో మెలికలు తిరిగిపోతున్నదేమో? కన్నీటితో తల పైకెత్తి చూస్తున్నట్టుగా ఆమె రూపం కళ్ళల్లో కదిలింది.

తను ఒక వెధవ! దొంగ వెధవ! కృతజ్ఞత లేనివాడు! పెద్ద విలన్‌గాడు! తనను తనే తిట్టుకుంటూ ఇల్లు చేరాడు. తిన్నగా బామ్మ దగ్గరకు వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. ఆమెను చూస్తూ కూర్చున్నాడు. ఇలా ఇంతకు ముందెన్నడూ చెయ్యలేదు. బయటినుంచి వస్తూనే వంటింట్లో జొరబడి వంటవాడి ప్రాణం తింటాడు. ఈ రోజు స్వామి ఆకలి మరిచిపోయాడు.

బామ్మ వుండే వరండాలో లైటు లేదు. హాల్లో వున్న దీపపు వెలుగే మసక మసగ్గా పడుతుంది. ఈ గుడ్డి వెలుగులో ఆమె ముఖం స్పష్టంగా కనిపించడం లేదు. ఆమె కదల లేదు. స్వామినాథన్‌కు ఆమె కడుపు నొప్పితో చచ్చిపోయిందేమోననే సందేహం కలిగింది. నిలువెల్లా వణికిపోయాడు. గొంతు పెగుల్చుకొని ''బామ్మా! కడుపునొప్పి ఎలా వుంది?'' అన్నాడు. బామ్మ కదిలింది. కళ్ళు తెరిచింది. ''స్వామీ వచ్చావా? అన్నం తిన్నావా నాయనా?'' అన్నది.

''ఇంకా లేదు. నీ కడుపునొప్పి ఎలా వుంది బామ్మా?''

''తగ్గిపోయింది బాబూ! తగ్గిపోయింది.''

శక్తినంతా కూడదీసుకొని సాహసించి అడిగాడు- ''నిమ్మకాయ తెప్పించుకున్నావా?'' ఆ విషయం తెలుసుకోలేకుండా వుండలేకపోయాడు. బామ్మ సమాధానం ఇవ్వడానికి కొద్ది క్షణాలు పట్టింది. కాని స్వామికి ఎన్నో గంటలు ఎదురు చూసినట్టుగా అనిపించింది. ఆమె ఏం చెబుతుందో ? తనను తిడుతుందేమో? ''నువ్వు నిమ్మకాయ టైంకు తెచ్చివ్వలేదు. నేనింకెంతో సేపు బతకను'' అని చెబితే? స్వామినాథన్ ఊపిరి బిగబట్టి ఆమె సమాధానం కోసం ఎదురు చూశాడు. ''నువ్వు మంచిపని చేశావురా. మీ అమ్మదగ్గర డజను నిమ్మకాయలున్నాయ్.''

ఆ సమాధానం విని స్వామినాథన్ గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు. సంతోషం పట్టలేక అన్నాడు- ''బామ్మా! నీకు నా కొత్త పేరు తెలుసా? టెటే!''

''ఏమిటేమిటీ?''

''టెటే.''

''టెటే అంటే?'' అమాయకంగా అడిగింది. స్వామినాథన్ నీరుకారిపోయాడు. తన కొత్త బిరుదు ఆమెకు అర్థం కాలేదు. దాని గొప్పతనం అసలే అర్థం కాలేదు. మరోసారైతే స్వామినాథన్ చిరాకుపడి వెళ్ళిపోయేవాడు. కాని అంతకు ముందే తప్పుచేశానని పశ్చాత్తాపం పడివున్నాడు. శాంతంగా అడిగాడు- ''అయితే బామ్మా! నీకు 'టెటే' అంటే తెలియదు కదూ?''

''నువ్వేమంటున్నావో నాకు బొత్తిగా బోధపడడం లేదు.''

''టెటే చాలా గొప్ప క్రికెట్ ఆటగాడు. అసలు ప్రపంచంలోకెల్లా గొప్ప బౌలర్. నీకు క్రికెట్ అంటే తెలుసుకదూ?''

''తెలియదు. ఏమిటది?''

బామ్మ సమాధానం విని చాలా ఆశ్చర్యపోయాడు. ''నీకు క్రికెట్ అంటే నిజంగా తెలియదా బామ్మా? నన్ను ఎగతాళి పట్టిస్తున్నావుగదూ?''

''నువ్వంటున్నదేమిటో నాకు అర్థంకావడం లేదురా స్వామీ!''

''ప్రతిసారీ నువ్వంటున్నదేమిటో నాకు అర్థం కావడం లేదు అనకు. మీ రోజుల్లో కుర్రాళ్ళు సాయంకాలం పూట ఏం చేసేవాళ్ళో నాకూ అర్థం కావడం లేదు!''

స్వామినాథన్ ఆలోచనలో పడ్డాడు. బామ్మ అజ్ఞానాంధకారంలో పడి కొట్టుకుంటున్నది. ఆమెను ఆ చీకటిలోనుంచి వెలుగులోకి తీసుకురావాలి. అది తన బాధ్యత.

స్వామి చిన్నపాటి ఉపన్యాసం ఇచ్చాడు. క్రికెట్ గురించి అనేక విషయాలు చెప్పాడు. దానికి సంబంధించిన నియమ నిబంధనలు, ఆశయాలు, ఆదర్శాలు, సిద్ధాంతాలూ ఒకటేమిటి తనకు తెలిసినవన్నీ బామ్మకు చెప్పాడు. మధ్య మధ్య ఆగి ''అర్థం అయిందా బామ్మా?'' అని అడిగాడు. ఆమెకు మనవడు చెప్పిన విషయాలు అర్థంకాకపోయినా ''అయింది'' అన్నట్టుగా తల ఆడించింది. ఎం.సి.సి. చరిత్ర వివరించాడు. ముందు ముందు అది చేపట్టబోయే కార్యక్రమాల వివరణ ఇచ్చాడు. ''రాజం లేకపోతే మేము ఎక్కడ వుండేవాళ్ళమోఏమో! క్రికెట్ బ్యాట్లూ, బంతులూ కొనడం మాట కాదు. చాలా డబ్బులు కావాలి. రాజం పెట్టెలో చాలా డబ్బుంది. బాగా ఖర్చుపెడ్తాడు. మా ఎం.సి.సి.ని ప్రభుత్వం కూడా గుర్తించింది. కావాలంటే నువ్వు మా కెప్టెన్‌కు ఒక ఉత్తరం రాయి. అది తిన్నగా రాజంకు అందుతుంది. చూస్తూండు. మాల్గుడిలో ఉన్న కప్పులన్నీ మేమే గెల్చుకుంటాం. కొద్దిరోజుల్లో మద్రాసు క్షురకుంకలకు కూడా మా తడాకా చూపించబోతున్నాం. ప్రతి బజారు వెధవా మా టీములో సభ్యుడు కాలేడు తెలుసా?''

స్వామి తండ్రి వెనక నిల్చుని వింటున్నాడని స్వామి గ్రహించలేదు. బేబీని ఎత్తుకొని నిల్చున్నాడు.

''ఏమిటోయ్! బామ్మదగ్గర కోతలు కోస్తున్నావ్?'' అన్నాడు స్వామి తండ్రి.

స్వామి గిర్రున తిరిగి చూశాడు.

సిగ్గుతో అష్టవంకర్లు తిరిగాడు.

''ఆపావేం? చెప్పు నేనూ వింటాను.''

''ఏంలేదు. బామ్మ క్రికెట్ గురించి అడుగుతుంటే నేను చెప్తున్నాను.'' సిగ్గుపడిపోయాడు.

''ఓహో! అలాగా మా అమ్మ క్రికెట్ ఉమన్ అని ఇవ్వాళే నాకు తెలిసింది. ఏమ్మా! స్వామి దగ్గర అన్ని విషయాలూ తెలుసుకున్నా వనుకుంటాను. బాగానే జ్ఞానబోధ చేసినట్టున్నాడు.

''వాడిని ఎగతాళి చెయ్యకురా! వాడికి నేనంటే ప్రాణం. ఏ విషయమైనా నాకు చెప్పకుండా ఉండలేడు. నువ్వేనాడైనా నాకు ఏదైనా చెప్పావా? మీరంతా గొప్పవాళ్ళురా! నాకెందుకు చెప్తారు? పిచ్చి ముండను.''

''కొద్దిరోజులు ఆగమ్మా! ఈ బుజ్జిగాడు కూడా నీకు లెక్చర్లు ఇస్తాడు,'' అన్నాడు బేబీ బుగ్గలు నిమురుతూ. పసివాడు బోసి నవ్వులు విరజిమ్ముతూ కేరింతలు కొట్టాడు. ''చూశావా అమ్మా! వీడు ఇప్పట్నుంచే

ఉపన్యాసం దంచుతున్నాడు!'' అన్నాడు తండ్రి చిన్న కొడుకును మురిపెంగా చూసుకుంటూ. ''ఇలా ఇవ్వరా వాణ్ని'' బామ్మ మనవడికోసం చేతులు చాచింది. ''వద్దులేమ్మా. అసలు నేను ఇవ్వాళ ఇంటికి త్వరగా వచ్చింది వీడితో ఆడుకోవడానికే. పదరా స్వామీ! భోజనం చేద్దాం పద! మీ అమ్మ ఎక్కడుందో చూడు.''

3

స్వామి ప్రవర్తన కెప్టెన్‌కు బొత్తిగా నచ్చలేదు. ''స్వామీ చివరిసారిగా చెప్తున్నాను. నీకు బొత్తిగా ప్రాక్టీసు లేదు. అసలు నీకు ఆటమీద శ్రద్ధ లేదు.''

''ఈ వెధవ బోర్డు హైస్కూలు...''

''నిన్నెవరు అక్కడ చేరమని బలవంతం చేశారు? వాళ్ళు వచ్చి నిన్ను బతిమాలారా? ఇక ఆ సంగతి వదిలెయ్. బ్రాడ్‌మాన్, 'టెటే' మొదలైనవాళ్ళు రోజూ నాలుగైదు గంటలు ''పిచ్''లో వుండేవాళ్ళు. వాళ్ళకంటే నువ్వు గొప్పవాడివనుకుంటున్నావా?''

''కెప్టెన్ నా మాట కూడా కాస్త విను. ఈ స్కూలు టైంటేబుల్...''

''ఏదో మార్గం ఆలోచించాలిగా? ఆ, స్వామీ! నువ్వు మీ హెడ్‌మాస్టరుతో మాట్లాడు. మాచ్ అయిపోయేదాకా స్పెషల్ పర్మిషన్ తీసుకో.''

చెప్పడం తేలికే. భూతద్దాల కళ్ళజోడులో నుంచి చూస్తూ, కీచు గొంతులో అరిచే హెడ్‌మాస్టరు రూపం కళ్లముందు కదిలింది.

''హెడ్‌మాస్టరొక పెద్ద రాక్షసుడు. అతడిని చూస్తేనే నాకు భయం. అతిగా పోతే అదే క్లాసులో ఎన్నేళ్ళు ఉంచేస్తాడో చెప్పడం కష్టం. చాలా దుర్మార్గుడు. ఆయనను గురించి నీకు బాగా తెలియదు,'' అన్నాడు స్వామి.

''అవునా? నీకు హెడ్‌మాస్టరంటే అంత హడలని నాకు తెలియదు. నేను కలిసి మాట్లాడతాను.''

''అమ్మ బాబోయ్! అంత పని చెయ్యకు. ప్లీజ్! హెడ్‌మాస్టరు చాలా చెడ్డవాడు రాజం. నిన్ను సరిగ్గా చూడడు. లేదా నువ్వు వచ్చేశాక నన్ను సతాయిస్తాడు. నా ప్రాణం తీస్తాడు.''

''నీకేమైందిరా స్వామీ? నీ బుర్రనిండా బురదేలాగుంది. మరి మనం ఎలా గట్టెక్కడం? మాచ్ కోసం ప్రాక్టీసు మొదలుపెట్టి రెండు నెలలు అయింది. నువ్వు పది రోజులైనా వచ్చావా...''

గోడకు చేరబడి ఈ సంభాషణ వింటున్నాడు మణి.

''మీ హెడ్‌మాస్టరు నీ ప్రాణం తీస్తే ఆయన్ని నేను పచ్చడి చేస్తాను. చాలాకాలంగా నా దుడ్డుకర్రలకు పనిలేదు'' అన్నాడు మణి.

రాజం ఆ తెల్లవారి ఉదయం బోర్డు హైస్కూలు హెడ్‌మాస్టర్ని చూడడానికే నిశ్చయించుకున్నాడు. ''నీకు క్లాసు లేదా?'' అడిగాడు స్వామి. ''ఉన్నా పర్వాలేదు. వెళ్లను'' అన్నాడు రాజం. అతడికి చెప్పి లాభం లేదనిపించి మౌనం వహించాడు స్వామి.''నేనూ వస్తాను'' అన్నాడు మణి. ''నీ పని చూసుకో'' అన్నాడు రాజం.

మర్నాడు ఉదయం స్వామి కళ్ళు ఎర్రబడేలా నలుపుకొన్నాడు. తండ్రిదగ్గరకెళ్ళి తలనొప్పిగా ఉందని చెప్పాడు. తండ్రి స్వామి నుదురుమీద చెయ్యిపెట్టి చూశాడు.''ప్రమాదం లేదు. ముఖంమీద చల్లటి నీళ్ళు కొట్టుకో తలనొప్పి తగ్గుతుంది'' అన్నాడు.

''అలాగే నాన్నగారూ!'' బయటికి వెళ్ళి ఆలోచిస్తూ నిలబడ్డాడు. చల్లటి నీళ్ళు ముఖానికి కొట్టుకుంటే తలనొప్పి తగ్గుతుందా? అయితే తను ఆ పని చెయ్యకూడదు. అలా చేస్తే స్కూలుకు వెళ్ళాల్సి వస్తుంది. రాజం హెడ్‌మాస్టర్ని కలవడానికి వస్తాడు. తను ఆ సమయంలో అక్కడ వుండకూడదు. మళ్ళీ లోపలకు వచ్చి-''నాన్నా చల్లటి నీళ్ళు ముఖంమీద చల్లుకోమన్నారు కదూ?''

''అవును!''

''నిమోనియా వస్తుందేమోనని భయంగా వుంది. కొంచెం జ్వరం వచ్చినట్టుగా అనిపిస్తున్నది.''

తండ్రి అసహనంగా చూశాడు. ''సరే! వెంటనే స్కూలుకు వెళ్ళు. ఏమీ కాదు, వెళ్ళు.''అన్నాడు.

తన తండ్రిదగ్గర స్కూలు మానెయ్యడానికి పర్మిషన్ తీసుకోవడంకంటే, రాయినుంచి పాలు పిండుకోవడం తేలిక అనుకున్నాడు.

''బామ్మా! ఒకవేళ నేను చచ్చిపోతే, నాన్న నా శవాన్ని కూడా స్కూలుకు పంపిస్తాడు.'' బామ్మదగ్గరకొచ్చి గొణిగాడు. బామ్మ అలాంటి మాటలు అనకూడదని మందలించింది.

''బామ్మా! జ్వరంతో వళ్ళు కాగిపోతున్నది. తలనొప్పితో తల బద్దలైపోతున్నది. అయినా నేను స్కూలుకు వెళ్ళాలి.''

''స్కూలుకు వెళ్ళొద్దు'' అని కోడల్ని కేకవేసింది.

''చూడమ్మా! బిడ్డకు జ్వరం వచ్చింది. స్కూలుకు వెళ్ళడం ఏమిటి?'' అన్నది కోడలితో.

''అవునా!'' అంటూ తల్లి ఆతృతగా స్వామినాథన్ వళ్ళు తాకి చూసింది.''అవును. జ్వరం వుంది'' అన్నది. ''అమ్మా! నాకు త్వరగా పాలు ఇవ్వు. లేదా ఏమైనా తినడానికి పెట్టు, ఆలస్యం అవుతుంది. స్కూలుకు వెళ్ళాలి,''అన్నాడు స్వామినాథన్. ''ఇలా వుండి స్కూలుకు ఏమిటి?'' అన్నది. ''కాని నాన్నగారు ఊరుకోరు స్కూలుకు వెళ్ళకపోతే'' అన్నాడు చిన్న గొంతుతో. స్వామిని మంచంమీద పడుకోమని చెప్పింది. భర్త గదిలోకి దూకుడుగా వెళ్ళింది.''స్వామికి జ్వరం వచ్చింది. ఇవ్వాళ వాడు స్కూలుకు వెళ్ళడు,'' ఖచ్చితంగా అన్నది స్వామి తల్లి.

''జ్వరం చూశావా?''

''ఇంకా లేదు. ఒక రోజు స్కూలుకు వెళ్ళకపోతే మిన్ను విరిగి మీదపడదు.''

''ఎందుకైనా మంచిది జ్వరం చూడు,'' అన్నాడు. అలా అనడంలోని అంతరార్థం భార్య గ్రహిస్తుందేమోననే భయంతో ''అవసరం అయితే డాక్టర్ను పిలుస్తాను,'' అన్నాడు.

అర నిముషం సేపు థర్మామీటర్ స్వామినాథన్ నాలుకకింద వుంది. తీసి చూస్తే''నార్మల్''గా ఉంది. మళ్ళీ నోట్లో థర్మామీటర్ పెట్టింది స్వామినాథన్ తల్లి. మళ్ళీ అది నార్మలే చూపించింది. తండ్రి దగ్గరకు తీసుకెళ్ళి థర్మామీటర్ చూపించింది. ''నార్మల్! నాకు అన్నాడు తండ్రి. ''ఈ థర్మామీటర్ చెడిపోయినట్టుంది. వాడికి జ్వరం వుంది. నా చేతికంటే థర్మామీటరుకు వాడి జ్వరం గురించి ఎక్కువ తెలుస్తుందని నేను అనుకోను. కనీసం 100.2 డిగ్రీలు జ్వరం వుందని చెప్పగలను.''

''కావచ్చు.'' అన్నాడుతండ్రి.

స్కూల్లో వుండవలసిన స్వామినాథన్ కళ్ళు మూసుకొని ప్రశాంతంగా మంచంమీద పడుకొనివున్నాడు. మంచం దగ్గరగా ఎవరో నడిచినట్టు అనిపించి కళ్ళు తెరిచాడు. తండ్రి నిల్చుని అన్నాడు. ''నువ్వు చాలా అదృష్టవంతుడివిరా! నీకు స్కూలుకు వెళ్ళాలని లేకపోతే నిన్ను సమర్థించేవాళ్ళు చాలామంది వున్నారు ఇంట్లో,'' అన్నాడు. అనుకోకుండా వెనకనుంచి వెన్నుపోటు పొడిచినట్టు అయింది. గోడవైపుకు తిరిగి జ్వరంతో బాధపడుతున్నట్టుమూలిగాడు.

మధ్యాహ్నం అయింది. ఇంకెక్కువ సేపు అలా పడుకోవడం అసాధ్యం అనిపించింది. సాయంకాలం వరకు ఇలా పడుకోవడమా! అర్థంలేని పని.

ఈపాటికి రాజం స్కూలుకు వచ్చి హెడ్‌మాస్టర్ని కలిసి వెళ్ళిపోయి వుంటాడు. మంచం దిగాడు. తల్లి దగ్గరకు వెళ్ళి, స్కూలుకు వెళ్తున్నానని చెప్పాడు.

జ్వరంలో స్కూలుకు వెళ్ళడానికి తల్లి అంగీకరించలేదు. ''ఇప్పుడుజ్వరం తగ్గిపోయింది. నేను స్కూలుకు వెళ్ళాలి...'' అన్నాడు స్వామినాథన్.

స్కూలు దగ్గర్లో రాజం, మణీ కనిపించారు. దుడ్డుకర్ర చంకలో ఇరికించుకొని నిల్చుని వున్నాడు మణి. వాళ్ళు ఏదో చేసే వుంటారని భయపడ్డాడుస్వామినాథన్.

''అహా! నువ్వు చాలా గొప్పవాడివిరా! పొద్దుటినుంచి ఏమయ్యావు?'' రాజంఅడిగాడు.

''మా హెడ్‌మాస్టర్ని చూశారా?''

''ఇంకా లేదు. నువ్వు లేకుండా ఎలా చూస్తాం? నేనుమాట్లాడేటప్పుడు నువ్వూ వుండాలి. ఇది నీకు సంబంధించిన విషయం.''

స్వామినాథన్‌కు ఎక్కడలేని ఆవేశం కలిగింది రాజం మాటలు విని. ''ఈ మణిగాడుఇక్కడేం చేస్తున్నాడు?'' ఆవేశం దిగమింగుకుంటూ అన్నాడు.

''నాకూతెలియదు. స్కూల్లో వుండాల్సినవాడు. నేను ఇక్కడికి వచ్చేసరికే, చంకలో దుడ్డుకర్ర ఇరికించుకొని నిల్చుని వున్నాడు,'' అన్నాడురాజం.

''మణీ! నువ్వు స్కూలుకు వెళ్ళలేదా?''

''వెళ్ళలేదు.''

''ఆ దుడ్డు కర్రెందుకు?''

''ఊరికే తెచ్చాను.''

''అసలు నిన్ను రమ్మనలేదే. నీ పని చూసుకో అన్నాను.''

''నాకు గుర్తులేదు. నేనూ వస్తానన్నాను. నీ పని చూసుకో అన్నావు. నేను అటునుంచి వచ్చాను. నువ్వు ఇటునుంచి వచ్చావు. ఇది-ఈ రోడ్డు ఎవరి సొత్తూ కాదు.'' మణి పెద్ద జోక్ వేశాననుకొన్నాడు. ముగ్గురూ చెయ్యవలసిన దాన్ని గురించి చర్చించుకోసాగారు.

''మీరు భయపడకండి. మీ బాధను నేను అర్థం చేసుకోగలను. మీకు అభ్యంతరం లేకపోతే హెడ్‌మాస్టరుతో నేను మాట్లాడతాను,'' అన్నాడు మణి.

''నువ్వు ఆ గదిలోకి కాలుపెట్టావా పోలీసుల్ని పిలుస్తాడు,'' అన్నాడు స్వామినాథన్.

స్కూలు దగ్గరకు వచ్చారు. మణిని వెళ్ళిపొమ్మన్నారు. వెళ్ళడం ఇష్టంలేకపోతే స్కూలు బయట నిలబడి వుండమన్నారు. స్వామినాథన్‌తో రాజం హెడ్‌మాస్టర్ గదిలోకి ప్రవేశించాడు.

హెడ్‌మాస్టర్ టేబుల్‌మీదకు వంగి, కుడిచెయ్యి మోచేతి మడతలో తల పెట్టుకొని నిద్రపోతున్నాడు. అది చిన్న గది. గాలి సరిగ్గా రాని గది. ఒక కిటికీ తెరిచి వుంది. ఎదురుగా పెద్ద షాపు వుండడం వల్ల ఆ కిటికీలో నుంచి గాలి బాగా రాదు. గదినిండా దుమ్ము. మ్యాపులూ, గ్లోబులూ వగైరా వస్తువులన్నీ దుమ్ము కొట్టుకొని వున్నాయి. కిటికీలోనుంచి సన్నగా వస్తున్న వెలుగు కిరణాలు ఆయన ముక్కుమీదా, టేబుల్‌మీదా పడుతున్నాయి. సన్నగా గురక వినిపిస్తోంది. ఇది రాజం ఊహించని దృశ్యం.

''ఏం చేద్దాం?'' గుస గుసలాడినట్టు అడిగాడు స్వామినాథన్ గొంతు తగ్గించి.

''ఆగు!''

పది నిముషాలు మౌనంగా నిల్చున్నారు. ఆ తర్వాత చిన్నగా కాళ్ళతో శబ్దాలు చెయ్యసాగారు. హెడ్‌మాస్టర్ కళ్ళు తెరిచాడు. మోచేతిమీదనుంచి తల ఎత్తకుండానే శూన్యంలోకి చూస్తున్నట్టు చూశాడు, ''క్లాసు లేదా?'' అన్నాడు వాళ్ళను చూస్తూ. కళ్ళజోడు టేబుల్ మీదనుంచి తీసి పెట్టుకున్నాడు. స్వామినాథన్‌కు కాళ్ళలో వణుకు పుట్టింది. ''ఏ క్లాసులో చదువుతున్నారు? క్లాసు లేదా?'' మళ్ళీఅడిగాడు.

''నేను మీ స్కూల్లో చదవడం లేదు,'' బింకంగా అన్నాడు రాజం.

''అలాగా? మరిఎక్కడ్నుంచి ఊడిపడ్డావ్?''

''నేను ఎం.సి.సి. కెప్టెన్‌గా వున్నాను. ఒక పనిమీద మీ దగ్గరకు వచ్చాను.''

''ఏమిటది?''

''వీడు నా స్నేహితుడు. డబ్ల్యూ.ఎస్. స్వామినాథన్, మీ స్కూల్లో సెకెండ్ ఫారం 'సి'లో చదువుతున్నాడు.''

''తమర్ని చూడగలగడం నాకు చాలా ఆనందంగా ఉంది.'' స్వామినాథన్ కేసి చూస్తూ అన్నాడు హెడ్‌మాస్టరు.

రాజం అనుకున్నాడు మనసులో సంతృప్తిగా- ''ఈ స్కూలుకు ఇంత పేరు ఉండడానికి కారణం ఇప్పుడు అర్థం అయింది. ఎంత మర్యాద!''

''నేను ఎం.సి.సి. కెప్టెన్.''

''తమర్ని కలుసుకున్నందుకు ఇంకా ఆనందంగా వుంది.''

''వీడు మా టీములో ఉన్నాడు. గొప్ప బౌలర్,'' అన్నాడురాజం.

''ఆహా!! అలాగా?'' హెడ్‌మాస్టర్ స్వామినాథన్ కేసి అదోలా చూస్తూ అన్నాడు.

''అసలు విషయంలోకి రమ్మంటారా?''

''రండి! రండి! దయచెయ్యండి.

''మ్యాచ్ ఆడేదానికి ముందు బాగా ప్రాక్టీసు వుండాలి. వీడు టైంకు రాలేకపోతున్నాడు. నాలుగున్నరకు స్కూలు అయిపోయినా రాలేక పోతున్నాడు.

''అందుకు నన్నేం చెయ్యమంటావు?''

''నాలుగున్నర తర్వాత డ్రిల్లు, స్కౌట్ క్లాసుల గొడవ లేకుండా పంపించెయ్యండి సార్!''

హెడ్‌మాస్టర్ కుర్చీలో వెనక్కు వాలి ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.

''ఈ స్కూలుకు హెడ్‌మాస్టర్ నువ్వా నేనా?'' రాజంను చూస్తూ అన్నాడు.

''మీరే సార్! ఆల్బర్ట్ మిషన్ స్కూల్లో మమ్మల్ని నాలుగున్నరకే వదిలేస్తారు. మాకు డ్రిల్లు కంపల్సరీ కాదు. మీ స్కూల్లో...''

''నీ కిరస్తానీ స్కూలు కబుర్లు నాకు చెప్పకు. గెట్ అవుట్!''

మణి బయట స్నేహితులకోసం ఎదురుచూస్తున్నాడు. ఎంతకూ బయటికి రారు. అసహనం పెరిగిపోయింది. ఏం జరిగిందో ఏమో? ఆందోళనతో హెడ్‌మాస్టర్ గదిలోకి ప్రవేశించాడు.

''వాడెవడు?'' హెడ్‌మాస్టరు రాజంను అడిగి, మణి వైపుకు తిరిగి ''ఏం కావాలి?'' అన్నాడు.

''ఏమీ అక్కర్లేదు.'' గదిలో ఓ మూల నిటారుగా నిల్చున్నాడు.

''ప్రతి పనిలేని వెధవా నా గదిలోకి ఎందుకొస్తాడో నాకు అర్థం కావడం లేదు.''

''నేను పోలీసు సూపర్నెంటు కొడుకును.'' రాజం యాంత్రికంగా అన్నాడు.

''అలాగా? ఆ రోజు-ఆ సమ్మె రోజు-కుర్రకుంకలు ఈ అద్దాలన్నీ పగలగొడ్తూ వుంటే ఏంచేశాడో మీ నాన్న కాస్త కనుక్కో....'' అని మణికేసి చూస్తూ ''వాడి చేతిలో వున్నది ఏమిటి?'' అన్నాడు.

''నా దుడ్డుకర్ర.''

''దానితో వాడు బుర్రలు పగలగొడ్తూ వుంటాడు. పదరా మణీ! రా స్వామీ వెళ్తాం! ఇతడి సంగతి ఇలా కాదులే...ఈ పిచ్చివాడ్ని...'' రాజం బయటికి దారితీశాడు.

## అధ్యాయం 15

# పోటీకి ముందు

1

ఎం.సి.సి., స్నేహపూర్వకమైన పోటీకి రావలసిందిగా వై.యం.యు.ను ఆహ్వానించింది. ఆ టీము చాలా శ్రద్ధగా ప్రాక్టీసు చేస్తున్నారు. ఒక ఇంటి పక్కన ఉన్న ఖాళీ స్థలంలో ప్రాక్టీసు చేస్తూండేవారు. కాని ఆ ఇంటి యజమాని అభ్యంతరం తెలిపాడు. ఇప్పుడు కులాం స్ట్రీటు మధ్యలోనే ప్రాక్టీసు ప్రారంభించారు. ఎం.సి.సి. అన్న 'స్నేహపూర్వకమైన పోటీ'లో, నిజంగా స్నేహం లేదని వై.యం.యు. గ్రహించింది. అది ఆహ్వానం కాదనీ, ఛాలెంజి అని కూడా తెలుసుకున్నది. పోటీలో పాల్గొనడానికి వై.యం.యు. వారు అంగీకరించారు. ఛాలెంజిని ఎదుర్కోవడానికి పట్టుదలగా ప్రాక్టీసు చేస్తున్నారు.

ఎం.సి.సి. కెప్టెన్ పోటీలో పాల్గొనేవారికి అనేక షరతులు పెట్టాడు. ఒకటి, ఆటగాళ్ళందరూ మధ్యాహ్నం పదకొండు గంటలకు ఖచ్చితంగా 'పిచ్'లో ఉండాలి. రెండు, వాళ్ళ బ్యాట్లు వాళ్ళే తెచ్చుకోవాలి. మూడు, కొంచెం కష్టతరమైన షరతు-రెండు బంతులు కూడా తెచ్చుకోవాలి. వాళ్ళ బ్యాటింగులో వాళ్ళ బంతులే వాడాలి. అంతేగాని ఎం.సి.సి. బంతుల్ని పాడుచెయ్యకూడదు. అయితే వికెట్ కర్రలు మాత్రం ఎం.సి.సి. సమకూర్చడానికి సిద్ధమే. నాలుగు, ఆతిథ్యం ఁ్వరించి, భోజనం చెయ్యడం అవసరమనుకుంటే, ఎవరి భోజనం వారే తెచ్చుకోవాలి. ఐదో షరతు, చివరి షరతు అభిప్రాయ బేధాలు కలిగించింది. చాలా తర్జన భర్జనలు జరిగాయి. ఆ షరతు-బ్యాట్లుగానీ, బంతులుగానీ, వికెట్ కర్రలు వగైరా విరిగిపోతే లేక పాడైపోతే, ఆ నష్టాన్ని వై.యం.యు. భరించాలి.

వై.యం.యు. కెప్టెన్ చివరి షరతు విని ఆశ్చర్యపోయాడు. ఆ షరతు అర్థం లేనిదిగా అనిపించింది. వళ్లు మండిపోయింది. ముఖ్యంగా ఆ 'వగైరా' అన్న మాటకు చిరాకెత్తుకొచ్చింది.

చివరి షరతులోని నిబంధనలు, రెండూ, మూడూ షరతుల్లో విధించిన నిబంధనలకు వ్యతిరేకంగా ఉన్నాయి. ''బ్యాట్లూ మావి. బంతులు కూడా మావే. మేము బ్యాటింగ్ చేస్తున్నప్పుడు మా బంతుల్నే వాడతాం.

అలాంటప్పుడు మీ బ్యాట్లూ, బంతులూ విరిగితే మేము నష్టపరిహారం ఇవ్వడం ఏమిటి? ఇక పోతే వికెట్లుగా ఉపయోగించే కర్రలు మాత్రమే మీవి. మాకూ కర్రలు ఉన్నాయి. కావాలంటే మాచ్ మా ''పిచ్''లోనే పెట్టుకోవచ్చు. చివరి షరతులోని మరో మాట ''వగైరా'' అని ఉంది. ఆ వగైరాలోకి ఏమేమి వస్తాయో వివరించ లేదు. ఆ వగైరా వస్తువులు ఏమిటో చెప్పు.'' అన్నాడు వై.యం.యు. కెప్టెన్. రాజం అంత ఘాటైన సమాధానం వస్తుందని ఊహించలేదు. బిత్తరపోయాడు. తేరుకొని చూసేసరికి ఆ కెప్టెన్ అక్కడ లేడు. ఎప్పుడో అనే నాలుగు మాటలూ అనేసి వెళ్ళిపోయాడు. రాజం ఆలోచనలో పడ్డాడు. వాళ్ళ 'పిచ్'కి వెళ్ళి ఆడాలా? అంటే నడిరోడ్డుమీద మాచ్ ఆడాలా? ఎంత గొప్ప ఆఫర్! వగైరా అంటే ఏమిటూ? రాజం తమ ఆటస్థలానికి పక్కగా వున్న ఇంటి అద్దాలకేసి చూశాడు.

రెండు వారాల తర్వాత, ఆదివారంనాడు మాచ్ జరగబోతున్నది.

రాజం మనసు, మనసులో లేదు. రాత్రింబవళ్ళు ఒకటే ఆలోచన. విజయం తమకే దక్కుతుందనే నమ్మకం ఉంది. అయినా మనసులో ఒక మూల ఏదో దిగులు. మణి పర్వాలేదు. బ్యాటింగ్ బాగానే చేస్తున్నాడు. కొన్ని సమయాల్లో బౌలర్లు మణి ముందు మన్ను కరుస్తున్నారు. మిగతావాళ్ళ గురించి ఆలోచించడం అనవసరం. తన ఆలోచనలన్నీ ఒక్కడి గురించే భయంగా ఉంది. చివరి సమయంలో ముంచేస్తాడేమోనని భయంగా ఉంది. వాడెవడో కాదు. ఎం.సి.సి. టెటే. మాచ్ ఇంకా పది రోజులే ఉంది. వాడికి బొత్తిగా శ్రద్ధ లేదు. పట్టుదల లేదు. ఎప్పటిలాగా తాపీగా చీకటిపడ్డాక వస్తాడు. ''స్వామీ! దయచేసి కాస్త త్వరగా రారా! రోజుకు ఒక గంటయినా ప్రాక్టీసు చెయ్యాలి,'' అన్నాడు రాజం.

''తప్పకుండా వస్తాను. అందుకు ఏదైనా ఉపాయం చెప్పు.''

''మీ హెడ్‌మాస్టర్ని చూసి అన్ని విషయాలూ...''

''బాబోయ్! ఆ పని మాత్రం చెయ్యను. నీ సలహాకు ధన్యవాదాలు. ఆ పిచ్చివాడ్ని గురించి మర్చిపో. నువ్వు వచ్చి వెళ్ళిన విషయాన్ని ఇంకా మర్చిపోలేదు.''

''నాకేం భయం లేదు. నువ్వు మాత్రం సమయానికి రావాలి. బ్యాట్స్‌మాన్ నీకోసం ఇకముందు ఎదురుచూడ కూడదు. అలా చేస్తే మళ్లీ నీ ముఖం చూడను. నీవల్ల కాకపోతే వదిలెయ్...''

## 2

ఇంకా మ్యాచ్ వారం రోజులే వుంది. స్వామినాథన్‌కు ఆ సాయంకాలాలు చాలా విలువైనవిగా తోచాయి. ఆ రోజు స్కూలు గంట మోగింది. స్వామినాథన్ వెళ్ళి డ్రిల్లు క్లాసులో నిల్చున్నాడు. రోజూలా కోటుగానీ, టోపీగానీ తియ్యలేదు. మిగతా పిల్లలు ధోవతులు పైకి దోపుకొని, చొక్కాలు మాత్రం వేసుకొని వున్నారు. డ్రిల్లు మాస్టరు నలుచదరంగా కనిపిస్తాడు. ఛాతీ ముందుకు వచ్చినట్టు వుంటుంది. పెద్ద పెద్ద మీసాలు. వాటి చివరలు సన్నగా, సూటిగా వుంటాయి. మిలిటరీవాళ్ళు ధరించే సిల్కు తలపాగా ధరిస్తాడు. కెమెరా ముందు నిల్చున్న పోజులో దూరంగా నిల్చుని, కుర్రవాళ్లను వంకరగా చూస్తున్నాడు. మానీటరు హాజరు పట్టీ తీసుకున్నాడు. మాస్టరు కదిలి కుర్రవాళ్ళ దగ్గరకు వచ్చాడు. ఆ చివరినుంచి ఈ చివరకు నడుస్తూ, ఒక్కొక్క కుర్రవాడ్నీ పరిశీలనగా చూస్తున్నాడు. ఆఖర్న ఉన్న స్వామినాథన్ ముందుకొచ్చి ఆగాడు. "నీకు శెలవు దొరకదు. ఆ కోటూ, టోపీ తీసెయ్," అన్నాడు. "సార్! నాకు ఒంట్లో బొత్తిగా బాగాలేదు. ఇవి తీసేస్తే చచ్చిపోతాను. డ్రిల్లు చెయ్యలేను. నాకు...నాకు..." ఆగాడు. "సార్! సార్!" అంటూ డ్రిల్లు మాస్టరువెనకే ఎగురుతూ నడవసాగాడు. డ్రిల్లు మాస్టరు ఆగి వెనక్కు చూశాడు. "ఏమిటి?" కొర కొర చూశాడు.

"సార్! నా కష్టాల గురించి మీరు పట్టించుకోవడం లేదు. నా ఆరోగ్యం గురించి కూడా అడగలేదు సార్!" "సరే చెప్పు. ఏం రోగం వచ్చింది?"

తలనొప్పి అని చెప్తే. లాభం లేదు. అదొక జబ్బుగా భావించడు. ఏం చెప్పాలి? "సార్! నాకు డెలీరియం వచ్చింది సార్! రాత్రంతా నిద్రలేదు. చాలా బాధపడ్డాను."

మాస్టరు కళ్ళు పెద్దవి చేసి చూశాడు. "ఏమిటీ? డెలీరియం వచ్చిందా? నీకు పిచ్చి పట్టిందా?"

"అవును సార్! డెలీరియం వచ్చింది. రాత్రంతా నిద్రలేదు. డెలీరియస్‌గానే గడిపాను. మా డాక్టర్ నాకు వచ్చిన జబ్బు డెలీరియం అని చెప్పాడు. ఒక వారం డ్రిల్లు క్లాసుకు వెళ్ళొద్దన్నాడు. డ్రిల్లుచేస్తే చచ్చిపోతానని చెప్పాడు సార్!"

"పంది వెధవా. వెళ్ళవతలకు. అన్నీ అబద్ధాలే! పోరా గాడిదా. ఇంకాసేపు నా ముందు నిలబడితే నేనేం చేస్తానో నాకే తెలియదు. పో!"

పరుగు పరుగున అర్ధగంటలో ఆటస్థలం చేరాడు. అందరూ స్వామిని చూసి సంతోషపడ్డారు. రాజం ఎగిరి గంతేశాడు.

అంతా బాగానే ఉంది. కాని ఒక అనుమానం స్వామిని పీడిస్తున్నది. ఆ డ్రిల్లు మాస్టరు సి.ఐ.డి.లా తన వెనకే వచ్చి పట్టుకుంటాడో, ఏమో? ఆట అయాక తిన్నగా ఇంటికి వెళ్ళాలంటే భయం వేసింది. డ్రిల్లు మాస్టరు ఎక్కడైనా పొంచి ఉంటే? రాజం ఇంటికి వెళ్ళాడు. బాగా చీకటి పడ్డాక ఇంటికి బయలుదేరాడు. దీపాల వెలుగును తప్పించుకుంటూ, వెనకా ముందూ చూసుకుంటూ ఇల్లు చేరాడు.

రెండో రోజు ఉదయం టేబుల్ ముందు కూర్చుని ఆలోచనలో పడ్డాడు. చేతిలో వ్యాకరణం పుస్తకం ఉంది. ఈ వారమంతా డ్రిల్లు క్లాసూ, స్కౌటు క్లాసూ ఎగగొట్టాలంటే ఏం చెయ్యాలి? టైం చూశాడు. ఏడున్నర అయింది. స్కూలుకు వెళ్ళడానికి ఇంకా రెండు గంటల సమయం ఉంది.

బయటికి వెళ్ళాలి. ఎవరి దృష్టిలో పడకుండా వెళ్ళాలి. తల్లి బేబీని నిద్రపుచ్చుతున్నది. తండ్రి గదిలో కూర్చుని క్లైంట్సుతో మాట్లాడుతున్నాడు. ఇదే సమయం బయటపడడానికి. అదును చూసి బయటికి జారుకున్నాడు.

ఒక షాపు ముందు ఆగాడు. బోర్డు వేలాడుతున్నది. దానిమీద ''డా॥ టి. కేశవన్, ఎల్.ఎం.ఎస్. శ్రీ కృష్ణ డిస్పెన్సరీ'' అని రాసి ఉంది. పెద్ద టేబులు ముందు, బజారు వైపుకు ముఖం పెట్టి డాక్టరు కూర్చుని వున్నాడు. ఒంటరిగా ఖాళీగా వున్నాడు. స్వామినాథన్ లోపలకు వెళ్ళాడు.

''హల్లో! స్వామినాథన్ ఏమిటిలా వచ్చావు?''

''ఏం లేదు సార్! చిన్న పనిమీద వచ్చాను.''

''ఇంట్లో అందరూ బాగున్నారా?''

''బాగానే వున్నారు సార్. నాకు అర్జెంటుగా ఒక సర్టిఫికెట్ కావాలి.''

''ఎందుకూ? నీకేమైంది?''

''మీకు నిజం చెబుతాను. నేను క్రికెట్ మ్యాచ్ ఆడాలి. ఇంకా వారం వుంది. నాలుగున్నర తర్వాత కూడా డ్రిల్లు క్లాసనీ, మరేదో అనీ నన్ను త్వరగా వదలడం లేదు. మీరు సర్టిఫికెట్ ఇచ్చి మా ఎం.సి.సి.కి సహాయం చెయ్యాలి.''

''అలాగే ఇస్తాను. కాని నీకు ఏదైనా జబ్బు వుందా?''

ఏం చెప్పాలో వెంటనే తోచలేదు. కొంచెం ఆలోచించి ''ఈ మధ్య నాకు డెలీరియం వున్నట్టు అనిపిస్తోంది,'' అన్నాడు.

''ఏమిటీ?'' డాక్టరు ఆతృత చూపించాడు.

డాక్టరు ఆతృత చూసి స్వామినాథన్‌కు సంతృప్తి కలిగింది. తనను డెలీరియం చాలా బాధపెడుతున్నదని చెప్పాడు. ఆ బాధ భరించరానిదిగా వుంది అన్నాడు.

''ఏమిటి అబ్బాయ్ నువ్వనేది? డెలీరియం అంటే ఏమిటో కాస్త చెప్పు.''

డాక్టరు అనవసరంగా ప్రశ్నలు వేస్తున్నాడనిపించింది స్వామినాథన్‌కు. అయినా పని తనది. చెప్పక తప్పదు. ''నాకు ఆ జబ్బు వచ్చింది సార్. డెలీరియం అంటే కడుపునొప్పికదా సార్!''

డాక్టరు కడుపుబ్బేలా నవ్వసాగాడు. నవ్వీ నవ్వీ దగ్గుతో ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. డాక్టరు స్వామినాథన్ ముఖంలోకి చూశాడు. దగ్గరకు రమ్మన్నాడు. నాలుక చూపించమన్నాడు. గుండెమీద టక టక కొట్టి చూశాడు. ''నీకు ఏ జబ్బూ లేదు. డ్రిల్లు క్లాసుకు వెళ్ళొచ్చు. వెళ్ళకపోతేనే జబ్బు వచ్చే ప్రమాదం వుంది. డెలీరియం రావచ్చు'' అన్నాడు.

స్వామినాథన్ తన గోడు వెళ్ళబోసుకున్నాడు.

''నువ్వు చెప్పేది బాగానే ఉంది. కాని నేను దొంగ సర్టిఫికెట్ ఇచ్చి జైలుకు వెళ్ళలేను.''

''ఈ సంగతి వాళ్ళకెలా తెలుస్తుంది సార్! మా ఎం.సి.సి. గెలవడం మీకిష్టంలేదా సార్?''

''భయపడకు. మీరు తప్పక గెలుస్తారు. నేను సర్టిఫెకెట్ ఇవ్వలేను. కాని మీ హెడ్‌మాస్టరుతో మాట్లాడతాను. నాలుగున్నరకు ఇంటికి వెళ్ళిపోవడానికి పర్మిషన్ ఇప్పిస్తాను.''

''అది చాలు డాక్టర్. మీరు చాలా మంచివారు.''

*  *  *

నాలుగున్నరకు స్కౌట్ క్లాసుకు వెళ్ళకుండా ఇంటికి వెళ్ళిపోయాడు. కాఫీ తాగి ఆటస్థలానికి వెళ్ళాడు. రెండో రోజు కూడా నాలుగున్నరకు వెళ్ళిపోయాడు. ఆ రోజున్న డ్రిల్లు క్లాసు గురించి అసలు ఆలోచించలేదు. ఆలోచించాల్సిన అవసరం కనిపించలేదు.

రాజంకు చాలా సంతోషంగా వుంది. ''స్వామీ ఎలా రాగలుగుతున్నావు?''

''బుర్ర ఉపయోగించాను. ఒక పథకం వేశాను. మా డాక్టరుచేత హెడ్‌మాస్టరుకు ఫోన్ చేయించాను. నాలుగున్నర తర్వాత స్వామినాథన్ క్లాసులోనే వుంటే చచ్చిపోతాడని చెప్పాడు. అలా చెప్పమని నేనే చెప్పాను.''

''అద్భుతం! బుర్రంటే నీదేరా స్వామీ!'' మణి అంటూ మోచేతితో స్వామిని పొడిచాడు. రాజం మణి అభిప్రాయంతో ఏకీభవించాడు. ఉన్నట్టుండి

రాజం మనసును గుబులు చుట్టేసింది. ''మనం గెలుస్తామో లేదో! ఓడిపోతే మాత్రం నేను బతకను. ఆత్మహత్య చేసుకుంటాను'' అన్నాడు రాజం.

''అబ్బా! రాజం! ప్రతిసారీ ఓడిపోతే...ఓడిపోతే... అనకు. విని విని విసుగ్గా వుంది. ఆ కోతిముఖం వెధవలు మనల్ని ఓడించటం ఏమిటి?'' అన్నాడు మణి.

''మనం గెలిస్తే పేపర్లకు వార్త పంపిస్తాను,'' అన్నాడు రాజం.

''వాళ్ళు మన ఫొటోలు కూడా వేస్తారా?'' ఔత్సుక్యంతో అడిగాడు.

''సందేహం ఎందుకు?''

## 3

ఆ రోజు శుక్రవారం. జాగ్రఫీ క్లాసు నడుస్తున్నది. హెడ్‌మాస్టర్ పేము బెత్తం పట్టుకొని వచ్చాడు. జాగ్రఫీ మాస్టరు పేరు రామారావు. వయసు మళ్ళినవాడు. గౌరవసూచకంగా లేచి నిల్చున్నాడు. క్లాసులో అందరి కళ్ళూ హెడ్‌మాస్టర్ మీదే. అతడి కళ్ళు గుడ్లగూబ కళ్ళలా వున్నాయి. క్లాసంతా కలయచూశాడు. చూపులు స్వామినాథన్ మీదకు వచ్చి ఆగిపోయాయి. ''గెటప్'' అరిచాడు హెడ్‌మాస్టరు.

స్వామినాథన్ లేచాడు.

''ఇట్లా రా!''

స్వామినాథన్ వచ్చాడు.

''నీ సిగ్గులేని ముఖాన్ని క్లాసులో అందరికీ చూపించు.''

స్వామినాథన్ చేతులతో ముఖం కప్పుకున్నాడు.

హెడ్‌మాస్టర్ చేతులు లాగి, మెడ పట్టుకొని, ముఖం క్లాసువైపుకు వుండేలా తిప్పాడు. ''చూడండి. ఎంత గొప్పవాడో చూడండి. డ్రిల్లు క్లాసుకూ, స్కౌట్ క్లాసుకూ వెళ్ళడం చిన్నతనంగా భావిస్తున్నాడు. సోమవారం నుంచి వెళ్ళడం మానేశాడు.'' వ్యంగ్యంగా పెదవులు విరిచి నవ్వాడు హెడ్‌మాస్టరు. దాన్ని ఒక సూచనగా భావించి, ఎందుకైనా మంచిదన్నట్టు, చిన్నగా కిస కిస నవ్వారు క్లాసు పిల్లలు. జాగ్రఫీ మాస్టరు పెదవుల మీద కూడా చిరునవ్వు తొణికిసలాడింది.

''సార్! తమరు ఏదైనా సంజాయిషీ ఇచ్చుకుంటారా?'' హెడ్‌మాస్టర్ అన్నాడు వ్యంగ్యంగా.

అతి కష్టంమీద గొంతు పెగల్చుకొని స్వామి అన్నాడు- ''సార్! డాక్టరు...డాక్టరు మీతో మాట్లాడలేదా సార్!''

''ఏ డాక్టరు? ఏం మాట్లాడాడు?''

''మాట్లాడతానన్నాడు'' గొణిగినట్లన్నాడు.

''ఇలా నంగి నంగిగా మాట్లాడావా చూడు ఏం చేస్తానో. క్లాసులో బట్టలు ఊడదీసి, బయటికి నెడ్తాను. సరిగ్గా చెప్పు.''

''డాక్టర్ కేశవన్ చెప్పాడు.''

''డాక్టర్ కేశవన్ ఏం చెప్పాడు?''

''మీతో మాట్లాడి డ్రిల్లు క్లాసుకూ, వేరే సాయంకాలం క్లాసులకూ ఒక వారం వెళ్ళకుండా పర్మిషన్ ఇప్పిస్తానన్నాడు. నేను డ్రిల్లు, స్కౌట్ క్లాసులకు కొన్ని రోజులపాటు వెళ్ళకూడదన్నాడు. వెళ్తే చచ్చిపోతావన్నాడు సార్.''

''నీకొచ్చిన బాధేమిటో చెప్పు.''

''నాకు డెలీరియం జబ్బు వచ్చిందని ఆయన ఉద్దేశ్యం సార్.'' డాక్టరుతో మాట్లాడాక ఆపదం వాడకూడదనుకున్నాడు. కాని వెంటనే మరో జబ్బు తట్టలేదు. అలవాటుగా అనేశాడు.

హెడ్‌మాస్టర్ కనుబొమలు ముడిచి క్లాసు టీచరు ముఖంలోకి చూశాడు. కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. ''మాట్లాడు! నీ నోటినుంచి రాబోయే మరి కొన్ని నిజాలు వినాలని వుంది'' అన్నాడు హెడ్‌మాస్టరు.

''ఆయన మీతో మాట్లాడి వుంటాడనుకొన్నాను. నాతో చెప్పాడు మీతో మాట్లాడతానని...''

''ఏడ్చాడు. ప్రతి బజారు వెధవా నా స్కూలు గురించీ, నా స్కూలు పిల్లల గురించీ మాట్లాడితే వినడమేనా నా పని? ఆ సర్జన్-జనరల్ రాలేదు మంచిపని చేశాడు. వస్తే నా ప్యూన్‌చేత మెడపట్టి గెంటించేవాడ్ని.''

డాక్టరు తనను మోసం చేసాడనుకొన్నాడు స్వామినాథన్. డాక్టర్ తన మాటలు విని నవ్వడం గుర్తొచ్చింది. డాక్టర్ చాలా భయంకరమైన విలన్‌లా అనిపించి నిలువెల్లా కంపించిపోయాడు. ఆ నవ్వు ముఖం వెనక వున్న విలన్ కేశవన్‌కు తను గుణపాఠం నేర్పిస్తాడు. పామును తెచ్చి వాడి టేబుల్ సొరుగులో వేస్తాడు. తను జ్వరంతో చచ్చిపోతున్నా సరే ఆ డాక్టరు తన చేతిని ముట్టుకోవడానికి వీల్లేదు. చేతి వేళ్ళమీద పేము బెత్తం దెబ్బ తగలడంతో తన ఆలోచనల నుంచి తృళ్ళి పడ్డాడు స్వామినాథన్. ''చెయ్యి చాపు. ఒక రోజు నాగాకు ఒక్కొక్క చేతిమీద ఆరేసి దెబ్బలు. రోజంతా బెంచీమీద నిల్చోవడం. మానీటర్! నువ్వు చూసుకో. ఇదుకో డబ్ల్యు.ఎస్. స్వామినాథన్, మరోసారి ఇలా చేస్తే నిన్ను బట్టలు విప్పి, స్కూలంతా తిప్పిస్తాను. ఆ తర్వాత ప్యూనుచేత కొట్టిస్తాను. నువ్వు నన్ను, నీ పోలీసు సూపర్నింటు కొడుకు, వాడి కొడుకు, వాడి మనవడు, వాళ్ళందర్నీ తీసుకొచ్చి బెదిరించాలనుకొంటున్నావా? కావాలంటే ఆ గవర్నరుకే వెళ్ళి చెప్పుకో. నాకే

భయంలేదు.'' స్వామినాథన్ మెడమీద చెయ్యితీసి, బెత్తం పైకెత్తాడు. పాములా భయంకరమైన ఆ పేము బెత్తం, స్వామినాథన్‌కు, తన ప్రాణంతో చెలగాటం ఆడబోతున్నట్టు అనిపించింది. భయం, కోపం, రోషం, స్వామినాథన్ మనసులో పెనవేసుకొన్నాయి. కాళ్ళు వణికాయి. ఆవేశంతో నిలువెల్లా వణికిపోయాడు. తను ఏం చేస్తున్నాడో తనకే తెలియని స్థితిలో పడిపోయాడు. ఒక్కసారిగా హెడ్‌మాస్టరు చేతిలో వున్న బెత్తం లాగి, కిటికీలోనుంచి బయటకు విసిరేశాడు. బెంచీమీద నుంచి దూకి, తన సీటుదగ్గిరకెళ్ళి, పుస్తకాలు తీసుకొనిబయటికి పరుగు తీశాడు. వరండాలో నుంచి గేటు దగ్గరకు పరుగు తీశాడు. గేటు గడియ స్వామినాథన్‌కు అందదు. గేటు ఎక్కి అవతలి వైపుకు దూకాడు. పరుగు లంకించుకున్నాడు.

స్వామినాథన్ ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. తను చేసిందేమిటో, ఎంతో సేపటికిగాని బోధపడలేదు. తను మళ్ళీ ఆ స్కూలుకు, ఆ రాక్షసుడు వున్నంతవరకు వెళ్ళలేడు. ఇంటికి వెళ్తే? నాన్నకు ఈ విషయం తెలిస్తే, ఏం చేస్తాడో ఆ భగవంతుడికే తెలియాలి. మళ్ళీ స్కూలుకు వెళ్ళమని బలవంతం పెడ్తాడు. తను ఆ స్కూలుకు మళ్ళీ చస్తే వెళ్ళలేడు. ఆవేశంలో తను రెండు స్కూళ్ళు వదిలేశాడు. మాల్గుడిలో మరో స్కూలు లేదు. నాన్న తనను తిరుచునాపల్లి స్కూలుకు పంపిస్తాడు. కాని ఈ బోర్డు హైస్కూల్ హెడ్‌మాస్టరు అన్ని స్కూళ్ళకూ, స్వామినాథన్ మంచివాడు కాదని రాస్తాడు. తనను ఎవరూ స్కూల్లో చేర్చుకోరు...అప్పుడు ఏం చెయ్యాలి? ఎక్కడైనా పనిచేస్తే? డబ్బు సంపాదించవచ్చు. ఆ డబ్బుతో హోటల్‌కు వెళ్ళి తనకు ఇష్టం అయినవన్నీ తినొచ్చు. బాంబే ఆనంద భవన్ మిఠాయి చాలా బాగుంటుంది. ముఖ్యంగా పసుపు పచ్చ రంగులో, పెద్ద అచ్చులా వుండే ఆ మిఠాయి తినాలని తనకు ఎప్పట్నుంటో కోరిక. దానిమీద బాదం పప్పులు అంటించి వుంటాయి. చాలా ఖరీదట...నాన్న తనను ఇంట్లోకి రానివ్వడు స్కూలుకు వెళ్ళకపోతే. అసలు విషయం తెలిస్తే ఆయన తనను చావగొడ్తాడు. ఈ రోజు తను ఇంటికి వెళ్ళకూడదు. వెళ్ళడు. ఇవ్వాళే కాదు ఎప్పటికీ వెళ్ళడు. నాన్నకు తను ముఖం చూపించలేడు.ఎక్కడికెళ్ళాలి? మార్కెట్‌స్ట్రీట్‌నుంచి చిన్నగా నడుచుకుంటూ వెళ్తే? మద్రాసు వస్తుంది. ఇంకా నడిస్తే బొంబాయి, ఇంగ్లాండు వస్తాయి. ఏదో ఒక పని చేసి డబ్బు సంపాదించుకోవచ్చు. హాయిగా ఇష్టం వచ్చినట్టు తిరగొచ్చు. ఎలా వెళ్ళడం? రైల్లో పోతే! డబ్బు లేదు ఎలా? పర్వాలేదు. స్టేషనుమాస్టరు మంచివాడు. తనకు తెలిసినవాడు.

దూరంగా స్కూలు గంట మ్రోగింది. మోత విని స్వామినాథన్ చివ్వున లేచి నిల్చున్నాడు. స్కూలు పిల్లలు తనను చూస్తే చుట్టూ మూగుతారు. అడ్డమైన ప్రశ్నలు వేస్తారు. తనవొక వింత మృగాన్ని చూసినట్టు చూస్తారు.

మార్కెట్ రోడ్డునే కొంతదూరం నడిచి, కుడివైపుకు మలుపు తిరిగాడు. అడ్డదార్ల వెంబడి తన పాత స్కూలు దగ్గరకు చేరాడు. అల్బర్ట్ మిషన్ స్కూలు గేటు దగ్గరకొచ్చి నిలబడ్డాడు. పాత రోజులు గుర్తుకొచ్చాయి. పాత వాసనలు స్వామినాథన్ మనసును ఆకర్షించాయి. ఆ పసుపు పచ్చ స్కూలు భవనం చూస్తుంటే ఎన్నెన్నో జ్ఞాపకాలు. ఈ స్కూలు వదలాల్సింది కాదు. ఆ స్కూలుకు సంబంధించిన ప్రతి విషయం ఆత్మీయంగా గొప్పగా అనిపించాయి. హెడ్‌మాస్టర్ సైనికులు ధరించేలాంటి తలపాగా ధరిస్తాడు. ఎంతో హుందాగా ఉంటాడు. ఇప్పుడు ఆ స్కూలుకు సంబంధించిన ప్రతి విషయం గొప్పగా అనిపిస్తుంది. బోర్డు హైస్కూలు హెడ్‌మాస్టరు వట్టి గబ్బుగాడు. వేదనాయగం, ఎబెనేజార్ కూడా అతడికంటే మంచివాళ్ళే. ముఖ్యంగా డి.పి. పిళ్లై ఎంత బాగా చరిత్ర పాఠాలు చెప్తాడు? సోమూనూ, బఠాణీని తలుచుకుంటే ఏడుపు వస్తోంది. రాజం, మణి, సోము, బఠాణీ వీళ్ళంతా తన మిత్రులు. ఈ స్కూల్లోనే చదువుతున్నారు. ఆ ఎత్తైన గోడల మధ్యన కూర్చుని వున్నారు. తను ఒక్కడే బయట నిల్చుని వున్నాడు. ఒంటరిగా, కుష్టురోగిలా వాళ్ళందరికీ దూరంగా వున్నాడు. వెలివెయ్యబడిన వాడిలా వున్నాడు. అవును, వెలి...తనకు తనే వేసుకొన్నాడు. తనమీద తనకే అసహ్యం వేస్తోంది. మళ్ళీ ఈ స్కూలుకు రావాలన్నా వాళ్ళు చేర్చుకోరు. మాల్గుడిలో తను చదువుకోడానికి స్కూళ్ళే లేవు. తను ఈ ఊళ్ళో ఉండకూడదు. పారిపోవాలి. మద్రాసు పారిపోవాలి అక్కడ పనిచేసుకుంటూ బతకాలి. వెళ్ళే ముందు రాజంనూ, మణినీ ఒకసారి చూడాలి.

స్కూలు ముందు స్వామినాథన్ తచ్చాడుతున్నాడు. లోపలకు వెళ్ళే సాహసం లేదు. తను ఆ స్కూలుకు శత్రువు. ప్యూన్ సింగారంగాడు చూస్తే ఇంకేమన్నా ఉందా? కొట్టి బయటికి నెడ్తాడు. గేటుకు దగ్గరగా నిల్చున్నాడు. స్కూలు పూర్తిగా కనిపిస్తున్నది. రాజంనూ, మణినీ కలుసుకోవాలి. ఎలా? ఒక ఆలోచన వచ్చింది. చుట్టు తిరిగి స్కూలు భవనం వెనక వైపుకు వెళ్ళాడు. సాధారణంగా ఆ వైపుకు ఎవరూ రారు. ఆ ఖాళీ స్థలం పొలాలను ఆనుకొని వుంది. తిన్నగా వెళ్తే రైలు కట్ట వస్తుంది. తను నాలుగైదేళ్ళు ఆ స్కూల్లో చదివాడు. కాని ఎప్పుడూ ఈ వైపుకు రాలేదు. వెనకనుంచి చూస్తుంటే స్కూలు కొత్తగా కనిపిస్తోంది. సగం భవనం మాత్రమే కనిపిస్తున్నది.

స్వామినాథన్‌కు సెకండ్ ఫారం 'ఎ' ఎక్కడ ఉందో సరిగ్గా తెలియడం లేదు. ఒక పెద్ద రాతిని గోడదగ్గరకు దొర్లించాడు. దానిమీదకు ఎక్కి తల ఎత్తి చూశాడు గోడపైగా. అక్కడ్నుంచి స్కూలు కాంపౌండు కనిపిస్తోంది. సమయం పన్నెండు గంటలు. అందరూ క్లాసుల్లో వుండే సమయం. బయట ఎవరూ లేరు. నిరీక్షిస్తూ నిల్చున్నాడు. విసుగ్గా వుంది. చాలా సేపటికి బుజ్జి ఆకారం బయటికి వచ్చింది. సెకండు క్లాసు బుజ్జిగాడు ముక్కు చీదుకోవడానికి వచ్చాడు. స్వామినాథన్ నిల్చున్న చోటుకు ఆ క్లాసు పన్నెండు గజాల దూరంలో ఉన్నది.

స్వామినాథన్ ఈల వేశాడు. బుజ్జిగాడు వినిపించుకోలేదు. మళ్ళీ మళ్ళీ ఈలవేశాడు. బుజ్జిగాడు తిరిగి చూశాడు. ఏదో భూతాన్ని చూసినట్టు తిరిగి వెళ్ళబోయాడు. స్వామినాథన్ వాడిని పిల్చాడు. ఆగాడు. క్లాసుకు వెళ్ళాలో, భూతం దగ్గరకు వెళ్ళాలో తేల్చుకోలేక నిల్చున్నాడు. స్వామినాథన్ మళ్ళీ పిల్చాడు. బుజ్జిగాడు మంత్రించినట్టు స్వామినాథన్‌కేసి నడిచాడు. కళ్ళు వెడల్పు చేసుకొని చూస్తున్నాడు.

''బాదంపప్పు పిప్పరమెంట్లు కావాలా?'' అని అడిగాడు స్వామినాథన్.

అంత చిన్నవాడూ తన చెవులు విన్నది నిజమని నమ్మలేకపోయాడు. ఇతడు మనిషేనా? తనకు పిప్పరమెంట్లు ఇస్తానన్నాడా? నిజం కాదు. ఇందులో ఏదో మోసం వుంది. స్వామినాథన్ మళ్ళీ పిప్పరమెంట్లు ఇస్తానన్నాడు. బుజ్జిగాడు ఇవ్వమని చెయ్యి చాచాడు.

''అయితే సరే! నీకు వెంటనే ఇవ్వను. వాటిని నువ్వు సంపాదించుకోవాలి. సెకెండ్ ఫారం 'ఎ' సెక్షనులో రాజం అనేవాడు వుంటాడు. వాడి ఇంటినుంచి ఎవరో వచ్చారని చెప్పి బయటికి తీసుకురావాలి. అప్పుడు పిప్పరమెంటు కోసం చెయ్యి చాపు. తెలిసిందా? ఒకటి కాదు, రెండిస్తాను.''

బుజ్జిగాడు మౌనంగా నిల్చున్నాడు. విషయాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. ''సెరండ్ ఫారం 'ఎ' ఎక్కడుంది?'' కళ్ళెగరేస్తూ అడిగాడు.

''మేడమీద.''

బుజ్జిగాడి ముఖంలో నిరాశ కనిపించింది. పెదవులు నములుతూ నిల్చున్నాడు.

''ఏమిటాలోచిస్తున్నావ్? నేను పది లెక్కపెట్టేలోగా వెళ్తే సరే. లేకపోతే నీకు పిప్పరమెంటు దొరకదు. ఒకటి...రెండు...మూడు...''

''మేడమీదా?''

''అవును.''

''నేను ఎప్పుడూ అక్కడికి వెళ్ళలేదు.''

''ఇప్పుడు వెళ్ళు.''

''ఎట్లా వెళ్ళాలో తెలియదు.''

''మెట్లెక్కి వెళ్ళు.''

''నన్ను మెట్లమీద చూసి ఎవరైనా కొడితే?''

''నీకు బాదం పిప్పరమెంట్లు కావాలంటే మరి ధైర్యం చెయ్యాలి. వెళ్తావా లేదా చెప్పు!''

''సరే! ఇక్కడే వుండు. వెళ్ళపోకు.'' అనేసి బుజ్జిగాడు లోపలకు వెళ్ళాడు.

పది నిముషాల తర్వాత రాజంను వెంటబెట్టుకొని వచ్చాడు. గోడ పైగా కనిపిస్తున్న స్వామినాథన్ తలను చూసి రాజం విస్తుపోయాడు. ''ఇక్కడేం చేస్తున్నావ్?''

''గోడ దూకిరా. నీతో అర్జంటుగా మాట్లాడాలి.''

''ఇప్పుడా? నాకు క్లాసు వుంది. రాలేను.''

''పిచ్చిగా మాట్లాడకు. రా! నీతో అర్జంటుగా మాట్లాడాలి.''

రాజం గోడ దూకాడు. క్షణంలో స్వామినాథన్ పక్కన ఉన్నాడు.

స్వామినాథన్ తల గోడమీదనుంచి అదృశ్యం అయింది. పసి గొంతు, దాదాపు ఏడుస్తూ ''నా పిప్పరమెంటు!'' అన్నది.

''అరే! బుజ్జీ! నిన్ను మర్చిపోయాను. రా! పట్టుకో.'' మూడు పైసల బిళ్ళ అందించాడు గోడమీదగా స్వామినాథన్ రాయి ఎక్కి.

''బాదంపప్పుల పిప్పరమెంటు ఇస్తానని చెప్పావు.''

''చెప్తానురా! లక్ష చెప్తాను. అన్నీ నమ్మాలని ఎక్కడుంది? అయినా పిప్పరమెంటు కొనుక్కోడానికి మూడు పైసలు చాలవా?''

''కాని బాదంపప్పుల పిప్పరమెంట్లు రెండు ఇస్తానన్నావుగా?''

''ఒరే! బుజ్జీ! ఇక వెళ్తావా లేదా? వంకాయలు అమ్మేవాడిలా వెంటబడకు. ఉన్నదానితో సంతృప్తి పడడం నేర్చుకో.'' అని స్వామినాథన్ రాతిమీదనుంచి దిగాడు. మళ్ళీ తల అదృశ్యమైంది.

''రాజం ఇవ్వాళ స్కూల్లో చాలా పెద్ద గొడవైందిరా. మా హెడ్‌మాస్టర్‌మీద తిరగబడ్డాను. నన్ను డిస్‌మిస్ చేశాడు. ఇక నాకు స్కూలూ లేదు-క్లాసులూ లేవు.''

''హెడ్‌మాస్టరుమీదతిరగబడ్డావా?''

''డ్రిల్లు క్లాసుకు వెళ్ళడం లేదని బెత్తంతో దారుణంగా కొట్టాడు. అవమానంగా మాట్లాడాడు. మళ్ళీ బెత్తం ఎత్తాడు. వాడి చెయ్యి మెలిపెట్టి, బెత్తం లాక్కుని, కిటికీలోనుంచి బయటికి విసిరేశాను. మళ్ళీ ఆ స్కూలుకు వెళ్ళడం జరగని విషయం.''

''నువ్వు బలేవాడివిరా. ఎప్పుడో ఏదో చిక్కులో ఇరుక్కుంటూనే ఉంటావు.ఎప్పుడూ...ఎప్పుడూ...''

''ఇందులో నా తప్పు లేదురా రాజం.'' డాక్టర్ కేశవన్ ఎంత దుర్మార్గానికి ఒడికట్టాడో చెప్పాడు. తను నిర్దోషినని రుజువు చేసుకోవడానికి ప్రయత్నించాడు.

''అసలు నీకు బుద్ధి లేదురా. నువ్వు చాలా వింత మనిషివి.

''మరేం చెయ్యమంటావురా? సాయంకాలం క్రికెట్ ప్రాక్టీసు ఎంత ముఖ్యమో నీకు తెలియదా? వై.యం.యు.తో ఆడడం మాటలు కాదు.''

''నిజమే స్వామీ! ఈ రోజు ఉదయం వాళ్ళు ప్రాక్టీసు చెయ్యడం చూశాను. వాళ్ళు ఉదయంపూట కూడా శ్రద్ధగా ప్రాక్టీసు చేస్తున్నారు. వాళ్ళు తక్కువ ఆటగాళ్ళేం కాదు. ముఖ్యంగా ఆ మొహిదీన్-నల్లగా వుంటాడు చూడు-వాడు మంచి ఆటగాడు. వాడిమీద నువ్వు ఒక కన్నువేసి ఉంచు. ఎందుకైనా మంచిది. ఇంకొకడున్నాడు. అదే ఆ షణ్ముగంగాడు. చాలా మంచి బౌలరు. మొహిదీన్‌లో ఒక లోపం ఉంది. పరుగులో బాగా లేడు...స్వామీ, జరిగిందేదో జరిగింది. ఆట అయేదాకా ఇవన్నీ మర్చిపో. మనసులో పెట్టుకోకు. మనం రేపట్నుంచి ఉదయంపూట కూడా ప్రాక్టీసు చేద్దాం. ఆ కుర్రకుంకల్ని మనం కొట్టాలి.''

స్వామినాథన్ రాజం దగ్గరకు 'గుడ్‌బై' చెప్పడానికి వచ్చాడు. కాని మనసు మార్చుకున్నాడు. అసలు విషయం తెలిస్తే రాజం తనను వెళ్ళనివ్వడని అర్థం చేసుకొన్నాడు. అందుకే తను ఊరు వదిలి వెళ్ళిపోతున్నట్టు చెప్పలేదు. రాజంకే కాదు ఇంకెవరికీ చెప్పకూడదనుకున్నాడు. మణికి కూడా చెప్పకూడదు. చెప్తే వాడు తనను వెళ్ళనివ్వడు. తనకు వుండిపోయేందుకు చోటు లేదు. తను వెళ్ళిపోతాడు. ఇంకా మ్యాచ్ రెండు రోజులు మాత్రమే వుంది. ఆ సమయానికి వచ్చి ఆడి మళ్ళీ ఎవరికీ కనిపించకుండా వెళ్ళిపోతాడు. అంతే మళ్ళీ మాల్గుడి ముఖం చూడడు. తన తండ్రి-కొంచెం కూడా కనికరం లేని తండ్రి-హెడ్‌మాస్టరు-మాల్గుడిలో ఉంటారు. అందుకే మళ్ళీ తను మాల్గుడికేసి చూడడు. మనసు మార్చుకోనే ప్రశ్న లేదు. తన తండ్రి తనను కొడ్తాడు. మళ్ళీ అదే స్కూలుకు పంపిస్తాడు...మ్యాచ్ రోజు మాత్రం వస్తాడు...

''రాజం! మ్యాచ్‌లో నేను పాల్గొనడం అంత అవసరం అంటావా?'' అడిగేశాడు స్వామి అనుకోకుండా.

రాజం ఓ క్షణం స్వామిని అనుమానంగా చూశాడు. ''అలాంటి ప్రశ్నలు అడక్కు. నువ్వు లేకుండా మ్యాచ్ జరగదు. నీలాంటి బౌలరే మరొకడు దొరకడు. మేమందరం నీమీదే ఆశలు పెట్టుకున్నాం. ఆ కోతి ముఖాలను మనం చావుదెబ్బ కొట్టాలి. మనం ఓడిపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను. స్వామీ! నువ్వెప్పుడూ సమస్యల్ని సృష్టిస్తూ వుంటావు. మరి స్కూలుకు వెళ్ళకుండా ఏం చేస్తావు?''

''ఏదో ఒక వర్క్‌షాపులో చేరి పనిచేస్తాను.''

''ఆ సంగతి తెలిస్తే మీ నాన్న ఊరుకుంటాడా?''

''మా నాన్న నన్ను ఏమీ అనడు. నీ ఇష్టం అంటాడు.''

''స్వామీ! ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. క్లాసుకు వెళ్తాను.'' అని బయలుదేరాడు. కొద్ది గజాలు వెళ్ళి ''స్వామీ! ఫీల్డుకు త్వరగా వచ్చేయ్. స్కూలు కూడా లేదుగా. వస్తావుగదూ?'' అని అరిచి చెప్పి, వెళ్ళిపోయాడు.

# అధ్యాయం 16

# స్వామి అదృశ్యం

## 1

స్వామి తండ్రికి తనమీద తనకే సిగ్గుగా ఉంది. ఊరి చివర వున్న ఎల్లమాన్ స్ట్రీట్ దాటి కాలిబాటన నడుస్తూ, సరయు నది వడ్డున చీకట్లో కలిసిపోయాడు. మార్కెట్ రోడ్డున నడవడానికి మొహమాటంగా ఉంది. షాపుల్లోనుంచి పడ్తున్న వెలుగును తప్పించుకుంటూ నడిచాడు. చీకటిగా వున్న ఎల్లమాన్ స్ట్రీట్‌లో ప్రవేశించాడు. స్ట్రీట్ మొదట్లో మాత్రం ఆకుపచ్చ దీపం వెలుగు మసగ్గా పడుతోంది. రెండు మూడు మ్యునిసిపాలిటి దీపాలు వున్నా, అవి ఆ చీకటిని పారదోలలేక పోతున్నాయి.

స్వామినాథన్ తండ్రికి సిగ్గుగా వుంది. ఆ వీధులన్నీ దాటుకుంటూ సరయు నది ఒడ్డుకు వెళ్ళాలి. నదిలో తన కొడుకు శవం తేలుతున్నదేమో చూడాలి. తన కొడుకుకోసం, స్వామికోసం, తను సరయు నదిలోకి చూడాలి. ఎంత భయంకరమైన పరిస్థితి! అంతకంటే తను చెయ్యగలిగిందేముంది? మంచిదో, చెడ్డదో, ఏదో ఒక వార్త తీసుకొని కాని ఇంటికి వెళ్ళలేడు. రాత్రి పది గంటలనుంచి ఇంట్లో శవం వెళ్ళిపోయిన వాతావరణం నెలకొన్నది. తన భార్య, ముసలి తల్లి మాటా పలుకూ లేకుండా పిచ్చివాళ్ళే అయిపోయారు. ఆమె-తన భార్య-తాలూకా ఆఫీసులో పదిసార్లు గంట మోగేవరకు ఉత్సాహంగానే ఉంది. ఆ గంటలు వినగానే ఆమె ముఖంలో రక్తపు చుక్క లేకుండా పోయింది. స్వామి స్నేహితుల ఇళ్ళకు వెళ్ళి వాకబు చెయ్యమని భర్తను కోరింది. టీచర్లను కలిసి అసలు ఏం జరిగిందో తెలుసుకోమని తొందర పెట్టింది.

హెడ్‌మాస్టరు ఇల్లు ఎక్కడో అతడికి తెలియదు. స్కూలుకు వెళ్ళి కాపలాదారుని అడిగాడు. అతడు సరైన అడ్రసు ఇవ్వలేదు. సగం ఊరు చుట్టాడు. కాని హెడ్‌మాస్టరు ఇల్లు దొరకలేదు. మణి ఇల్లు ఎక్కడుందో తెలియదు. రాజం ఇంటికి వెళ్ళాడు. నలువైపులా నిశ్శబ్దం రాజ్యంచేస్తోంది. ఇంటి తలుపులు వేసివున్నాయి. లైట్లు తీసేశారు. అందరూ నిద్రలో వుండే సమయంలో, ఒకరి ఇంటి తలుపు, పరిచయం లేకుండా కొట్టడం, మా అబ్బాయి మీ ఇంటికి

వచ్చాడా అని అడగడం ఎంత అసభ్యంగా వుంటుందో అతడు ఆలోచించగలడు. వరండాలో నిద్రపోతున్న నౌకర్ని అడిగాడు. ఆనాడు స్వామినాథన్ అక్కడికి రాలేదని చెప్పాడా నౌకరు. పిచ్చివాడిలా రోడ్లు పట్టుకు తిరిగాడు. ఆ పని తన భార్యకోసం, తల్లికోసం చేశాడు. కాని అతనికి మాత్రం ''వాడెక్కడికి పోతాడు! వస్తాడు!'' అనే వుంది. వచ్చాక వాడ్ని గట్టిగా మందలించాలనుకున్నాడు. మొక్కగానే వంచడం అవసరం అనుకున్నాడు. ఇంటికి చేరేసరికి భార్య రాతిప్రతిమలా చలనం లేకుండా నిలబడి ఉంది. వీధిలోకి నిలబడి చూస్తూ నిలబడి వుంది. వృద్ధురాలైన తల్లి ఇంట్లో అశాంతిగా తిరుగుతున్నది. భగవంతుడ్ని ప్రార్థిస్తున్నది. తిరుపతి వెంకన్నకు మొక్కులు మొక్కింది. ఆ ఇంటి వాతావరణం అప్పుడే పీనుగ లేచినట్టుగా ఉంది. ఆ ఇంట్లో ఒకే ఒక ప్రాణి వీటన్నిటికీ దూరంగా ఆనందంగా వుంది. ఆ ప్రాణి పసివాడు. ఉయ్యాలలో పడుకొని కేరింతలు కొడ్తున్నాడు.

ఎక్కడెక్కడ తిరిగిందీ చెప్పాడు భార్యకు, తల్లికి. అప్పటికి ఇంకా అతనికి, వాడెక్కడికి పోతాడు ఇంటికి రాక అనే ఉంది. కాని పొద్దుపోయిన కొద్దీ అతడి బుర్రలో సందేహాలు తలెత్తాయి. అశాంతి బయలుదేరింది. ఎక్కడికెళ్ళాడు? ఏమయ్యాడు? ఎవరైనా ఎత్తుకుపోలేదు కదా? ఒకవేళ ఏదైనా దుర్ఘటన జరిగిందేమో! ''ఆసుపత్రులలో చూశారా?'' అని అడిగింది భార్య. మాట పూర్తి అయీ కాకుండానే భోరున ఏడ్చింది. ఆసుపత్రిలో రక్తపు ముద్దలా పడివున్న స్వామినాథన్ రూపం తండ్రి ఊహాలో మెదిలింది. ''చెప్పు! చెప్పు! నా బిడ్డ ఏమయ్యాడు? పొద్దుట వాడ్ని ఏమైనా అన్నావా?'' భార్య ఏడుస్తూనే అంటున్నది. అందరూ తనను అపరాధిగా భావిస్తున్నారు. తొమ్మిది గంటలనుంచే తనను తల్లీ, భార్యా అదోలా చూస్తున్నారు. ''అనవసరమైన ప్రశ్నలతో నా బుర్ర పాడుచెయ్యకు'' తల్లిమీద విసుక్కున్నాడు. ఆమెను వెళ్ళి పడుకోమన్నాడు. ఆ రోజు జరిగిన విషయాలను నెమరువేసుకొన్నాడు. ఉదయం కుర్రాడు లేచి తన పని చూసుకొని స్కూలుకు వెళ్ళిపోయాడు. తను తన గదిలో కేసులకోసం వచ్చిన వాళ్ళతో మాట్లాడుతూ వుండిపోయాడు. ఆ రోజు తను వాడ్ని చూడనేలేదు. రెండు మూడు రోజుల క్రితం తను వాడ్ని ఏమైనా అని వుంటాడా? ఏమో గుర్తురావడం లేదు. కాని వాడు వెళ్ళిపోవడానికి తను కారణం కాదనేది తనకు తెలుసు. ఉద్రేకంలో వాడు ఏదైనా దారుణానికి పాల్పడేలా తనువాడి మనసును గాయపరచ లేదు. బయటికి మరోసారి బయలుదేరుతూ అన్నాడు- ''వాడికోసం వెళ్తున్నాను. వాడు నాకంటే ముందే

ఇంటికి రావచ్చు. నేను బయటికి వాడిని వెతకడానికి వెళ్ళినట్టు చెప్పకండి. వాడి ముందు నన్ను దద్దమ్మను చెయ్యకండి.''

ఆసుపత్రి గేటు దగ్గర నిల్చున్నాడు. ఆసుపత్రి ముందున్న ఇనుప గేటును ఒకసారి చూసి గిర్రున వెనక్కు తిరిగాడు. ఆసుపత్రికి వెళ్ళడం అనవసరం అని తన మనసుకు తనే సర్ది చెప్పుకున్నాడు. కాని అసలు విషయం అతడికి ఆసుపత్రిలోకి వెళ్ళే ధైర్యం లేదు. ఆ కనిపించే కిటికీ తాలుకు గదిలో ఒక మంచంమీద రక్తపు ముద్దలా వున్న స్వామినాథన్, వళ్ళంతా కట్లతో పడివుంటే? అక్కడ్నుంచి గబ గబా ముందుకు నడిచాడు. పిచ్చివాడిలా ఎక్కడెక్కడో తిరిగాడు. నిముషం నిముషం అతడి మనసు బరువెక్కుతున్నది. గబ గబా మార్కెట్ రోడ్డు దాటి ఎల్లమాన్ రోడ్డులో ప్రవేశించాడు.

ఎల్లమాన్ రోడ్డు దాటి కాలిబాటన పడ్డాడు. ఆ బాట సరయు నదికి తీసుకెళుతుంది. నది ఒడ్డుకు రాగానే అతడి ముఖం వడదెబ్బ కొట్టినట్టుగా అయింది. తను ఊరికే నది వడ్డుకు వచ్చాడు. అంతే! మనసును జోకెట్టుకోసాగాడు. కాని అకస్మాత్తుగా తన బిడ్డ శవం నీళ్ళల్లోపైకి లేస్తే? నదిలో ఎక్కడైనా ఇరుక్కుపోయి వుంటే? నది అలలమీద తేలుతూ, కదిలుతూ వుంటే? ''ఓ భగవంతుడా నన్ను రక్షించు'' కళ్ళు మూసుకొని మనసులోనే అనుకున్నాడు.

అతడు కళ్ళు తెరిచి నదిమీదకు చూపులు సారించాడు. నది అల్లనల్లన కదులుతూ, సన్నగా వింత సంగీతాన్ని వినిపిస్తోంది. ఒడ్డున వున్న ఆ పెద్ద రావిచెట్టు కొమ్మల నీడలు నీళ్ళమీద వింత రూపాల్ని కల్పిస్తున్నాయి. ఏదో వస్తువు దూరంగా తేలుతున్నట్టుగా అనిపించింది. ఆ. నీడల్నీ, దూరంగా కనిపిస్తున్న వస్తువునూ పరిశీలనగా చూశాడు.

తనను తనే పిచ్చివాడిగా నిందించుకొని అక్కడనుంచి కదిలాడు. మాల్గుడి రైల్వే స్టేషన్‌కు బయలుదేరాడు. రైల్వే లైన్ పక్కనుంచి నడుస్తున్నాడు. రైలు పట్టాలనూ, చెక్కలనూ పరిశీలనగా చూస్తూ నడుస్తున్నాడు. ఇలకోళ్ల ఈలలు, రక రకాల పురుగులు చేసే వింత ధ్వనులు, కప్పల బెక బెకలు, ఆ చీకటి రాత్రి నిస్తబ్ధతను చీల్చుకుంటూ వినిపిస్తున్నాయి. అకస్మాత్తుగా ఆగి రైలు పట్టాలమీద చెయ్యిపెట్టి చూశాడు. చేతికి తడి తగిలింది. ఆ తడిని నక్షత్రాల వెలుగులో చెయ్యి పైకెత్తి పరిశీలనగా చూశాడు. అది రక్తం కాదు. నీటి తడి. అతను తేలిగ్గా గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు. మనసులోనే భగవంతుడికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

## అధ్యాయం 17

# పందెం రోజు

### 1

స్వామినాథన్ ట్రంకు రోడ్డునుంచి చీలిపోయిన .చిన్న రోడ్డువెంట నడుస్తున్నాడు. ఆ రోడ్డుకు ఇరువైపులా పళ్ళ చెట్లు ఉన్నాయి. చెట్ల నీడలో నడుస్తున్నాడు. అత్తిపండ్లూ, యాపిల్ పండ్లూ, రేగి పండ్లూ, చెట్ల ఆకుల మధ్యనుంచి తొంగి చూస్తున్నాయి. ఒక మైలు నడిచాడు. కాని ఆ రోడ్డు బాగా లేదనిపించింది. పిట్టపురుగు కనిపించడం లేదు. అంతా నిశ్శబ్దంగా వుంది. వెనక్కు తిరిగి వెళ్ళిపోవాలనిపించింది. ట్రంకు రోడ్డు చేరుకోవాలనిపించింది. ట్రంకురోడ్డుమీద అయితే అప్పుడప్పుడు ఒక కారో, ఒక బండో కనిపిస్తాయి. సాయంకాలంపూట పొలంలో పనులు చేసేవాళ్ళు ఇళ్ళకు వెళ్తూ కనిపిస్తారు. ఈ రోడ్డుమీద వంటరితనం భయపెట్టింది. .చాలాసేపటినుంచి ఇంటికి దూరంగా తిరుగుతున్నాడు. ఇల్లు గుర్తొచ్చింది. అమ్మ గుర్తొచ్చింది. బామ్మ గుర్తొచ్చింది. వంటవాడు బాగా వంట చేసేవాడు. నెయ్యీ, పెరుగూ అమ్మే వడ్డించేది. ఆకు ముందు కూర్చుని అమ్మ వడ్డించే పెరుగుకోసం ఎదురుచూసేవాడు. అమ్మ అలమారులో వున్న అల్యూమినియం గిన్నె తెచ్చి, తన విస్తట్లోకి పెరుగు ఒంపుతూవుంటే తనకు బలేగా వుండేది. ఒకసారిగా కడుపులో ఆకలి మంటలు లేచాయి. కాళ్ళు పీకుతున్నాయి. శరీరం బరువెక్కినట్టుగా ఉంది. పడమటి ఎండ ముఖంమీద పడుతోంది. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి.

బాగా ఆకలేసింది. చెట్లనుంచి పళ్ళు తెంపుకొని తిన్నాడు. పక్కనే వాగులో శుభ్రమైన నీరు ప్రవహిస్తున్నది. నీరు తాగాడు.

కాసేపు విశ్రాంతి తీసుకున్నాడు. ఇంటికి వెళ్ళిపోవాలని బయలుదేరాడు. ఇల్లు తప్ప ఇంకేమీ గుర్తుకు రావడం లేదు. ఇంటికి వెళ్ళిపోవాలి. బోర్డు స్కూలు వ్యవహారం అంతా చాలా చిన్న విషయంగా అనిపించింది. అంత చిన్న విషయాన్ని, పెద్దదిగా ఊహించుకొని ఇన్ని కష్టాలను తెచ్చిపెట్టుకోవడం ఏమిటి? తన గురించి ఆలోచిస్తే తనకే ఆశ్చర్యంగా ఉంది. తను ఒక పెద్ద తెలివితక్కువ దద్దమ్మ. హెడ్‌మాస్టర్ చేతిలో బెత్తం లాక్కుని వుండకూడదు. ఆ

పని చేసినా ఇంటికెళ్ళి నాన్నకు చెప్పివుండాల్సింది. నాన్న రెండు దెబ్బలు వేసేవాడు (అతిగా పోతే అమ్మా, బామ్మా అడ్డుపడి వుండేవాళ్ళు). కాస్త కోప్పడేవాడు. అయినా నాన్న తనను కష్టాల్లోంచి రక్షించేవాడు. చాలామంది నాన్నకు భయపడతారు. ఆట ఇంకా రెండు రోజులే ఉంది. ప్రాక్టీసుకు వెళ్ళివుండాల్సింది. ఆటలో ఓడిపోతే రాజం ఏంచేస్తాడో, తనకు తెలియదు.

స్వామినాథన్ ట్రంకురోడ్డుకు వెళ్ళడానికి తిరిగి నడక సాగించాడు. ట్రంకురోడ్డు ఎక్కాక పర్వాలేదు. తిన్నగా వెళ్తే మాల్గుడి మార్కెట్ రోడ్డు వస్తుంది. అక్కడ్నుంచి ఇంటికి కళ్ళుమూసుకొని వెళ్ళిపోవచ్చు. ఆలస్యంగా వెళ్ళినందుకు అమ్మా, నాన్నా కోప్పడతారు. దారి మర్చిపోయానని చెప్తే సరి! కాని అది చాలా చిన్న సాకుగా కనిపించవచ్చును. ఎవరైనా కిడ్నాప్ చేశారని చెప్తే? పఠానులు ఎత్తుకెళ్లారని చెప్తే సరి. అతి కష్టంమీద తప్పించుకొని వచ్చానని చెప్పవచ్చు.

తను చాలా సేపట్నుంచి నడుస్తున్నట్టుగా అనిపించింది. ఈపాటికి ట్రంకురోడ్డురావాల్సిందేనే! ఆగి చూశాడు. ఇంకా చిన్న రోడ్డుమీదే ఉన్నాడు. రెండువైపులా పళ్ళ చెట్లు వున్నాయి. కాళ్ళకింద భూమి సరిగా ఆనడం లేదు. పండ్లు స్పష్టంగా కనిపించడం లేదు. ఆకులు కూడా స్పష్టంగా కనిపించడం లేదు. చాలా దూరం నడిచి వచ్చినట్టు గ్రహించాడు. నడుస్తూ నడుస్తూ, చిన్న వంకరలో తెలియకుండా మరో చిన్న రోడ్డులో ప్రవేశించాడు. బాగా తెలిసినవాళ్ళకు ఆ మలుపు వున్నట్టు కూడా అనిపించదు. తెలియకుండానే మంపీ అడవుల రోడ్డులోకి ప్రవేశిస్తారు. దాదాపు డెబ్భయ్ మైళ్ళ దూరం వెళ్ళాక ఈ రోడ్డు నాలుగు కాలిబాటలుగా చీలి అరణ్యంలో కలిసిపోతాయి. ఆ మాయదారి మలుపు తిరక్కుండా వుంటే, ఎప్పుడో ట్రంకురోడ్డు ఎక్కివుండేవాడు.

నాలుగువైపులా చీకట్లు ముసురుకున్నాయి. స్వామి గుండె దడ దడలాడింది. పెదవులూ, గొంతూ ఎండిపోతున్నాయి. తను ట్రంకురోడ్డుకు రాలేదని తెలుసుకున్నాడు. చెట్లు మొదటికంటే కూడా దట్టంగా కనిపిస్తున్నాయి. రోడ్డు మరీ ఇరుగ్గా ఉంది. ట్రంకురోడ్డు వెడల్పుగా ఉంటుంది. ఆకాశం కనిపిస్తుంది. ఇక్కడ ఆకాశం చూడాలంటే చెట్ల కొమ్మలు అడ్డంవస్తాయి. దూరంగా మిణుకు మిణుకుమంటూ అక్కడో నక్షత్రం, ఇక్కడో నక్షత్రం కనిపిస్తున్నాయి. స్వామినాథన్ పరుగు తీశాడు. రాలిన ఎండు ఆకులు కాళ్ళకింద నలుగుతూ వింత ధ్వని చేశాయి. ఆ ధ్వనికి చెట్లమీద వున్న పక్షులు రెక్కలు టప టపలాడించాయి. ఆ రెక్కల చప్పుడుకు స్వామి విపరీతంగా

భయపడి పోయాడు. అతడి కాళ్ళు బంధాలుపడినట్టు ఆగిపోయాయి. భయంతో బిగుసుకుపోయి నిల్చున్నాడు. తను ట్రంకురోడ్డుకు చేరాలి. అక్కడ్నుంచి ఇంటికి వెళ్ళాలి. రాత్రి పన్నెండయినా పర్వాలేదు ట్రంకురోడ్డును పట్టుకోవాలి. అది వెడల్పుగా వుంటుంది. రెండువైపుల పొలాలు భయంకరంగా వుండవు. కాని ఇక్కడ చెట్ల కొమ్మలు ఒకదానితో ఒకటి కలిసిపోయి, రోడ్డు మరీ చీకటిగా వుంది. దయ్యాలు నివసించే గుహలా కనిపిస్తోంది.

పక్షుల కలకలం తగ్గింది. ముందుకు నడక సాగించాడు. జాగ్రత్తగా శబ్దం కాకుండా నడుస్తున్నాడు. శబ్దం అయితే మళ్ళీ పక్షులు గోలచేస్తాయి. పరిగెత్తాలని వుంది. బలంకొద్దీ పరిగెత్తి ట్రంకురోడ్డు ఎక్కాలని వుంది. కాని చిన్నగా నడుస్తున్నాడు. పరిగెత్తాలనే కోరిక, పరిగెత్తకూడదనే ఆలోచన ఘర్షణపడుతున్నాయి. శబ్దంలేకుండా నడుస్తున్నాడు. పరిగెత్తాలనే కోరికను బలవంతంగా అణచుకుంటూ నడుస్తున్నాడు. నరాలు తెగిపోతున్నట్టుగా వుంది. పెనుగాలిలో తాడుమీదుగా నడుస్తున్నట్టుగా నడుస్తున్నాడు.

చెవులు బాగా చురుగ్గా పనిచేస్తున్నాయి. అవి అతడి అడుగుల చప్పుళ్ళు వింటున్నాయి. అతి జాగ్రత్తగా అడుగులు వేస్తున్నా, కాలికింద పడిన వస్తువు ఏ కాస్త చప్పుడు చేసినా చెవులు స్పష్టంగా వింటున్నాయి. సగం ఎండిన ఆకుల-బాగా ఎండిన ఆకుల శబ్దం కూడా పెద్దగానే వినిపిస్తోంది. శుభ్రమైన నేలమీద చిన్నగా వేసిన అడుగుల చప్పుడు కూడా వినిపిస్తోంది. ''పిట్-పేట్, పిట్-పేట్, పిట్-పేట్''అంటూ అడుగులు శబ్దం చేస్తున్నాయి. అతని కాళ్ళ శబ్దాలే అతడికి భయాన్ని కలుగజేస్తున్నాయి. తన వెనకనుంచి ఎవరో చిన్నగా, గుసగుసలాడినట్టు ఏదో అంటున్నారు. ఆ మాటలు అతడ్ని బెదిరిస్తున్నాయి. ఎవరో పేరుపెట్టి పిలుస్తున్నారు. అవును తనకు స్పష్టంగానే వినిపించింది. తన పేరు వినిపించింది.''స్వామీ, స్వామీ, స్వామీ...స్వామీ...బలి. బలి తీసుకుంటాను.'' ఎవరు పిలుస్తున్నారు? ఎందుకు బెదిరిస్తున్నారు? దెయ్యం! దెయ్యం! తన వెనకే చప్పుడు కాకుండా నడిచివస్తోంది. తనను బలిస్తుందట. దాని మాటలు మాత్రం వినిపిస్తున్నాయి. మళ్ళీ మళ్ళీ అవే మాటలు. తనను పేరుపెట్టి పిలుస్తూనే ఉంది. స్వామి ఆగాడు. వెనుతిరిగి చూశాడు. అదీ ఆగింది అల్లంత దూరంలో. చాలా పెద్ద ఆకారం. నల్లగా ఉంది. దాని కాళ్ళు దూరం దూరంగా ఉన్నాయి. దాని చేతులు నెత్తిమీద ఉన్నాయి. అవి కదుల్తూ తనను పిలుస్తున్నాయి. స్వామినాథన్ కొయ్యబారిపోయి నిల్చున్నాడు. కనురెప్పలు వాల్చాలంటే భయంగా వుంది. అదును చూసి అది మీదపడితే? అది ఇప్పుడు మాట్లాడడం లేదు. ఐదు

నిముషాలు అలా కొయ్యబొమ్మలా నిలబడే ఉన్నాడు. దెయ్యం కదలక పోవడంతో కొంచెం ధైర్యం వచ్చింది. కళ్ళు పెద్దవి చేసుకొని పరిశీలనగా చూశాడు. ఆ దెయ్యానికి పెద్ద పెద్ద చెట్టుబోదెలూ-కొమ్మలూ ఉన్నాయి.

స్వామినాథన్ ముందుకు సాగాడు. ఇంకెంత దూరంలే! రెండు గజాల్లో ట్రంకురోడ్డు ఎక్కుతాడు. ట్రంకురోడ్డు ఎక్కగానే పాట పాడతాడు. కాసేపు ట్రంకురోడ్డుమీద విశ్రాంతి తీసుకుంటే? కాళ్ళు రాళ్ళలా బిగిసిపోతున్నాయి. కాసేపు ట్రంకురోడ్డుమీద కూర్చుని, మళ్ళీ బయలుదేరితే సరిపోతుంది. పన్నెండయినా ట్రంకురోడ్డుమీద భయం వుండదు. కాసేపు విశ్రాంతి తీసుకుంటే, ఆ తర్వాత ఇంటికి పరుగులమీద వెళ్ళవచ్చు. .

చెట్ల గుబుర్లనుంచి బయటపడ్డాడు. ఆకాశంలో నక్షత్రాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఎదురుగా విశాలమైన రోడ్డు కళ్లముందు ఉన్నది. చీకటి పెద్దగా లేదు. చెట్ల మరమర ధ్వనులు లేవు. తను ట్రంకురోడ్డుకు చేరినట్టు భావించగానే మనసు ఉల్లాసంతో నిండిపోయింది. ఇది అచ్చంగా ట్రంకురోడ్డు మాదిరిగానే ఉంది. ఆకాశంలో మిలమిల మెరుస్తున్న నక్షత్రాలు అతడిలో కొత్త ఉత్సాహాన్ని కలిగించాయి. మనసు తేలిక పడింది. నక్షత్రాలను చూస్తూ పాట పాడాలనిపించింది. ఆ భయంకరమైన ఇరుకు రోడ్డునుంచి బయటపడ్డాననే సంతోషం పట్టలేకుండా ఉన్నాడు. అనవసరంగా విశ్రాంతి తీసుకొని టైం వ్యర్థం చెయ్యదలచుకోలేదు. కొత్త ఉత్సాహంతో ముందుకు పోవాలనుకున్నాడు. వెంటనే మరో ఆలోచన రావడంతో భీతి చెందాడు. ట్రంకురోడ్డు కుడివైపుకు తిరిగితే కాని రాదు. కాని తాను ఎక్కడా మలుపు తిరగలేదు. తిన్నగా నడిచి వచ్చాడు. తను ఆ సంగతి గమనించలేదు. భయంతో కొద్ది నిముషాలు నిల్చుండిపోయాడు. పర్వాలేదు. కుడివైపు తిరిగి నడిస్తే ట్రంకురోడ్డు వస్తుంది. తనకు తానే ధైర్యం చెప్పుకున్నాడు. ట్రంకురోడ్డు ఎక్కడం-ఇంటి మార్గం పట్టడం. కుడి ఎడమలకు చూశాడు. ఏ వైపుకూ రోడ్డు కనిపించలేదు. చీకటిగా వుండడంవల్ల ట్రంకురోడ్డు కనిపించడం లేదు. అంతే! జారిపోతున్న గుండెల్ని ఎగదోచుకుంటున్నాడు. కుడివైపుకు తిరిగాడు. రెండు అడుగులు ముందుకు వేశాడు. మోకాళ్ళ వరకు బురదలో దిగిపోయాడు. బురదలోనుంచి బయటపడి రెండు అడుగులు వేశాడు. పొడువుగా పెరిగిన గడ్డిమొక్కలు అతడి ముఖంమీద గిలిగింతలు పెట్టాయి. గిర్రున వెనక్కు తిరిగాడు. రోడ్డుమీదకు వచ్చాడు.

తన పరిస్థితిని తెలుసుకున్నాడు. అర్ధరాత్రిపూట తనకు తెలియని దారిలో చాలాదూరం నడిచి వచ్చేశాడు. అంతవరకూ ట్రంకురోడ్డును చేరగలననే నమ్మకం అతడ్ని ముందుకు నడిపించింది. ఆ నమ్మకం కేవలం భ్రమ మాత్రమేనని తెలిసి అతడి గుండె తడబడినట్టు అయింది. భయంతో నిలువెల్లా కంపించిపోయాడు. తను ఊహించుకుంటున్న ట్రంకురోడ్డు కేవలం కల మాత్రమేననీ, నిజం కాదనీ తెలుసుకొన్న మరుక్షణం కాళ్ళు కదల్లేదు. ముందుకు వెళ్ళినా వెళ్ళకపోయినా ఒకటే. లక్ష్యరహితంగా, అర్థరహితంగా ముందుకు వెళ్ళడంలో ప్రయోజనం లేదనిపించింది. అర్ధరాత్రి. ఒక్క ఆకు రాలినా శబ్దం వినిపించే నిశ్శబ్దత. ఏదో భయంకరమైన ప్రపంచంలోకి, భూతప్రేత పిశాచాల ప్రపంచంలోకి వెళ్తున్నట్టుగా అనిపించసాగింది.

ఖాళీ గోనెసంచిలా కూలబడిపోయాడు. బిగ్గరగా ఏడవసాగాడు. తండ్రినీ, తల్లినీ, బామ్మనూ, రాజంనూ, మణినీ పిలుస్తూ ఏడ్చాడు. అతడి ఏడుపు అర్ధరాత్రిపూట చెట్లూ, పుట్టలూ, భూతప్రేతాలు తప్ప వినడానికి ఎవరూ లేరు. తనకు తెలిసిన దేవుళ్ళనందర్నీ వేడుకున్నాడు తనను రక్షించమని. ఏనుగు తల గణపతికి ప్రతి శనివారం రెండు కొబ్బరికాయలు కొడ్తానని మొక్కుకున్నాడు. నగ్నంగా గుడిచుట్టూ దొర్లి, దర్శనం చేసుకుంటానని తిరుపతి వెంకటేశ్వర స్వామికి మొక్కుకున్నాడు. దేవుళ్ళు తన మొర ఆలకించి దిగివస్తారన్న ఆశతో కొద్ది క్షణాలు ఎదురుచూశాడు.

అతడి బుర్రంతా ఊహాచిత్రాలతో నిండిపోయింది. వెనకనుంచి పెద్ద పెద్ద అడుగుల చప్పుడు విన్నాడు. వెనక్కి తిరిగి చూశాడు. నల్లటి చీకటి పెద్ద ఆకారంలో తనను సమీపిస్తున్నట్టు కనిపించింది. చాలా ఆలస్యం అయిపోయింది. అది తనను చూసింది. తెల్లటి రెండు దంతాలు కనిపిస్తున్నాయి. తొండం చాచి ఒక చెట్టుకు చుట్టి, కూకటివేళ్ళతో పెకలించి, నేలమీదకు విసిరింది. తనకు తగలకుండా రెండోవైపు దొర్లి తప్పించుకొన్నాడు. దాని చిన్న చిన్న కళ్ళు చూశాడు. తొండం పైకెత్తి క్రోధంగా చూస్తోంది. భయంతో వళ్ళంతా చెమట్లు పట్టి బట్టలు తడిసిపోయాయి. మళ్ళీ అడుగుల చప్పుడు. భయంకరమైన అరుపు. పంజాలు విప్పి తనకోసే వస్తోంది. అది వదులుతున్న గాలి తన చెవులను తాకుతున్నది. ఒక్కసారిగా తలవంచి నేలమీద తిన్నగా పడుకున్నాడు. నల్లచారల పెద్దపులి, తనను చూడలేదు. వెళ్ళిపోయింది. ఆ తర్వాత చిరుతపులి, సింహం, తిమింగలం, పెద్ద మంద-పులుల మంద-చిరుతపులుల మంద, ఏనుగుల మంద, దెయ్యాల గుంపు అతడ్ని చుట్టేశాయి.

దయ్యాలు అతడి చెవును పట్టుకొని పైకెత్తాయి. జుట్టంతా పీకేశాయి. తలనుంచి పాదాలవరకు చర్మం వలిచేశాయి. తన కాళ్ళకు చల్లగా, సన్నగా చుట్టుకుంటున్నది ఏదో?ఏమిటది? ఒక పెద్ద తేలు కొండీ పైకెత్తి తనకేసి వస్తోంది. ఇది మనుషులుండే చోటుకాదు. త్రాచుపామూ, తేళ్ళూ, గబ గబా తనదగ్గరకొస్తున్నాయి. అరుస్తూ పరిగెత్తుతున్నాడు. పరిగెత్తుతూనే వెనక్కు తిరిగి చూశాడు. పాము కన్పించలేదు. తేలు మాత్రం తన వెనక పరిగెత్తుకొస్తూనే ఉంది. ఇక లాభంలేదు. అది తనను వదలదు. శక్తినంతా కూడదీసుకొని వేగం పెంచాడు.

అది క్రికెట్ ఫీల్డ్. అతడు ఎదురు వికెట్‌ను తాకి తన స్థానంలోకి వచ్చి నిల్చున్నాడు. రెండు పరుగులు చేశాడు. మళ్ళీ బ్యాటుతో సిద్ధంగా ఉన్నాడు. వై.ఎం.యు. కేప్టెన్ బంతి విసిరాడు. అతడు సిక్సర్ కొట్టాడు. చెవులు చిల్లులు పడేలా చప్పట్లు. రాజం సంతోషం పట్టలేకుండా ఉన్నాడు. గోడమీదగా అటూ ఇటూ మూడుసార్లు దూకాడు. బ్యాటు అవతలకు విసిరేసి రెండో బంతిని తలతో కొట్టాడు. అది విసిరిన వాడివైపుకు వేగంగా వెళ్తుండగా మధ్యలోనే చెయ్యిచాచి పట్టుకొన్నాడు. బంతిని బౌలర్‌కేసి విసిరాడు. బోర్డు హైస్కూలు హెడ్‌మాస్టరు తల పగిలింది. ఎం.సి.సి. గెలిచింది. బ్యాట్లూ, బంతులూ, వికెట్ కర్రలూ, రాళ్ళూ వై.ఎం.యు. టీముమీదకు విసిరి తమ ఆనందాన్ని వ్యక్తం చేసుకున్నారు. ఎం.సి.సి. గెలిచింది...

స్వామినాథన్ పగలబడి నవ్వుతున్నాడు. నవ్వి నవ్వి అలసిపోయాడు. పూర్తిగా అలిసిపోయాడు.

## 3

రంగా, శనివారం తెల్లవారు ఝామున మంపి అడవులకు ఐదు మైళ్ళ దూరంలో ఉన్న తన గ్రామానికి వెళ్తున్నాడు. మాల్గుడిలో అర్ధరాత్రి దాటాక రెండు గంటలకు బయలుదేరాడు. మధ్యాహ్నానికి తన ఊళ్ళో ఉంటాడు. ఒంటెద్దు బండిలో బయలుదేరాడు. ఎద్దు పగ్గాలు లాగి బండికి కట్టాడు. బండి చిన్నగా వెళ్తోంది. బండిలో పడుకొని నిద్రపోయాడు. ఎద్దు మెళ్ళో గంటలు లయబద్ధంగా చిన్నగా మోగుతున్నాయి.

ఒక్కసారిగా ఎద్దు ఆగిపోయింది. బండి కుదుపుతో రంగాకు మెలకువ వచ్చింది. ఎద్దును అదిలించాడు. రక రకాలుగా తిట్టాడు. పగ్గం లాగాడు. సాధారణంగా అలా చేసినప్పుడు ఎద్దుకు వేగం పెంచే అలవాటు ఉంది. కాని అది కదల్లేదు. పైగా తల గట్టిగా ఊపింది. గంటలు పెద్దగా మోగాయి. రంగాకు దాని ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. బండి దిగాడు. మసక వెలుతుర్లో ఒక

మానవాకారం రోడ్డుకు అడ్డంగా పడివుండడం కనిపించింది. ''ఎవడ్రా నువ్వూ! సోమరి వెధవా! నిద్రపోవడానికి ఈ రోడ్డే దొరికిందా? లే! లే!'' అంటూ అరిచాడు రంగా. వాడు కదలకపోవడం చూసి కోపంగా దగ్గరకు వెళ్ళాడు. ఎత్తి అవతల పారెయ్యాలనుకొన్నాడు.

''అరే! చిన్న పిల్లవాడు! ఇక్కడ నిద్రపోతున్నాడేం?'' అంటూ వంగి చూశాడు. ''శివ! శివా! చచ్చిపోయాడు.'' కాళ్ళూ చేతులూ మంచుతో తడిచిపోయి ఉన్నాయి. కుర్రవాడి చొక్కా చింపాడు. ఛాతీమీద చెయ్యి పెట్టి చూశాడు. శరీరం ఇంకా వేడిగా ఉంది. బ్రతికే ఉన్నాడు. రంగాకు బుర్ర ఆలోచనలో బద్దలౌతున్నట్టనిపించింది. పసివాడు. చూడడానికి పట్నం పిల్లవాడిలా ఉన్నాడు. దుస్తులు అలాగే వున్నాయి. ఇక్కడికి ఎలా వచ్చాడు? ఈ దుస్థితి ఎలా సంభవించింది? ఎవరు తీసుకొచ్చి ఇక్కడ పడేశారు? దెయ్యాలు మనుషుల్ని ఎత్తుకొచ్చి దూరంగా ఊరిబయట పారేస్తాయని తను చాలాసార్లు విన్నాడు. ఏమో ఏం జరిగిందో? ఆ విషయాలు పెద్దవాళ్ళకే వదిలేస్తే సరి! ఫారెస్టు ఆఫీసరు ఉండే ట్రావెలర్స్ బంగళా ఇక్కడకు మూడు రాళ్ళు అవతల వుంది. పిల్లవాడ్ని ఆ ఆఫీసరు దగ్గరకు చేరిస్తే తన బాధ్యత తీరిపోతుంది. ఆ పైవిషయాలు ఆయనే చూసుకుంటాడు. పిల్లవాడిని జాగ్రత్తగా ఎత్తి బండిలో పడుకోబెట్టాడు రంగా.

రంగా బండిలో ముందు కూర్చున్నాడు. కాలెత్తి ఎద్దు డొక్కలో తన్నాడు. పగ్గాలు వదులు చేశాడు. రంగా భాష దానికి తెలుసు. అలా చేసినప్పుడు కదలకపోతే తన పని ఏమౌతుందో కూడా దానికి తెలుసు. తెలివిగా, బలంకొద్దీ పరుగు అందుకొన్నది.

## 4

స్వామినాథన్ కళ్ళు పెద్దవి చేసి చూశాడు. ఆ కళ్ళు భావరహితంగా ఉన్నాయి. పరిసరాల గుర్తింపు ఆ కళ్ళల్లో లేదు. సంవత్సరాల తరబడి అలవాటైన తన గదిలోనే వున్నాననుకున్నాడు. కొద్ది నిముషాల తర్వాత ఏవేవో జ్ఞాపకాలు అతడి తలలో అల్లిబిల్లిగా తిరిగాయి. కనురెప్పలు టప టపలాడించాడు. చేతిని పైకెత్తి గాలిలో ఆడించాడు. తన చుట్టూ వున్న వస్తువుల్ని మార్చి మార్చి చూడసాగాడు. బుర్ర సరిగా పనిచెయ్యడం లేదు. గోడమీద బొమ్మ కనిపించింది. కళ్ళు నిలిపి చూశాడు. అది కేలండరా? తన గదిలో వుండే కేలండరేనా? మళ్ళీ అనుమానం వచ్చింది. అసలు అది కేలండరేనా? అసలు అక్కడ ఏమీలేదా? మంచం పక్కన ఉన్న కుర్చీలో ఒక మానవాకారం కనిపింది. చూపులు ఆ ఆకారంమీద నిలిపాడు. ''బాబూ! ఎలా వుంది?'' అని

అడిగింది ఆ ఆకారం. నాన్నా! నాన్న ఇలా కూర్చున్నాడేం? ఇలా కూర్చోవడం తను ఎప్పుడూ చూడలేదే? స్వామినాథన్‌కు ఆశ్చర్యం కలిగింది.

''నాన్నా!''

''భయపడకు. మీ నాన్న వస్తున్నాడు,'' అన్నాడు ఆ కుర్చీలోని వ్యక్తి. ఆ తర్వాత కొన్ని ప్రశ్నలు వేశాడు. ఒక ప్రశ్నకూ సరైన సమాధానం ఇవ్వలేకపోయాడు స్వామి. అడిగి అడిగి విసుగొచ్చి ఊరుకున్నాడు. స్వామినాథన్ బుర్రలో ఆలోచనలు గజిబిజిగా ఉన్నాయి. ఎవరితను? నాన్న కాదా? నాన్న కాకపోతే ఇక్కడెందుకున్నాడు, నాన్న అయినా తన పక్కన ఎందుకు కూర్చున్నాడు. నాన్న కాడేమో! ఎవరితను? ఏమిటి అడుగుతున్నాడు? ఆ అడిగేదేదో పెద్దగా అడగొచ్చుగా? గొణుగుతాడేం?

తండ్రా? కాదా? అనే సందేహాన్ని రేకెత్తించిన వ్యక్తి లేచి బయటికి వెళ్ళిపోయాడు. అతడు యం.పి.యస్. నాయర్. ఫారెస్టు ఆఫీసరు. ఆ రోజు మంపి అడవుల్లో క్యాంపు చేస్తున్నాడు. ఆ రోజంతా అడవుల్లో తిరిగి సాయంకాలం ఏడు గంటలకు బంగ్లాకు వచ్చాడు. పూర్తిగా బట్టలు మార్చుకోలేదు. బూట్లు విప్పుకుంటూ వుండగా కుర్రవాడి గురించి చెప్పారు. మందులూ, ఆహారం ఇచ్చిన కొన్ని గంటల తర్వాత కుర్రాడు కళ్ళు తెరిచాడు. కాని కుర్రాడి మానసిక స్థితి ఇంకా స్థిమిత పడలేదు. తనను గురించిన వివరాలు ఇవ్వలేకుండా ఉన్నాడు. ఊరి పేరు కూడా ఏదో తమాషాగా ఉంది. ఎక్కడా విన్న పేరు కాదు.

రెండో రోజు ఉదయం నాయర్ కుర్రవాడున్న గదిలోకి వచ్చాడు. కుర్రవాడు అప్పటికే నిద్రలేచి ట్రావెలర్స్ బంగళా కాంపౌండులో తిరుగుతున్నాడు. దగ్గర రాళ్ళు పెట్టుకొని ఒక చెట్టుకేసి చూస్తూ నిల్చున్నాడు. వంగి ఒక రాయి తీసుకొని వెనక్కు నడిచాడు. ఓ క్షణం నిల్చుని చెట్టు బోదెకేసి చూశాడు. ముందుకు పరుగుతీస్తూ రాయి విసిరాడు. రాయి తర్వాత రాయి విసురుతూనే ఉన్నాడు.

''గుడ్‌మార్నింగ్ యంగ్‌మాన్! ఎలా వున్నావు?'' నాయర్ అడిగాడు. ''చాలా థ్యాంక్స్ సార్! నన్ను రక్షించారు పెద్ద కష్టంలోనుంచి.'' ''ఆ, ఆ, ఏదో బిజీగా ఉన్నట్టున్నావ్?''

''నేను ప్రాక్టీసు చేస్తున్నాను సార్! వై.ఎం.సి.తో మేము క్రికెట్ ఆడబోతున్నాం. రాజంకు నా బౌలింగ్ మీదే చాలా నమ్మకంగా ఉంది. మావాళ్ళు నన్ను టెటే అంటారు. నేను బొత్తిగా ప్రాక్టీసు చెయ్యలేదు. నేను చాలా పిచ్చి పని చేశాను. ఊరు వదిలేసి వచ్చాను. సార్, ఇవ్వాళ ఏవారం?''

''ఏం? ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నావ్?''

''దయచేసి చెప్పండి సార్! మా మ్యాచ్ ఇంకెన్ని రోజులుందో తెలుసుకోవాలి.''

''ఇవ్వాళ ఆదివారం.''

''ఏమిటీ! ఏమిటి?'' స్వామినాథన్ చైతన్యం కోల్పోయినవాడిలా నిల్చుండిపోయాడు. ''ఆదివారమా? ఆదివారమా?'' పలవరిస్తున్నట్టుగా అన్నాడు. కాళ్ళముందు రాళ్ళ గుట్ట ఉంది.

''ఏమిటి బాబూ! ఏమైంది?''

''మ్యాచ్ ఆదివారమే!'' తనకు తనే చెప్పుకుంటున్నట్టు గొణిగాడు.

''అంతేకదా? పర్వాలేదు. ఇంకా ఒక రోజు ఉంది. ఇవ్వాళ శనివారం.''

''ఆదివారం అని అన్నారు.''

''కాదు. శనివారం. కావాలంటే కేలండర్ చూడు.''

''మరి ఇందాక ఆదివారం అన్నారెందుకు?''

''పొరబాటుగా అన్నాను.''

''సార్! ఎలాగయినా నన్ను ఆదివారం నాటికి ఫీల్డులో వుండేలా పంపించగలరా?''

''తప్పకుండా పంపిస్తాను. ఇవ్వాళ సాయంకాలానికే పంపిస్తాను. అయితే నువ్వు నీ వివరాలన్నీ చెప్పాలి. ఎవరి అబ్బాయివి? మీ ఊరు పేరేమిటి మొదలైనవి చెప్పాలి.''

## అధ్యాయం 18

# పునరాగమం

### 1

అది ఆదివారం. సమయం మూడున్నర. వై.యం.యు., ఎం.సి.సి. మధ్య ఆట జరుగుతూనే ఉంది. వై.యం.యు. టాస్ గెల్చారు. రెండు గంటలకల్లా ఎనభయ్ ఆరు పరుగులు చేసి ఆల్ అవుట్ అయ్యారు. కెప్టెన్ ముప్పయ్‌రెండు పరుగులు చేశాడు. అందరికీ పైన ఉన్నాడు. ఎం.సి.సి.లో అతడ్ని కొట్టే బౌలర్ లేడు. వేసిన ప్రతి బంతినీ చెడాబడా కొట్టేశాడు. ఎం.సి.సి.ని తుక్కుకింద కొట్టాడు. మంచి బౌలర్ లేని లోపాన్ని గుర్తించాడు రాజం.

విశ్రాంతి తర్వాత మళ్ళీ ఆట రెండున్నరకు ప్రారంభం అయింది. గంటసేపు ఆడినా చెప్పుకోదగ్గ స్కోరు రాలేదు ఎం.సి.సి.లో ముగ్గురు అవుట్ అయ్యారు. స్కోరు ఎనిమిది మాత్రమే. రాజం, మణీ, ఇంకా బ్యాట్ తీసుకోలేదు. రాజం మనసు బాగా లేదు. లోలోపల అందర్నీ తిట్టుకుంటూ ఆట చూస్తూ నిల్చున్నాడు. ఆట సరిగ్గా ఐదున్నరకు ముగుస్తుంది. ఆ లోపల డెబ్భయ్ ఎనిమిది పరుగులు చేసి ఆట డ్రా చెయ్యగలరా? అది అంత తేలికైన విషయం కాదు. మరో ఆరుగురు స్కోరు పెంచకుండానే అవుట్ అయేలా వున్నారు. ఇక పోతే తనూ, మణి మిగుల్తారు. చెరొక నలభై పరుగులు చేస్తే సరిపోతుంది. కొన్ని బౌండరీస్, మరికొన్ని సిక్సర్స్ కొడితే సాధ్యంకావచ్చు.

ప్రహరీ గోడ నీడన నిల్చుని ఆట గమనిస్తున్నాడు రాజం.

''రాజూ ఒకసారి వస్తావా?'' గోడమీదగా తండ్రి కంఠం వినిపించి వెక్కు చూశాడు. గోడపై తండ్రి తల కనిపించింది.

''అంత అర్జంటా నాన్నా?''

''అవును. ఒక్క నిముషం వచ్చిపో.''

రాజం గోడ ఎక్కి దూకాడు. తండ్రి ఒక ఉత్తరం అందించాడు. ఒక్క నిముషం ఉత్తరం చూసి తండ్రికి తిరిగి ఇచ్చేస్తూ అన్నాడు- ''ఓ! అయితే! వాడు బాగానే, క్షేమంగానే ఉన్నాడన్న మాట! అక్కడేం చేస్తున్నాడో నాకర్థం కావడం లేదు.'' రాజం తిరిగి వెళ్ళడానికి సిద్ధం అయ్యాడు.

''ఇది స్వామినాథన్ తండ్రికి పంపిస్తున్నాను. చూడగానే కారు తీసుకొని బయలుదేరుతాడు. నేనూ వెళ్లాల్సి వుంటుంది. నువ్వు కూడా వస్తావా?''

ఓ క్షణం మౌనంగా ఉన్నాడు. ''రాను.'' చాలా ఖచ్చితంగా అన్నాడు.

''నీ మిత్రుణ్ని చూడాలనీ, వెనక్కు తీసురావాలనీ లేదా?''

''నాకనవసరం!'' అనేసి గోడ ఎక్కి అవతలి వైపుకు దూకాడు. మళ్ళీ గోడపక్కన నీడలో వచ్చి నిల్చున్నాడు. నాలుగో బ్యాట్సుమాన్ ఆడుతున్నాడు. ''ఈ కుర్రాడు పర్వాలేదు. బాగానే ఆడుతున్నాడు. ఈ కొద్ది సేపట్లోనే ఆరు పరుగులు చేశాడు. గుడ్!'' అన్నాడు రాజం మణితో.

''వీళ్ళు కనీసం ఏభై పరుగులు చేస్తే మిగతావి మనం పూర్తిచెయ్యొచ్చు.''

రాజం అవునన్నట్టుగా తల ఆడించాడు. కాని అతడి బుర్రలో ఇప్పుడు వేరే ఆలోచన బలీయంగా ఉంది. తండ్రి చెప్పిన విషయం బుర్రలో తిరుగుతున్నది. మణికి వెంటనే చెప్పాలనిపించింది. ''మణీ! స్వామి... అని ఆపేశాడు. చెప్పాలనిపించలేదు. మణి ఎగిరి గంతేశాడు. ''ఆ, స్వామి! ఏమైంది? ఏమైనా తెలిసిందా? చెప్పు రాజం! ప్లీజ్! స్వామి కనిపించాడా?''

''నాకు తెలియదు.''

''ఓ! రాజం! రాజం! ఏదో చెప్పబోయి ఆగిపోయావు. ప్లీజ్! ఏమైంది? చెప్పవా?''

''ఏమీ లేదు. నాకేం తెలియదు. వాడి సంగతి నాకు అనవసరం!''

## 2

స్వామినాథన్‌కు చాలా గర్వంగా ఉంది. అందరూ చాలా బాగా చూసుకుంటున్నారు. వచ్చేపోయేవాళ్లు, తన క్షేమ సమాచారం తెలుసుకొనేవాళ్ళు. ఇల్లంతా హడావిడిగా ఉంది. బామ్మ, అమ్మ తనను చుట్టుకొని తిరుగుతున్నారు. క్షణం వదలడం లేదు. మొదటిసారిగా ఉయ్యాలలో వున్న బుజ్జిగాణ్ని ఎవరూ పట్టించుకోక పోవడాన్ని గమనించాడు.

చాలామంది తండ్రి స్నేహితులు స్వామినాథన్‌ను చూడడానికి వస్తున్నారు. అందరూ ఒకేలా ప్రవర్తిస్తున్నారు. రాగానే స్వామినాథన్‌కేసి చిత్రంగా చూడడం, ఆ తర్వాత ఏవేవో ప్రశ్నలు వెయ్యడం, వెళ్తూ వెళ్తూ కొన్ని సలహాలు ఇవ్వడం-అవే చూపులు, అవే ప్రశ్నలు, అవే సలహాలు. తండ్రి ఒక స్నేహితుడితో బయటకు వెళ్తూ ''స్వామీ! నేను తిరిగి వచ్చేసరికి ఇంట్లోనేవుంటావనీ, నిన్ను వెదకడానికి రోడ్డున పడాల్సిన అవసరం ఉండదనీ అనుకుంటున్నాను,'' అన్నాడు. స్వామి మనసుకు ములుకులు

గుచ్చుకున్నట్టుంది. తన తండ్రి అంత కఠినంగా మాట్లాడి వుండాల్సింది కాదనిపించింది.

తండ్రి వెళ్ళాక ఇంట్లో స్వామికి స్వేచ్ఛ లభించినట్టు అనిపించింది. వచ్చేపోయే వాళ్ళతో కాలక్షేపం బాగానే వుంది. బామ్మకు తెలిసినవాళ్లూ, అమ్మ స్నేహితులూ కూడా వస్తున్నారు. వృద్ధులు-స్వామి తండ్రి పుట్టినప్పుడు వచ్చినవాళ్ళు కూడా వస్తున్నారు. వాళ్ళందరి మధ్య స్వామి తన ప్రత్యేకతను నిలుపుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

స్వామినాథన్ చుట్టూ కూర్చుని పెద్ద పెద్దగా మాట్లాడుతున్నారు వార్త తెలిసి వచ్చినవాళ్ళు. స్వామినాథన్ వంటమనిషిని చూసి చిరునవ్వు నవ్వాడు. వంటవాడు ఆనందపడిపోయి ''బామ్మా, నాన్నా, అమ్మా ఇక కడుపునిండుగా భోజనం చేస్తారు'' అన్నాడు. స్వామినాథన్ ఏదో చెప్పబోయాడు. అంతలో ఓ వృద్ధురాలు, కళ్ళు మూసుకొని చేతులు పైకెత్తి, ఆకాశంకేసి చూపిస్తూ ''అంతా ఆ పైవాడి దయ. లేకపోతే ఆ సమయానికి ఆ ఫారెస్టు ఆఫీసరు అక్కడకెందుకొస్తాడు? ఆ భగవంతుడి దయ లేకపోతే బిడ్డ ఏమైపోయేవాడో?'' అన్నది. ''ఆ ఏడుకొండలవాడికి వేను మొక్కని మొక్కులేదంటే నమ్ము'' అన్నది స్వామినాథన్ బామ్మ.

స్వామినాథన్ తల్లి లేచి వంటింట్లోకి వెళ్ళింది. కొద్ది నిముషాల్లో తిరిగొచ్చి, టిఫిన్ ప్లేటూ, కాఫీ గ్లాసూ స్వామినాథన్ ముందు పెట్టింది. స్వామినాథన్ సంతోషంగా నిముషాల్లో రెండూ లాగించేశాడు.

స్వామినాథన్ జరిగిన సంఘటనలను గుర్తు చేసుకొన్నాడు. ఫారెస్టు ఆఫీసర్ పట్ల తన ప్రవర్తన బాగాలేదు. తల్చుకొని సిగ్గుపడ్డాడు. ఆయన తనకోసం ఎంత శ్రమ తీసుకున్నాడు. రాజం తండ్రీ, తన తండ్రీ, తల్లీ, మరో పోలీసు ఇన్స్పెక్టరూ టాక్సీ దిగి లోపలకు వచ్చారు. పోలీసువాళ్ళు తన చేతులకు బేడీలు వెయ్యడానికి వచ్చారని భయపడ్డాడు. అమ్మ తనను చూడగానే గొల్లున ఏడ్చేసింది. రాజం తండ్రి చాల మంచివాడు. ప్రేమగా పలకరించాడు. నాన్న తనను ఒక మాట కూడా అనలేదు. ఎంత ప్రేమ నాన్న అంత అప్యాయంగా తనను ఎప్పుడూ పలకరించలేదు. తను ఒక్కటి కూడా దాచుకోకుండా అన్ని విషయాలూ వాళ్ళకు చెప్పాడు. డ్రిల్లు క్లాసు, హెడ్మాస్టర్, దారితప్పడం, అన్నీ చెప్పాడు. అంతా విని అందరూ పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు. అమ్మ కొంగుతో ముఖం చాటుచేసుకుని కిస కిస నవ్వింది. కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. ఈ గొడవల్లో ఫారెస్టు ఆఫీసరుకు ''వెళ్ళొస్తాను'' అని చెప్పడం మరిచిపోయాడు. బయలుదేరుతున్నప్పుడు

ఆయన కారు దగ్గరకు వచ్చి నిల్చున్నాడు. కారు డోర్ తెరిచి పట్టుకొన్నాడు. కారు బయలుదేరిన కొంతసేపటికి తను చేసిన తప్పు తెలిసొచ్చింది. తనను కష్టాలనుంచి, ఇంటికి పంపించిన ఒక మంచి మనిషికి ''గుడ్‌బై'' కూడా చెప్పకుండావచ్చేశాడు.

చుట్టూ చేరినవాళ్ళు, ఆ బండివాడు చూడకపోతే ఏం జరిగి వుండేదో ఊహాగానాలు చేస్తున్నారు. రక రకాల భయంకరమైన ఊహాదృశ్యాలను చిత్రిస్తున్నారు.

''అరే స్వామీ!'' అంటూ అరుస్తూ వచ్చాడు మణి ఉద్వేగంగా.

ఇద్దరూ ఇంటి వెనకకు వెళ్ళి కూర్చున్నారు.

''నువ్వు చచ్చిపోయి వుంటావనే అనుకున్నారు స్వామీ!''

''దాదాపు చచ్చి బతికాను.''

''నువ్వొట్టి పిరికి దద్దమ్మవురా! హెడ్‌మాస్టరుకుభయపడిపారిపోవడం ఏమిటి! రాజం నాకు అన్ని విషయాలూ చెప్పాడు. నువ్వు కనిపిస్తే నీ భుజాలు విరగ్గొట్టాలనుకొన్నాను. స్కూలుకు వచ్చి రాజంను చూసి వెళ్ళిపోయావు. నన్ను కలవలేదు. నాకు భలే కోపం వచ్చింది.''

''టైం లేదురా. తొందర్లో ఉన్నాను.''

''స్వామీ! నిన్ను చూస్తుంటే నాకు చాలా ఆనందంగా వుందిరా. నేను ఎంత బాధపడ్డానో నీకు తెలియదు. ఇన్ని రోజులు ఎక్కడున్నావురా?''

''నేను...నాకు...నాకు...నిజంగా...పూర్తిగా తెలియదురా! ఎక్కడ వున్నానో తెలియదు.''అంటూ జరిగిన విషయాలన్నీ చెప్పాడు. దయ్యాలూ, ఏనుగూ, తేలూ, పామూ, అన్నింటి గురించి చెప్పాడు.

''నేను ఎప్పుడూ అంటూ వుంటానుకదూ నువ్వొట్టి పిరికివాడివని? భయపడి వుండకపోతే హాయిగా వెనక్కు వచ్చేసి వుండేవాడివి. ఉన్నవీ లేనివీ ఊహించుకొని భయపడిపోయావు.''

స్వామి మణి వెలిబుచ్చిన అభిప్రాయాలను శాంతంగా అంగీకరించాడు. ''బండివాడు నన్ను రక్షించాడంటే నేను నమ్మలేకుండా వున్నాను. నాకు అది గుర్తులేదు.''

''ఆ బండివాడు దీపావళికి కానీ సంక్రాంతికి కానీ వస్తే పిసినారిగా ప్రవర్తించకు. వాడికి సంచినిండుగా బంగారం ఇవ్వవచ్చు. వాడే నిన్ను తీసుకెళ్ళి ఆ ఆఫీసరుకు అప్పగించకపోతే, ఏ పులో తినేసి వుండేది.''

''ఇంకొక ఛండాలపు పని చేశానురా. ఆ ఫారెస్టు ఆఫీసరుకు వస్తూ వస్తూ కనీసం 'వెళ్ళొస్తానని' కూడా చెప్పలేదు. కారు బయలుదేరే వరకు ఆయన కారు పక్కనే నిల్చుని ఉన్నాడు.''

''ఆయన అంత దగ్గరగా నిల్చివుంటే నోటికి తాళం ఎందుకు వేసుకున్నావ్?''

''ఆ ఆలోచన తట్టలేదు కారు బయలుదేరిన సగం దూరం వచ్చేవరకు.''

''నువ్వు అన్ని విషయాలూ చాలా తేలిగ్గా తీసుకుంటావు. దేన్నిగురించీ శ్రద్ధగా ఆలోచించవు. ఆయనకు థ్యాంక్సు చెప్పి ఉండాల్సింది.''

''ఇప్పుడు నన్నేం చెయ్యమంటావో చెప్పు. ఉత్తరం రాసేదా?''

''రాయి. ఆయన అడ్రసు తెలుసా?''

''మా నాన్నకు తెలుసు.''

''ఏమని రాస్తావూ?''

''ఆయనకు...ఏం రాయాలో తెలియడం లేదు. నాన్నను అడిగి రాస్తాను. మంచి ఉత్తరం రాస్తాను. కృతజ్ఞతలు తెలియజేస్తాను నన్ను రక్షించి, మ్యాచ్ టైంకు నన్ను ఇంటికి చేర్చినందుకు.''

''ఏమిట్రా అంటున్నావు?''

''నీకు చెముడు వచ్చిందా? నాన్నను అడిగి మంచి ఉత్తరం రాస్తాను. అంతే.''

''అదికాదు. ఏదో మ్యాచ్ అన్నావు? ఏమిటది?''

''అవును! మ్యాచ్ అన్నాను.''

''నీకు పిచ్చెక్కిందా? మ్యాచ్ సమయానికి వచ్చాననంటావేం?'' మణి ఆట గురించి చెప్పాడు. ఎం.సి.సి. ఓడిపోయిందని చెప్పాడు. ఓడిపోవడానికి కారణం స్వామి గైర్‌హాజర్ కావడమేనని కూడా చెప్పాడు.

''ఇవ్వాళ ఆట జరిగిందా?''

''అవును.''

''ఇవ్వాళ ఎందుకు ఆడారు?''

''మరెప్పుడుఆడాలి?''

''ఇవ్వాళ శనివారమేకదా?''

''ఎవరు చెప్పారు ఇవ్వాళ శనివారం అని?''

''ఆ ఫారెస్టు ఆఫీసరు చెప్పాడు. ఇవ్వాళ శనివారం అని చెప్పాడు.''

''వెళ్ళు. వెళ్ళి వాడితో చెప్పు వాడికి బుర్ర లేదని.''

స్వామినాథన్ ఆ రోజు శనివారం అని వాదించాడు. మణికి వళ్ళు మండి తంతానని బెదిరించాడు. గుండెలమీద కూర్చుని పీక నొక్కుతానన్నాడు. స్వామినాథన్ మౌనంగా ఉండిపోయాడు. కొద్ది నిముషాల తర్వాత అన్నాడు- ''వాడికి నేను ఉత్తరం రాయను. నన్ను మోసంచేశాడు.''

''ఎవరు మోసం చేశారు?''

''ఇంకెవరు ఆ ఫారెస్టు ఆఫీసరు. రాజం ఏమంటున్నాడు?''

''రాజం చాలా చాలా అంటున్నాడు. అవన్నీ నీకు చెప్పదల్చుకో లేదు. వాడి ముందుకు వెళ్ళకు. వాడు ఇంకెప్పుడూ నీతో మాట్లాడడు. నిన్ను కాల్చేస్తాడు కనిపిస్తే.''

''నేనేం చేశాను?''

''ఇంకా ఏం చెయ్యాలి? మమ్మల్ని ముంచేశావు. చివరి నిముషంలో జారిపోయేవాడివి ఎం.సి.సి.లో ఎందుకు చేరావు? పారిపోవాలనుకున్నవాడివి ముందుగానే మాకెందుకు చెప్పలేదు? ఆ రోజు స్కూలుకు వచ్చి రాజంతో మాట్లాడావు. కాని అసలు విషయం చెప్పకుండా దాచావు. అదే అంటున్నాడు రాజం.''

స్వామినాథన్ మౌనంగా ఏడ్చాడు. ఇద్దరి మధ్యా రాజీ కుదర్చమని మణిని ప్రాధేయపడ్డాడు. తను రాజంను ఎంత ప్రేమిస్తున్నానో చెప్పమన్నాడు. తన క్షమాపణలను అందజెయ్యమన్నాడు. మణి అందులో ఏ ఒక పని చెయ్యనని ఖచ్చితంగా చెప్పాడు. ''రాజం గురించి నీకు బాగా తెలియదు. వాడు రత్నంలాంటి వాడు. నీతో స్నేహంచెయ్యడం చాలా కష్టం,'' అన్నాడు మణి.

''రాజం నన్ను చూస్తే అన్నీ మర్చిపోతాడు. రేపు ఉదయం వాడిని కలుసుకుంటాను.'' ఆశను చంపుకోలేక అన్నాడు స్వామినాథన్.

''నువ్వు ఆ స్కూలుకు వెళ్తున్నావా?'' మణి విషయం మారుస్తూ మళ్ళీ అడిగాడు.

''వెళ్తాను. వచ్చేవారం వెళ్తాను. మా నాన్న హెడ్‌మాస్టరుతో మాట్లాడాడు. అన్నీ సవ్యంగానే జరిగిపోతాయనుకుంటా. ఆయనకు ఆ బోర్డు స్కూలు వ్యవహారమంతా తెలిసినట్టే ఉంది.''

''అవును. రాజం, నేనూ మీ నాన్నకు అన్ని విషయాలూ చెప్పాం.'' అన్నాడు మణి.

''అవును. ఆ స్కూలుకే వెళ్ళక తప్పదు. అదే నాన్న అంటున్నాడు.''

## అధ్యాయం 19

# వీడ్కోలు బహుమతి

### 1

పది రోజులు గడిచాయి. అది మంగళవారం ఉదయం. స్వామినాథన్ అతి కష్టంమీద ఐదు గంటలకు నిద్ర లేచాడు. రైలు మాల్గుడి స్టేషన్‌కు రావడానికి ఇంకా ఒక గంట సమయం ఉంది. స్టేషన్‌లో బండి నాలుగు నిముషాలు మాత్రమే ఆగుతుంది. ఆ రైలు శాశ్వతంగా రాజంను తననుంచి దూరంగా తీసుకెళ్ళబోతున్నది.

స్వామికి ఈ విషయం, రాత్రి పొద్దుపోయి, మణి వచ్చి చెప్పేవరకు తెలియదు. రాజం తండ్రికి బదిలీ అయింది. తిరుచునాపల్లికి కుటుంబం మొత్తం వెళ్ళిపోతున్నది. మణికి ఈ విషయం వారం రోజుల కిందటే తెలుసు. స్వామికి చెప్పవద్దని రాజం హెచ్చరించాడు మణిని. కాని చివరి నిముషంలో ఉండబట్టలేక క్రితం రాత్రి వచ్చి స్వామికి చెప్పాడు. అలా చెప్పినట్టు రాజంకు తెలియదు.

స్వామినాథన్‌కు బుర్ర తిరిగిపోయింది. ఈ ప్రపంచమంతా ఖాళీ అయిపోయినట్టు అనిపించింది. రాజం లేని లాలీ ఎక్స్టెన్‌షన్ బంగళాను ఊహించలేకుండా ఉన్నాడు. జన్మలో ఎప్పుడూ ఆ ఇంటివైపు వెళ్ళకూడదనుకున్నాడు. మణిమీద పిచ్చిగా అరిచాడు. మణి శాంతంగా భరించాడు. రాజం లేని ప్రపంచాన్ని ఊహించలేకుండా ఉన్నాడు స్వామినాథన్. రాజం లేకుండా సాయంకాలాలు ఎలా గడపటం? శెలవుల్లో రాజం లేకుండా ఎలా జీవించటం?తను ఇంకెవర్ని సన్నిహిత మిత్రుడుగా భావించగలడు? తను తిరిగి వచ్చాక రాజంను చూడడానికి ఒక్కసారి కూడా వెళ్ళలేదు. ఆ భావం తన తప్పును ఎత్తి చూపుతోంది. ఏదో భయం, సిగ్గు, తప్పు చేశాననే భావం-ఇవన్నీ కలిసి స్వామినాథన్‌ను రాజం దగ్గరకు పోనివ్వలేదు. ఏరోజుకారోజు వెళ్ళాలనుకొనేవాడు. మళ్ళీ ధైర్యం చాలేది కాదు. రెండుసార్లు ఉండబట్టలేకరాజం ఇంటి గేటువరకూ వెళ్ళి తిరిగొచ్చాడు. మణి వచ్చి ఆ వార్త చెప్పగానే పరిగెత్తుకెళ్ళాలనిపించింది. కాని తనకు తనే సర్ది చెప్పుకున్నాడు. ఉదయం స్టేషనుకు వెళ్ళడం మంచిదని భావించాడు.

''మణీ! రేపు ఉదయం ఐదు గంటలకు నన్ను నిద్ర లేపుతావా?''

''లేదు. ఈ రాత్రి నేను రాజం ఇంటిదగ్గరే పడుకుంటున్నాను. రేపు ఉదయం రాజంతోపాటు స్టేషన్‌కు వెళ్తున్నాను,'' అన్నాడు మణి.

ఓ క్షణం మణిమీద స్వామినాథన్‌కు ఈర్ష్య కలిగింది. మణి రాజం ఇంట్లో పడుకుంటాడు. చివరి నిముషం వరకు వాడితో ఉంటాడు. అర్ధరాత్రిదాకా ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటారు. నవ్వుకుంటారు. తను దూరంగా ఉండిపోతాడు. మణిని రాజం ఇంటికి వెళ్ళకుండా ఆపడానికి ప్రయత్నించాడు.

మణి వెళ్ళిపోయాడు. స్వామినాథన్ తన పెట్టె తెరిచాడు. చూస్తూ ఉండిపోయాడు కొద్ది క్షణాలు. అందులో నుంచి ఒక వస్తువు ఏదైనా రాజంకు వీడ్కోలు బహుమతిగా ఇవ్వాలనుకొన్నాడు. ఎన్నో వస్తువులు చిందరవందరగా పడివున్నాయి. చిన్న కార్డుబోర్డు పెట్టె ఉంది. ఒకప్పుడు స్వామినాథన్‌కు ఆ పెట్టె అంటే ప్రాణం. ఒక బొమ్మవాచి ఉంది. బొమ్మల పుస్తకాలున్నాయి. మేకులు ఉన్నాయి. కత్తెర్లు ఉన్నాయి. పాడయిపోయిన మిషన్ల తాలూకు చిన్న చిన్న భాగాలు ఉన్నాయి. అందులో అన్నిటికంటే ఆకర్షణీయంగా ఉన్నది ఒకే ఒక వస్తువు. అది సంవత్సరం క్రితం రాజం స్వామికి ఇచ్చిన మిషను. మిగతా వస్తువులు బహుమతిగా ఇవ్వతగినవిగా కనిపించలేదు. ఆ మిషన్ చూస్తుంటే ఎన్నెన్నో విషయాలు జ్ఞాపకం వచ్చాయి. మతిపోయినట్టే అయింది. ఇది తిరిగి ఇచ్చేస్తే? ఇప్పుడు రాజం తనకు మిత్రుడు కాడు. పెట్టెలోనుంచి మిషన్ బయటకు తీశాడు. స్టేషన్‌కు తీసుకెళ్ళి రాజంకు ఇచ్చెయ్యాలనుకున్నాడు. కాని కొద్ది క్షణాల తర్వాత మనసు మార్చుకున్నాడు. దాన్ని మళ్ళీ పెట్టెలో పెట్టేశాడు. అలా మనస్సు మార్చుకోవడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి, స్వామికి ఆ మిషనంటే చాలా ఇష్టం. రెండు, సంవత్సరం క్రితం బహుమతిగా ఇచ్చిన వస్తువును తిరిగి ఇవ్వడం అంటే రాజంను అవమానించడమేననే భావం. రాజం పుస్తకాలు బాగా చదువుతాడు. ఏదైనా పుస్తకం ఇస్తే? ఏ పుస్తకం ఇవ్వాలి? క్లాసు పుస్తకాలు ఇవ్వలేడు. స్వామిదగ్గర తనకు ఇష్టమైనది ఒకే ఒక పుస్తకం ఉంది (ఇష్టం కాబట్టే ఆ పుస్తకాన్ని చాలా జాగ్రత్తగా పెట్టెలో దాచుకొన్నాడు). అది ''ఆండ్రసన్ ఫైరీటేల్స్'' అనే పుస్తకం. కొత్తగా, శుభ్రంగా ఉన్నది. తండ్రి చాలారోజుల క్రితం స్వామినాథన్ కోసం మద్రాసునుంచి తెచ్చాడు. స్వామినాథన్ దాన్ని పూర్తిగా చదవలేదు. అందులో అతడికి అర్థంకాని ఇంగ్లీషు పదాలు చాలా ఉన్నాయి. ఆ పుస్తకం పెట్టెలోంచి తీశాడు. తన టేబుల్ దగ్గరకు వెళ్ళి లోపలి పేజీలో ''నా ప్రియ మిత్రుడు రాజంకు'' అని రాశాడు.

## 2

స్వామినాథన్ స్టేషన్ చేరేసరికి ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. చేతిలో 'ఆండ్రసన్ ఫైరీటేల్స్' పుస్తకం ఉన్నది. ఆ పుస్తకం ఆకర్షణీయంగా ఉన్నది. అప్పుడే నిద్రలేచిన స్టేషన్‌మాస్టరు బల్లముందు కూర్చుని పనిచేసుకుంటున్నాడు. బల్లమీద కిరసనాయిల్ దీపం ఉంది. టెలిగ్రాఫ్ సంకేతాల్ని పట్టించుకోవడం లేదు. సంకేతాలు వరసగా వస్తూనే ఉన్నాయి.

ఒక కారు వచ్చి స్టేషన్ ముందు ఆగింది. రాజం, అతడి తండ్రి, తల్లి, మరో కొత్త వ్యక్తి, మణి, కారులోనుంచి దిగడం చూశాడు స్వామినాథన్. అతడు రాజం దృష్టిలో పడకుండా తప్పుకున్నాడు. ''యూరోపియన్ బాయ్''లా డ్రెస్ చేసుకొని, 'టక్ టక్' ప్లాట్‌ఫారంమీద నడుస్తున్న రాజంను చూడగానే, స్వామినాథన్ నిర్ణయం నీరు కారిపోయింది. ఆ డ్రెస్సూ, ఆ హుందాతనం చూస్తుంటే, స్వామినాథన్‌లో న్యూనతాభావం తలెత్తింది. రాజం ముందు తనకు తాను చాలా చిన్నవాడిగా కన్పించాడు. స్వామినాథన్ వెనక్కు తగ్గి రాజం దృష్టిలో పడకుండా తప్పుకున్నాడు.

ప్లాట్‌ఫారం క్రమ క్రమంగా పోలీసు ఆఫీసర్లతో నిండిపోయింది. వాళ్ళ మధ్యలో వున్న రాజంను కలుసుకోవడం అంత తేలిక కాదు. రాజం తండ్రి పక్కన నిల్చుని ఉన్నాడు. చుట్టూ యూనిఫారంలో ఉన్న పోలీసులు. ఇద్దరు పోలీసుల మధ్య ఏర్పడిన సందులోనుంచి రాజం ఎడమ కాలు మాత్రం కనిపిస్తోంది స్వామినాథన్‌కు. పోలీసులిద్దరూ దగ్గరగా కదిలేసరికి ఆ కాలు కూడా కనిపించకుండా పోయింది. స్వామినాథన్ చుట్టూ తిరగసాగాడు ఏ సందులోనుంచి అయినా రాజం కనిపిస్తాడనే ఆశతో.

స్వామినాథన్ మణి కోసం వెదికాడు. మణి కనిపించాడు.

''మణీ! రాజం వెళ్ళిపోతున్నాడు.''

''అవును! వాడువెళ్ళిపోతున్నాడు.''

''మణీ! రాజం నాతో మాట్లాడతాడా?''

''ఎందుకుమాట్లాడడు? తప్పకుండామాట్లాడతాడు.''

రాజం, రాజం తండ్రీ రైలుపెట్టెలోకి ఎక్కారు. తలుపు మూసి, గడియ తిప్పారు.

''మణీ! ఈ పుస్తకం రాజంకు ఇవ్వాలి.''

టైంచాలా తక్కువ ఉంది. గంట మోగింది. అతి ప్రయత్నం మీద జనాన్ని తోసుకుంటూ ముందుకు వెళ్ళారు. స్వామినాథన్‌కు ఏమీ కనిపించడం లేదు. డోరు దగ్గరకు చాలా కష్టంగా చేరుకున్నాడు. వెనకనుంచి

జనం నెడుతున్నారు.''రాజం! చూడు! స్వామి వచ్చాడు నీకు గుడ్‌బై చెప్పడానికి.'' పెద్దగా అరిచి చెప్పాడు మణి. స్వామినాథన్ మునికాళ్ళమీద నిల్చుని ఎగిరెగిరి చూస్తున్నాడు. కిటికీలోనుంచి ఓ తల తొంగిచూస్తూ అన్నది- ''మణీ! మిత్రమా! గుడ్‌బై. నన్ను మరిచిపోకు.''

''గుడ్‌బై మిత్రమా! స్వామి ఇక్కడే ఉన్నాడు చూడు.'' రాజం మెడ చాచాడు. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. స్వామినాథన్ ఉద్రేకంగా అరిచాడు- ''ఓ రాజం! రాజం! మిత్రమా! వెళ్ళిపోతున్నావా? నువ్వెళ్ళిపోతున్నావా?''రాజం ఏదో అనడానికి ప్రయత్నించాడు (అలాగే అనిపించింది స్వామికి).అంతలో గార్డు జండా ఊపాడు. చెవులు బద్దలయ్యేలా ఇంజను కూతపెట్టింది. ఆ తర్వాత ఇంజను రొద-గొలుసుల రాపిడినుంచి వచ్చే ధ్వని. రాజం చెప్పాలనుకొన్న మాటలు చెప్పకుండానే ముఖం దూరంగా జరిగిపోతున్నది.

''మణీ! ఈ పుస్తకం రాజంకు ఇవ్వాలి'' గాభరాపడిపోతూ పుస్తకం మణి చేతిలో పెట్టాడు స్వామి. ప్లాట్‌ఫారం మీద రైలుతోపాటు పరిగెత్తుతున్నాడు మణి. ''గుడ్‌బై రాజం! ఇదుగో! స్వామి నీకు ఈ పుస్తకం ఇవ్వమన్నాడు.''అని అరిచాడు మణి. రాజం చెయ్యి కిటికీలోనుంచి బయటికి చాపి పుస్తకం అందుకొన్నాడు. చెయ్యి ఊపాడు రాజం. స్వామి పిచ్చివాడిలా చెయ్యి ఊపుతూనే ఉండిపోయాడు కొద్ది నిముషాలు.

స్వామినాథన్ మణి ప్లాట్‌ఫారంమీద నిల్చుని వెళ్ళిపోతున్న రైలును కన్నార్పకుండా చూస్తున్నారు. రైలు వెనక పెట్టెకు ఉన్న ఆ చిన్న ఎర్రటి దీపం, నిముష నిముషానికీ చిన్నదైపోతూ అదృశ్యం అయింది. ఇంజను రొద, పట్టాల రాపిడినుంచి వస్తున్న శబ్దం, రైలు కూత, దూరంగా చిన్నగా వినిపిస్తున్నాయి. ''మణీ! పుస్తకం తీసుకున్నాడు. నాకు చాలా సంతోషంగా ఉంది. ఏదో అన్నాడు. నాకు సరిగా వినిపించ లేదు ఇంజను మోతలో. మణీ! నన్ను చూస్తూ చెయ్యి ఊపాడు. అవును! నన్ను చూస్తూ, నాకోసే చెయ్యి ఊపాడు. కాదనకు మణీ!''

''అవునవును!'' మణి అంగీకరించాడు.

స్వామినాథన్ ఒక్కసారిగా నిండుకుండ బద్దలైనట్టు భోరుమన్నాడు.

''ఊరుకో! పిచ్చివాడిలా ప్రవర్తించకు,'' అన్నాడు మణి.

''నన్ను ఎప్పుడైనా తల్చుకుంటాడా?'' వెక్కిళ్ళ మధ్య అడిగాడు.

''తప్పకుండా!'' అని ఓ క్షణం మౌనం వహించాడు. ''బాధపడకు వాడు మాట్లాడలేదని. నీకు ఉత్తరం రాస్తాడు,'' మళ్ళీ అన్నాడు మణి.

''నీకెలా తెలుసు?''

''నాతో అన్నాడు.''

''కాని వాడికి నా అడ్రసు తెలియదు.''

''నన్ను అడిగాడు. నేను ఇచ్చాను.''

''అబద్ధం! అయితే చెప్పు! నా అడ్రసు ఏమిటి?''

''అదీ...నీ అడ్రసూ...రాజంకు ఇచ్చేశాను.''

స్వామినాథన్ తల పైకెత్తి మణి ముఖంలోకి పరిశీలనగా చూశాడు. నిజం చెబుతున్నాడో అబద్ధం చెబుతున్నాడో తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. కాని మణి ముఖంలో మొదటిసారిగా ఎలాంటి భావమూ కనిపించ లేదు.

Printed at Print Perfect A6/1, Mayapuri Phase I, New Delhi 110 064.